మహిళలకు
అపూర్వ
అవకాశం!




# సేవింగ్ సిండికేట్

అపురూ
పొదుపు
పథకం!

## మహిళా గ్రూప్ (స్త్రీలకు మాత్రమే పరిమిత

- మీరు పొదుపు చెయ్యవలసింది ఒకేసారిగా రూ. 105/- లేదా మొదటి నెల రూ. 25/- మిగిలిన 4 నెలలు వరుసగా రూ.21/- చొ
- ప్రతి ఒక్కరికి ఒక ఉచిత కానుక! తమ సభ్యత్వ చందా చెల్లించి కొద్ది రోజులలో యివ్వబడుతుంది!
- మీ యీ చిన్న పొదుపునకు ఉచిత బహుమతులుగా 1లక్ష 25 వేలు, 25 వేలు, 15 వేలు, 10 వేలు, 5 వేలు, 2 వేలు, యింకా 18,739 బహుమతులు!

**మీ సొమ్మునకు పూర్తి భద్రతగా స్టేట్ బ్యాంక్ ఆఫ్ హైదరాబాద్ వారి క్యాష్ సర్టిఫికెట్లు యివ్వబడుతున్నాయి!**

- మీ సభ్యత్వ చందా రూ.105/- లేదా మొదటి నెల రూ. 25/- బ్యాంకు డ్రాఫ్ట్/ఐ.పి.ఒ/మనియార్డర్లు/స్థానిక చెక్కుల ద్వారా M/S. గోదావరి సేవింగ్ సిండికేట్ పేరున చెల్లించండి!

వివరాలకు: **M/S. గోదావరి సేవింగ్ సిండికేట్** (మహిళా విభాగం)
గాంధీనగరం * విజయవాడ-520002.



రిజిస్టర్డ్ ఆఫీస్: మెయిన్ రోడ్, రాజమండ్రి-1. ఫోన్: 3383.
తెలంగాణా ప్రాంతీయశాఖ: సుల్తాన్ బజార్, హైదరాబాద్-1

బ్రాంచీలు:
- గాంధీనగరం, విజయవాడ-3.
- నెహ్రూరోడ్, కర్నూలు.
- విజయామాన్షన్స్, ఆంధ్రా బ్యాంకు బిల్డింగ్, విజయనగరం.

- మహిళా ప్రతినిధులు కావలెను! సంప్రదించండి!!

# మీపిల్లలకు అధిక శక్తినిస్తుంది...
# అగ్రస్థానం చేకూర్చుతుంది...
# కోకో-రుచిగల బోర్న్‌విటా!

Scan
Bindu



**బోర్న్‌విటాలో ఇప్పుడు అధికంగా కోకో ఉన్నది. దానిని మరింత రుచికరంగా-ఆరోగ్యంగా చేసేందుకు**
అంతేకాక బోర్న్‌విటా మాల్ట్, పాలు మరియు పంచదారల పోషకత్వపు గుణాలతో నిండియున్నది.

వేడి కప్పు పాలలో రెండు చెంచాలతో రుచికరమైన పోషకత్వం గల పానీయం తయారవుతుంది. మీ పిల్లలకు ప్రతిరోజూ బోర్న్‌విటా ఇవ్వండి. రోజుకు రెండుసార్లు వారి ఎదిగే శరీరాలకు అమూల్యమైన పోషకత్వం చేకూర్చేందుకు సహాయపడుతుంది మీకు గూడా బోర్న్‌విటా అవసరం. వారికి తగ్గటుగా ఉండేందుకు!

**క్యాడ్‌బరీస్ బోర్న్‌విటా**

అధిక కోకో గలది: అధిక రుచి, అధిక పోషకత్వం!







OBM 8376 B/TL

# వనిత

స్త్రీ జన మాస పత్రిక

సంపుటి : 4 సంచిక : 1

జూలై : 1978

విడి ప్రతి : రెండు రూపాయిలు

సం॥ర చందా : ఇరవైనాలుగు రూపాయిలు

శ్రీలంక : రూ. 2.

మలేసియా : 80 సెంట్స్

చిరునామా :

చందమామ బిల్డింగ్స్

మద్రాసు-600 026


'వనిత'లో తరచుగా కుటీరపరిశ్రమలు గురించి ప్రచురించడం మంచిదే. కానీ పత్రికల్లో చాలా మంది విద్యార్థినులు ఉంటారు. వాళ్ళు తమ చదువులు ముగిసిన తర్వాత ఉద్యోగాన్వేషణ ప్రారంభిస్తారు. కొందరు చదువుకుని, తమ అభిరుచికి తగిన ఉద్యోగాలు లేక, లేదా అలాంటి ఉద్యోగాలకు తగిన శిక్షణ ఎక్కడ, ఎలా లభిస్తుందో తెలియక మధనపడుతూ కాలాన్ని వృథా చేస్తుంటారు. వనితలు తమ కాళ్ళ మీద తాము నిలబడి, తమ వ్యక్తిత్వాన్ని కాపాడుకోడానికి ఆర్థిక స్వాతంత్ర్యం ఎంతైనా అవసరం. ఆ ధోరణిలో జీవనోపాధికోసం–ఉద్యోగాన్వేషణ చేసే వనితలు ఎందరో ఉన్నారు. అటువంటివారికి ఉపయోగకరమైన సలహాలు లభించే శీర్షిక ప్రవేశపెడితే – వనితావనికి చాలా మేలు చేసినవారవుతారు. ఈ అంశానికి సంబంధించి సలహాలు యివ్వడానికి కొన్ని పట్టణాల్లో 'ఎంప్లాయ్‌మెంట్ ఎక్చేంజ్'లు ఉన్నా, వాటివల్ల ప్రయోజనం చాలా తక్కువ. పైగా అన్ని వూళ్ళల్లోనూ అవి వుండవుకదా!

**కె. కృష్ణవేణి** — **కోరుకొండ**

సుఖశాంతులతోకూడిన దాంపత్య జీవితానికి స్నేహపూరితమైన ప్రేమ పట్టుకొమ్మే అవుతుంది. ప్రేమ ఎప్పుడు, ఎక్కడ, ఎవరిపట్ల కలుగుతుందో చెప్పలేము, కాని ఈ సుమం నేలరాలి వాడిపోకుండా ఉండాలంటే ముందు ప్రేమకు, ఆకర్షణకు ఉన్న తేడాను గమనించగలగాలి. ఈనాడు ప్రేమ వివాహాలు విఫలమౌతున్నాయంటే దానికి కారణం చిన్న చిన్న ఆకర్షణలకే వయస్సుపొంగులో 'ప్రేమ' అనే పరదా తగిలించి భ్రమపడటం వల్లనే!

**శైలజ** — **బాపట్ల**



ఈ శీర్షిక 'అభిప్రాయాలు'లో ప్రచురింపబడే ప్రతి లేఖకూ ఐదు రూపాయలు పారితోషికం వుంటుంది. పక్క పేజీలోని 'ఉత్తరాలు' (కొత్త శీర్షిక)లో వచ్చే లేఖల సారాంశానికి పారితోషికం వుండదు.

మే ఒకటవ తేది వనితలోని ప్రేమ వివాహాలు అన్న వ్యాసంలో రాజ్యలక్ష్మీదేవిగారు ప్రస్తావించిన విషయాలు సరి అయినవే అనిపించింది. ప్రేమించి పరిణయమాడటం మనకీనాటి సంప్రదాయం కాదు. అలనాటి ప్రబంధకన్యల నుండీ ఆనవాయితీగా వస్తున్నదే. కాకపోతే రాజ్యలక్ష్మిగారు అన్నట్టు వైవాహిక జీవితంలో ఎదురయ్యే ఒడుదుడుకులను ఎదుర్కోవాల్సింది ఎక్కువగా స్త్రీయే కనుక ఆమె ఎంపికలో దూరదృష్టి, వివేకం చాలా అవసరమనేది ముఖ్య విషయం. ఆత్మస్థైర్యమూ, మానసిక పరిణతా ఉన్నప్పుడే ప్రేమ వివాహాలు సాఫల్యం సాధిస్తాయి. ప్రేమించి పెళ్ళి చేసుకోవటం నేరం కాదు. విభిన్న పరిసరాలలో, పరిస్థితులలో పెరిగిన ఇరువురు వ్యక్తులు ఒకే బాటలో పయనించాలనుకున్నప్పుడు పరస్పర అవగాహన ఎంతో ముఖ్యం. ఆ పరిశీలనకు ఈ 'ప్రేమ' తోడ్పడుతుంది. పెళ్ళి నూరేళ్ళపంట అన్న నానుడి నిజమే అయితే

ప్రేమ వివాహాలపై సరియైన అవగాహన లేకుండానే రచయిత్రి "ప్రేమ వివాహాలు" వ్యాసం వ్రాసినట్టుగా ఉంది. "భర్త దుర్మార్గతను తెలిసి కూడా ఆయనను ప్రేమించడం, ప్రేమించినవాడు తనను చులకనగా చూసినా కామదాహం తీర్చుకొనేందుకు వాడుకుని తరువాత నిరసించినా ఆ పురుషుడిపట్ల ఆమె ప్రేమ సన్నగిల్లదు" అంటూ మన స్త్రీల గురించి వ్రాయడం సత్యదూరం. అభిమానమున్న ఏ స్త్రీ కూడా అలాంటి విషయాలను సహించదు. ఒకవేళ సహిస్తుందంటే అందుకు బలవత్తరమైన కారణాలు ఏవైనా ఉండి ఉండాలితప్ప ప్రేమ సన్నగిల్లకపోవడం అంటూ జరగదు. "సత్యం కోసం సతినే అమ్మినదెవరూ? హరిశ్చంద్రుడు!" అంటాడొకకవి. సత్యం కోసం ప్రాణత్యాగం చెయ్యడం సరేగాని, సతినే త్యాగం చేయడం బానిసలక్షణం. భార్యను ప్రేమించి ఆమె ప్రేమ పొందడానికి మాత్రమే భర్త అర్హుడు కాని, ఆమెను పశువులా అమ్మే హక్కు ఎవరికీ లేదు!

**వేముల చంద్రభాగ** — **హైద్రాబాద్**

బాలగారు వ్రాసిన వివాహాలు–వయసు చర్చనీయాంశమే. భార్య, భర్త సంసారపు బండికి రెండు చక్రాలవంటివారు. భర్త ఆర్జించి తెస్తే భార్య పొదుపుగా వాడి గృహాన్ని తీర్చిదిద్ది బాధ్యతను నెరవేరుస్తుంది. నేడు 13, 14 ఏండ్ల పిల్లలను బాలికలు అంటారేగాని రజస్వల అయినా కూడా స్త్రీలు అని వ్యవహరించరు. 19, 20 సంవత్సరాలు వస్తేగాని బాధ్యత వహించగల స్త్రీగా మారదు. నేటి దేశ పరిస్థితులనుబట్టి ప్రతి స్త్రీకి వివాహాని[ki] ముందే కుటుంబనియంత్రణ గురించి తెల్సుకో[నే] ఆవశ్యకత ఉన్నది. 13, 14 సంవత్సరా[ల] బాలికలకు ఈ విషయంలో ఆసక్తి జనించదు వివాహం కాగానే ఏడాది లోపునే జోలపా[ట] పాడుతూ సంసారపు జంజాటంలో పడిపోతారు. ఈ రోజుల్లో వివాహాలు కాగానే భర్త ఉద్యోగరీత్యా ఏ ఊర్లో ఉంటే అక్కడికి వెళ్ళటం, ఒంటరిగా సంసారాల్ని చక్కదిద్దుకోవడం అంటే మాట[లు] అవుతుందా? "అమ్మమ్మలయే ఈడు[న] అమ్మలవుతున్నారు మీరు" అంటుంది మ[ా] అమ్మ. ఆవిడ అన్నదీ నిజమే మరి! ఆమె[కు] వివాహమయ్యేటప్పటికి ఆమెకు మూడేళ్ళు. మ[ా] తాతయ్యకు ముప్ఫయ్యేళ్ళు. ఇప్పటికీ పల్లె[ల్లో] అలాంటి వివాహాలు జరుగుతూనే ఉన్నవి. వాళ్ళ[కు] వివాహాలంటే బొమ్మలాటగా ఉంటుంది. క్రొత్త బట్టలు కట్టుకొని పల్లకిలో ఊరేగుతామనే సంతోషమేగాని, తామిద్దరూ కలసి జీవితమనే బరువైన బండిని ఎత్తు ఒంపులున్నా, ఎన్ని ఒడుదుడుకులొచ్చినా సమానంగా లాగుతూ




ఆనందపుటంచులకు చేర్చుకోవాల్సి వస్తుందని వారి మనస్సులకు తెలియదు. మన ప్రభుత్వం వివాహ వయో పరిమితి నిర్ణయించి ఎంతో మేలు చేసింది.

**దేవులపల్లి శిరీష** — హైదరాబాదు

మే పదిహేను సంచికలో బులుసు రామలక్ష్మి గారు వ్రాసిన ఆంగ్లభాషపై సంస్కృత భాషా ప్రభావం సామాన్య పరిశీలన చేసి వ్రాసినదిగా ఉన్నది. భాషా కుటుంబాల ప్రకారం ప్రపంచ భాషలన్నీ కొన్ని ముఖ్య కుటుంబాలుగా ఏర్పరచబడ్డాయి. వాటిలో ద్రావిడభాషా కుటుంబం క్రింద తెలుగు, తమిళ, మలయాళ, కన్నడ, తుళు భాషలు; ఇండో యూరోపియన్ కుటుంబం క్రింద జర్మను, లాటిను, సంస్కృతము, గ్రీకు మున్నగు భాషలు చేరుతాయి. అందుకనే సంస్కృతానికీ జర్మను, ఇంగ్లీషు భాషలకూ సంబంధం వుంది.

| సంస్కృతము | ఆంగ్లము | జర్మను |
|---|---|---|
| భ్రాత | బ్రదర్ | బ్రుదర్ |
| దుహిత | డాటర్ | టాఖ్టర్ |
| ద్వి | టు | త్స్వై |
| మాత | మదర్ | ముట్టర్ |

ఈ విధంగా పరిశీలించిన కొద్దీ ఈ భాషలన్నీ ఒకే కుటుంబానికి చెందినవని భాషా శాస్త్రజ్ఞులు అభిప్రాయ పడతారు. పై వానివలన భాషలన్నిటికి మూలం సంస్కృతము కాదని తెలుస్తూనే ఉంది. మరి ఇన్ని పోలిక పదాలుండడానికి కారణం? తెలుగు దేశమున 11వ శతాబ్దపూర్వం సంస్కృత, ప్రాకృత భాషాభిమానులైన రాజులు పరిపాలించారు. రాజ భాషగా చెలామణి అయిన ఆంగ్లం నుండి పెన్ను, పెన్సిలు, స్టేషను, ఆస్పత్రి మొదలైన పదాలను తెలుగుభాష స్వంతము చేసికొన్నట్లే ఆనాటి సంస్కృత ప్రాకృత శబ్దాలూ తెలుగులో ప్రవేశించాయి. కాబట్టి, సంస్కృతం నుండి తెలుగు జన్మించినదనే అభిప్రాయము సరికాదు.

**ముదిగొండ శ్యామల** — హైద్రాబాదు

మే 15వ తేదీ వనితలో ప్రముఖ హిందీ రచయిత్రి శ్రీ గౌరాపంత్ శివానిగారి గోష్ఠి చదివిన తరువాత నాకీ అభిప్రాయం వ్రాయాలనిపించింది. ఒక నిర్మాత ఎంత ధనాశ చూపినా ఆమె సృష్టించిన ఒక పాత్రను చంపడానికి ఇష్టపడలేదంటే .... ఆమెకు ఆ పాత్రపైగల అభిమానము, ప్రేమ ఎంత మహోన్నతమైనదో ఆ సంఘటన తెలియజేస్తుంది. మన తెలుగులో కొన్ని నవలలను చిత్రాలుగా నిర్మించారు. కొన్ని రూపాలే మారిపోయాయి. మరికొన్ని చిత్రాలకు మూల వస్తువుగానే మిగిలిపోయాయి. మన తెలుగు రచయిత్రులను కోరేది ఒక్కటే...తమ తమ నవలల హక్కులను చిత్ర నిర్మాతలకు ఇచ్చే ముందు పాత్రలకు ఎటువంటి అన్యాయం జరగకూడదన్న షరతులు పెట్టిన రోజున కనీసం మన తెలుగు నవలా చిత్రాలనైనా యథాతథంగా చూసే అవకాశం లభిస్తుందని నా అభిప్రాయం.

**విస్సాప్రగడ సుబ్బలక్ష్మి** — రాజమండ్రి

'వనిత'లో మీరు ప్రచురిస్తున్న శీర్షికలలో నన్ను ముఖ్యంగా ఆకట్టుకున్నవి మహిళా మండలుల గురించి, లయన్ లేడీస్ క్లబ్‌ల గురించి మీరు ప్రచురిస్తున్న వార్తలు. ఈ సమాజాలు ఎంతో ఉత్సాహంగా వివిధ సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహిస్తూ, వరద బాధితులు మున్నగు అభాగ్యులను ఆదుకుంటున్నాయి; అందుకు వారిని అభినందించవలసిందే. కాని తమ కార్యకలాపాలను వీరు యిటువంటి వాటికే పరిమితం చేసుకోవడం విచారించదగ్గ విషయం. ఈ మహిళా మండలులు, లయన్ లేడీస్ క్లబ్‌లు నిత్యావసర వస్తువుల గురించి స్త్రీలు ఎదుర్కొనే సమస్యలను అంతగా పట్టించుకోకపోవడం శోచనీయం. సామాన్య గృహిణుల దైనందిన సమస్యలలో — 'అధిక ధరలు' ముఖ్యమైనది. ఒక చెంప ప్రభుత్వం ధరలు తగ్గిస్తామని అంటూనే వుంటారు. మరో చెంప ధరలు పెరుగుతూనే వున్నాయి. నానాటికీ పెరిగిపోతున్న ఈ ధరలను అరికట్టడానికి ఉద్యమాలు లేవదీయాలి. అందుకు రాష్ట్రం నలుమూలలా వున్న స్త్రీలు ముందంజ వేయాలి. స్త్రీలను సంఘటితపరిచే శక్తి ఈ మహిళా మండలులకు, లయన్ లేడీస్ క్లబ్‌లకు వుందని వారు నిర్వహించిన వివిధ కార్యక్రమాల ద్వారా రుజువయింది. కాబట్టి ఈ విషయంలోనూ వారే ముందంజవేయాలి. స్త్రీలు తలచుకుంటే సాధించలేనిది లేదన్న విషయం ఈ మధ్య బొంబాయిలో జరిగిన 'కొనుగోలుదార్ల ఉద్యమం' (కన్స్యూమర్ మూవ్‌మెంట్) నిరూపించింది. మృణాల్ గోరే నాయకత్వంలో నడచిన ఆ ఉద్యమం చాలామటుకు సఫలీకృతం అయిందనే చెప్పాలి. మన రాష్ట్రంలో కూడా ముఖ్య నగరాలలోని మహిళా మండలులన్నీ కలసికట్టుగా 'కొనుగోలుదార్ల ఉద్యమాన్ని' నడపాలి. 'స్త్రీ శక్తి స్వరూపిణి' అనే పదం పురాణాలకి పరిమితం కాదని నిరూపిస్తూ స్త్రీ శక్తి అంటే ఏమిటో తెలియజేయాల్సిన తరుణం ఆసన్నమయింది. ఈ 'కన్స్యూమర్ మూవ్‌మెంట్లు' విదేశాలలో ఎన్నో విజయాలు సాధించాయి. కేవలం అధిక ధరలను అరికట్టడం మాత్రమేకాక కల్తీలేని 'క్వాలిటీ' వస్తువులు సరసమైన ధరలకు లభించేటట్లు చూడాలి. వీలయినంతలో తామే డిపార్ట్‌మెంటల్ స్టోర్స్ నిర్వహించాలి. మద్రాసు, బొంబాయి, కలకత్తావంటి పెద్ద నగరాలలో స్త్రీ సమాఖ్యలచే నడపబడుతున్న దుకాణాలు ప్రారంభమయ్యాయి కూడా. మన రాష్ట్రంలోని మహిళా మండలులు కూడా సమర్ధవంతంగా కొనుగోలుదార్ల ఉద్యమాలు లేవదీసి తమ ఉనికిని సార్ధకపరచుకోవాలని, ఆరోజు త్వరలో నేరావాలని నా ఆకాంక్ష.

**పాతూరి వెంకటలక్ష్మి** — విజయవాడ




మీకు యివ్వబడిన డిజైన్ ట్రేస్ తీసి, చుట్టూ చక్కగా కుట్టబడి, నలుచదరంగా (35 సెం.మీ. x 35 సెం. మీ) వున్న గుడ్డపై కేమెల్ క్రైలిన్ రంగులతో ఆ డిజైన్‌కు రంగులు వేయండి. మీరు వేసే రంగులు వీలయినంత లేతగా వుండాలి. అందుకు కేమెల్ క్రైలిన్ మీడియమ్‌తో రంగులను పలుచన చేసుకోవచ్చు. పోటీ చేసే ప్రతి ఒక్కరూ 3 ఎంట్రీలకన్న ఎక్కువ పంపరాదు.

**బహుమతులు : రూ. 100/-, రూ. 75/-, రూ. 50/- ఇవే గాకుండా 10 మెరిట్ సర్టిఫికెట్‌లు**

మీరు రంగులు వేసిన ఎంట్రీలను ఈ క్రింది ఎడ్రసుకు పంపండి :

పబ్లిక్ రిలేషన్స్ ఆఫీసర్,

**కేమ్లిన్ ప్రైవేట్ లిమిటెడ్**, ఆర్ట్ మెటీరియల్ డివిజన్, జె.బి. నగర్, బొంబాయి 400 059

పేరు, ఎడ్రసు వ్రాసిన కవర్‌ను పోస్టేజితోసహా ఎంట్రీతోపాటు పంపితే పోటీ చేసే ప్రతి ఒక్కరికీ ఒక ట్రాన్స్‌ఫర్ పంపబడుతుంది.

మీ ఎంట్రీతో జతపరిచే 'ట్యాగ్'పై మీ పేరు, చిరునామా ఇంగ్లీషులో వ్రాయండి. మీ ఎంట్రీ తిరిగి పంపబడదు.

**ఎంట్రీలు పంపవలసిన ఆఖరు తేది : 31-8-1978**

Vision **CONTEST NO. 7**

Join Camel School of Art Correspondence Course.
Contact the above mentioned address for details.

[illegible]

V. Kameswari,
C/o. K. Sarma,
18-...,
Krishna nagar,
Sitampeta,
Rajahmundry,
533 104.

TO THE EDITOR
VANITA
CHANDAMAMA BUILDINGS
MADRAS-600 026

ఇప్పటివరకూ పక్షపత్రికగా వెలువడుతూ నెలకు రెండుసార్లు 'వనిత' రాకకోసం ఉత్సాహంగా ఎదురు చూసే మా పాఠకులకు 'వనిత' ఇక ముందు మాస పత్రికగా మారడం నిరాశ కలిగించింది.

—బి. విజయలక్ష్మి, ఆమదాలవలస

మా అభిమాన పక్ష పత్రిక 'వనిత' ఇకనుంచి మాస పత్రికగా వెలువడుతుందని చదివి చాల నిరాశ చెందాము. ప్రతిభాగమూ ఎంతో ఉత్కంఠతో సాగుతూ (నగం నవ్విస్తూ-నగం ఏడిపిస్తూ) మమ్మలిని ఎంత గానో ఆకర్షిస్తున్న 'కృష్ణవేణి' సీరియల్ కోసం ఇక నుంచి నెల రోజులు ఎదురుచూడాలంటే నిజంగా అది మాకెంతో శిక్ష! —రాజనాల స్వర్ణలత, తుని

వనితను జూలై నుంచి మాసపత్రికగా మార్చాలనుకున్నాము'' అని చదవగానే కొంచెము నిరుత్సాహము కలిగినది. అయినప్పటికి, సంపాదకులు వనితను, ఎప్పటిలా అన్ని శీర్షికలతోపాటు, కథలసంఖ్య పెంచి పాఠకులకు సంతృప్తికరంగా వుండేటట్లు చేయాలని కోరుకుంటున్నాను. —నసీమాఖాన్, బాపట్ల

మాస పత్రిక అయినాసరే - 'వనిత'లో బామ్మగారి పేజీ తప్పకుండా ఉండి తీరాలిసిందే. మన దేవాలయాలు, ఉత్సవాలు, వ్యాసాలు, చిత్రాలు తప్పక ఉండితీరవలసినదే. ఈ రెండు శీర్షికలు ఉంచమని మనవి. —సి. సత్యవతి, బెంగళూరు

ఈనాటివరకు ఏ పత్రికకాపత్రికను ఆకర్షణీయంగా తీర్చి దిద్దాలన్న ప్రయత్నంలో నూతన శీర్షికలను అనేకం ప్రవేశపెట్టినా ప్రారంభం నుండి 'ముఖచిత్రాల' విషయంలో ఒక ప్రత్యేకతను అలరించుకున్న ఈ శీర్షికలో మాత్రం మాసపత్రికగా మార్చినా కూడా ఏ మార్పూ చేయకండి. పలు రంగాలలో తమ సామర్థ్యంతో మహిళాలోకానికే మణుల్లా వెలుగులు వెదజల్లుతున్నవారి గురించి ముఖచిత్రాల ద్వారా, పరిచయం చేస్తున్న ఈ విధానాన్ని ఎప్పటికీ కొనసాగిస్తారని ఆశిస్తున్నాను.

—టి. ఎస్. కుమారి, బాపట్ల

'వనిత'ను 'మాస' పత్రికగా తీసుకురావాలన్న మీ నిర్ణయంలో 'తొందర' పడ్డారనే 'వనిత' అభిమాన పాఠకురాలిగా అభిప్రాయపడ్తున్నాను. మీరన్నట్లు రెండు పక్షాల శీర్షికలు ఒకే పత్రికలో వచ్చినా 'నెల' రోజులు వరసగా నిరీక్షించాలంటే పరోక్షంగా పాఠకుల్ని బాధపెడ్తున్నారనే చెప్పవచ్చు. ఏదేమైనా - ఏ విషయంలో చూసినా 'మాస' పత్రికగా తీసుకురావాలన్న మీ నిర్ణయాన్ని మరోసారి పరిశీలించగలరని కోరుతున్నాను.

—మనోహరాదేవి, హైద్రాబాదు

వనితలో 15 రోజుల కొకసారి వస్తున్న శీర్షికలు మాస పత్రికలో రెట్టింపు వుండాలి. ఉ:-పత్రికకి, ఒక ముగ్గు ఇస్తున్నారు. మాసపత్రికలో రెండు వుండాలి. ఇందులో మీరు ఏ మాత్రం మార్పు చేసినా మాకు నిరాశగా వుంటుంది.

—కె. గీత, విశాఖపట్నం

'వనిత' పక్షపత్రికగా కాక, మాసపత్రికగా వస్తే ఎంతో బాగుండును అని నాకెన్నాళ్ళనుంచో కోరిక వుంది. గత సంచికలో, వనితని మాసపత్రికగా ప్రచురిస్తున్నాము అని మీరు తెలియపరచినారు. నాకు సంతోషంగా వుంది.

—సమయమంత్రి రాజ్యలక్ష్మిదేవి, హైదరాబాదు

''వనిత''ను జూలై సంచిక నుంచి మాసపత్రికగా మార్చటానికి నిర్ణయించటం ముదావహం. ఈ మార్పు వల్ల ''బామ్మగారి పేజీ'' తీసివేయరని తలుస్తాను. మాసపత్రిక చేస్తున్నామని సీరియల్సు మాత్రం పెంచకండి. ఒక్క సీరియల్ ఉంటేనే పత్రికకు అందం.

—కాశీరాజు సీత, న్యూ ఢిల్లీ

మే 15'వ తేదీనాటి సంచికలోని 'మన దేవాలయాలు' శీర్షికలో, గయలోని బౌద్ధ దేవాలయం గురించి, వివరణ చాలా బాగుంది. ఎప్పట్లాగే బామ్మగారి పేజీ ఎన్నో తెలియని విషయాలను తెలియజేసింది.

—మొగలి లక్ష్మిదేవి, గొల్లప్రోలు

మే 15వ తేదీన వెలువడిన వనిత ముఖచిత్ర సుందరీమణులు అమితా అయానా, ప్రభా నరసింహన్‌లు వారి జీవన సరళి నాకు బాగా నచ్చింది. ఉద్యోగ ధర్మాన్ని నిర్వర్తిస్తూ, గృహిణిగా కుటుంబ ధర్మాన్ని నిర్వహిస్తూ మిగత సమయాన్ని పెయింటింగ్, చేతి పనులు మొదలగు హాబీలకు వినియోగిస్తున్న ఈ నాజూకైన మహిళలు ఆదర్శనీయులు.

—ఎస్. సుశీలా బాలకృష్ణారెడ్డి, హైదరాబాదు

'భ్రమ' కథ చాల బావుంది. రచయిత్రి కోటంరాజు భవానీదేవిగారు దీనిని చాల చక్కగా చిత్రించారు.

—కె. లక్ష్మినరసమ్మ, ఎలకుర్రు

ప్రసిద్ధ హిందీ రచయిత్రి గౌరా పంత్ శివానితో పరిచయం చాలా బాగుంది. ఆమె సినిమాకు నవలలు అడగడం గురించి చెప్పిన విషయం, ఆ విషయంలో ఆమె అనుసరించిన పద్ధతి చాలా బాగుంది. ప్రతి రచయిత్రి ఈ విషయం గమనించి పాఠకులలో ఒక విధమైన స్థానం సంపాదించిన తరువాత, తన రచనను సినిమాలకు ఇచ్చి, కథను మార్చి వేసి, పాఠకులకు నిరాశ నిస్పృహలను కలుగకుండా చేస్తే బాగుంటుందేమో!

—టి. కాంత, కాకినాడ

టి. విమలగారి కవిత 'మార్పు' నేటి సమాజం తీరు తెన్నులను ప్రస్ఫుటపరచింది. మన సమాజంలో ఈ వరకట్న దురాచారాలబెడద నశించిపోయేటంతవరకు ఆడపిల్ల పుట్టుకకు విలువ ఉండదు. పెళ్ళికెదిగిన ఆడపిల్ల తమ గుండెల మీద కుంపటిగా నేటి తల్లి దండ్రులు (ఆడపిల్లలను కన్నవారు) భావించే అగత్యం ఉండదు.

—పి. సుగుణ, ఖమ్మం

వనితలో (మే 1, 1978) చిన్నాళపట్టి చీరెలను గురించి తెలియచేసినందులకు సంతోషము. మా ప్రాంతమున వాకబుచేయగా అవి లభించలేదు. కావున అవి లభించు తావు మాకు వ్రాసిన, మేము పోష్టు ద్వారా తెప్పించుకొందుము.

—గవిని మాలతి, కోటగిరి

**[కె. యస్. యమ్. యస్ మణి అండ్ బ్రదర్, చిన్నాళపట్టి సారీస్ షాప్, లజ్‌కార్నర్, మద్రాసు-4 చిరునామాకు రాస్తే వివరాలు తెలుసుకోవచ్చును.**
**—వ. సం]**

మీ 'మాటల కొలువు' శీర్షిక ద్వారా శబ్దరత్నాకర మంతయు తిరగవేసినట్లుంటున్నది. దీనివలన ప్రయిజు రాకపోయినా, తెలుగు భాషాజ్ఞానము పెంపగుచున్నది.

—పి. శ్రీదేవి, కడప

బామ్మగారి పేజీలో ''వాస్తుశాస్త్రం'' గురించి చాలా చక్కగా వివరించారు. ఇంటి వెనుక ముందు భాగాల్లో ఏఏ మొక్కలు ఉండాలో, ఉండకూడదో వ్రాశారు. 'పశ్చిమ జర్మనీ'లో ప్రతి ఒక్కరు ఇల్లు కట్టుకోవాలంటే ఇంటి ఆవరణము చుట్టూ కొంత స్థలం వదలవలసిందే, అందులో తప్పనిసరిగా మొక్కలు నాటాల్సిందే. నాటిన మొక్కల్ని (చెట్లనీ) కొట్టించివేస్తే చిన్న శిక్షల దగ్గర నుండి కఠినమైన శిక్షలవరకు విధిస్తారు.

—శిరుమల్ల వినోదాదేవి, సింద్రి

లిజత్ పపడ్ (కుటీర పరిశ్రమ) పేరిట ఈ మధ్య 'వనిత'లో ఒక వ్యాసం ప్రచురించారు. కాని, చిరునామా ప్రచురించలేదు. ఇదివరలో ఇటువంటి వ్యాసాలు వేసినప్పుడు చిరునామాలు ఇచ్చారు. ఆ విధంగా అన్నింటికీ చిరునామాలు ఇస్తే మా బోటి వారికి సహాయంగా వుంటుంది.

—కె. వి. లక్ష్మి, మద్రాసు

**[పాఠకుల సదుపాయం కోసం, మద్రాసు, హైద్రాబాదు పట్టణాల్లోని చిరునామాలు తెలియజేస్తున్నాము: ''మహిళా గృహ ఉద్యోగ్ లిజత్ పపడ్'' 2, అరపముత్తు గార్డెన్ స్ట్రీట్, (దానప్రకాష్ ప్రక్క) ఎగ్మూర్, మద్రాసు 600 008 ఫోన్: 664901; 22-2-143 గోమతివాడ, దబీర్‌పుర, హైద్రాబాదు 500 024 ఫోన్: 448291 —వ. సం]**

# చిట్టి కథలు

## "అప్పన్న"లు

నౌకరు కుర్రవాడొకడు ఇద్దరు పాపల్ని తీసుకొచ్చి మా స్కూలు దగ్గర దింపాడు. వాళ్ళిద్దర్నీ నిన్ననే స్కూల్లో చేర్చారుట.

లోపలికి వచ్చాక పాపల్ని పేర్లడిగాను. ఇద్దరూ ఒకే రకంగా జవాబు చెప్పారు. 'అప్పన్న' అని.

వాళ్ళని ఎంత రెట్టించి అడిగినా ఇద్దరూ కూడా 'నా పేరు అప్పన్నే' అనే చెప్పారు. పాపలిద్దరూ కవల పిల్లలేమో? ఒకే పోలిక! పేరు కూడా నిజంగా ఒకటేనా? అనే సందేహం కలిగింది నాకు.

'మిమ్మల్ని స్కూలుకి తీసుకొచ్చాడే....! అతనెవరు?' అన్నాను పాపల లేత బుగ్గలు ముద్దుగా నిమురుతూ.

'మా నౌకరే, అప్పన్న' అన్నారు పాపలిద్దరూ ఏక కంఠంతో.



నాకీసారి చాలా నవ్వొచ్చింది. 'ఎవరి గురించి అడిగినా ఒకే పేర్లు చెప్తున్నారు. ఎంత సేపూ వాళ్ళ ధోరణిలో ఒకే మాట చెప్తూండడం వీళ్ళ స్వభావమేమో!' అనుకున్నాను.

మధ్యాన్నం కొత్త పాపలకి బుల్లి బుల్లి టిఫిన్ బాక్సులతో వెచ్చటి ఇడ్లీలు, ఫ్లాస్కుతో పాలు వచ్చాయి. పాపల పేర్లు సరిగ్గా తెల్సుకుందామని ముందుగా ఆ నౌకరును 'నీ పేరేమిటి?' అన్నాను.

'అప్పన్న' అన్నాడు.

ఒక పాపని చూపిస్తూ 'ఈ పాప పేరేమిటి' అన్నాను.

'అప్పన్న'

'నీ పేరు అప్పన్నేలే! నేనిప్పుడు అడిగింది ఈ పాప పేరు!' అన్నాను.

'అప్పన్నేనండి'

అపనమ్మకంగా అతడికేసి చూస్తూ 'నిజంగా చెప్పు' అన్నాను.

'ఒట్టండి. దేవుడు సాచ్చిగా అప్పన్నేనండి'

'అవునా! సరేలే! రెండో పాప పేరు?'

'అప్పన్నండి'

'ఏయ్ ఏమిటా వేళాకోళం? సరిగ్గా చెప్పు' అని గద్దించాను.

'అయ్ బాబదేంటండీ, సచ్చప్పమానికంగా అప్పన్నేనండి'

'నీకా పేరు తప్ప ఇంకే పేరూ చెప్పటం రాదా?' అన్నాను కళ్ళెఱ్ఱజేస్తూ.

"ఎందుకండంతకోపం? మాయమ్మ పేరు ఎల్లమ్మండి. మా యత్తపేరు సింగమ్మండి. మా అయ్య పేరు పోలయ్యండి. నాకు పేర్లు రాకపోవటమేంటండి" అన్నాడు ధీమాగా.

'మరి? నీ పేరుకీ ఈ పాపల పేరుకీ తేడా ఏమీ లేదా?' అన్నాన్నేను.

అతడొకసారి బుఱ్ఱ బరుక్కుని 'తేడా లేకపోటమేంటండి? నా పేరు అప్పన్న. పాపగోరి పేర్లు! అదేందోనండీ....మీకు నాన్సెప్పలేనండి' అంటూ తడబడ్డాడు. నే నూరుకున్నాను.

సాయంకాలం ఆ పాపల్ని తీసుకుని వెళ్ళటానికి ఆ పిల్లల తండ్రే వచ్చారు.

నేను ఆయనకి నమస్కారం చేసి నన్ను పరిచయం చేసుకుంటూ 'ఈ పాప పేరేమిటి సార్?' అన్నాను.

'అర్పణ'.

'ఆ పాప పేరు?'

'అపర్ణ' అన్నాడతను.

పేర్లు వినగానే నాకు ఆశ్చర్యం, నవ్వు వచ్చాయి.

'ఆహా!' అనుకొని 'ఈ బుక్స్ కొని పంపండి.' అంటూ పాపలకి కొనవలసిన పుస్తకాల 'లిస్ట్' ఇచ్చాను.

ఆయన పాపల్ని తీసుకుని వెళ్ళిపోయారు. పాపలు, అప్పన్న చెప్పిన పేర్లు జ్ఞాపకం వచ్చి మళ్ళీ నాకు నవ్వు వచ్చింది. ఉచ్చారణలో చదువు లేని అప్పన్న, చిన్నపిల్లలూ ఒకటే!

—ఆచంట హైమవతి

## అవసరాలు

చమన్‌లాల్ కొట్టు తెరచి చూసేసరికి ఒక ఆడ, ఒక మగ కనబడ్డారు తన కొట్టు మెట్లు ఎక్కుతూ. "సేట్‌జీ! దీని ఖరీదు ఎంత వుంటుందో చెప్పండి!" అంటూ ఆమె ఒక కాగితం పొట్లం విప్పసాగింది. ఆలస్యం సహించ



లేనట్లుగా అతను కూడా తన లాల్చీ జేబులోంచి ఒక మంగళసూత్రం తీసి 'ముందు ఇది చూడండి!' అంటూ చమన్‌లాల్ చేతిలో పెట్టాడు. ఆమె పొట్లం విప్పేసరికి చమన్‌లాల్ అతనిచ్చిన మంగళసూత్రం పరీక్షించడం పూర్తిచేసి త్రాసులో వేశాడు. అతను ఆమె విప్పుతున్న పొట్లంవైపు చూసి ఉలికి పడ్డాడు. అది కూడా మంగళసూత్రమే! "తాకట్టా? అమ్మేస్తారా?" అన్నాడు చమన్‌లాల్, ఆమె చేతిలోని వస్తువు చూస్తూ. "అమ్మేస్తానండీ" అందామె కొద్దిగా వణికే గొంతుతో. "మీ సంగతి కాదమ్మా! ఆయనను అడుగుతున్నాను" అన్నాడు చమన్‌లాల్. "నన్నేనా అడిగేది?–అమ్మకానికేలెండి. త్వరగా కానీయండి" అన్నాడతను. "ఉండండి మరి! తొందరైతే ఎలాగ? ఏదమ్మా, మీ వస్తువు ఇలా ఇయ్యండి" అంటూ ఆమె చేతిలోని వస్తువును అందుకున్నాడు. "కాస్త వేగం దవ్వివ్వండి. చాలా అర్జెంటు" అందామె–బాధగా. ఆమె పెళ్ళయి సంవత్సర కాలేదింకా! ఇంతలో ఆమె భర్తకి టి. బి. అని తెల్సింది. దొరికినంతవరకూ అప్పులు చేసి వైద్యం చేయించింది. ఇంక మరి అప్పు దొరకని సమయంలో, తగ్గు ముఖం పట్టిన వ్యాధిని నిర్లక్ష్యం చేయలేక ఆమె తన మాంగల్యాన్ని అమ్మడానికి సిద్ధపడింది.

అతని పేరు శంకరం! అతడొక పక్కా త్రాగుబోతు. మొదట్లో మామూలుగానే, సరదాకి. కొద్ది కొద్దిగా త్రాగేవాడు. రానురాను వ్యసనం ముదిరి పక్కా త్రాగుబోతుగా మారాడు. అతని భార్యకి చాలా నగలుండేవి. అవన్నీ అతని వ్యసనానికి హరించుకు పోయాయి. చివరికి ఆమె మెడలో మాంగల్యం మాత్రం మిగిలింది. అదివ్వననీ, ఇవ్వలేనని ఆమె ఏడ్చింది. భర్తగా తనకున్న హక్కు పురస్కరించుకుని, ఆమెని చావగొట్టి, అది బలవంతంగా లాక్కుని మరీ తెచ్చాడతను.

అంతలోనే కొద్దిగా నలిగిన టెరికాట్ పాంటూ, టెరికాట్ షర్టూ, ఉంగరాల జుత్తూ, కాస్త నీరసంగా వున్న మొహంతో మెట్లెక్కి వస్తున్న ఒక యువకుని చూసి సంతోష పూర్వకంగా ఆహ్వానించాడు సేట్‌జీ! పాంటు జేబులోంచి ఏదో తీసి సేట్ మీదకి గిరాటేస్తూ "అర్జెంట్! క్విక్!" అన్నాడు ముక్తసరిగా అతను. సేట్ దాన్ని ఒడుపుగా అందుకున్నాడు. అదొక మంగళసూత్రం! అతనిపేరు రాజు. అతడి వేషం ఘరానాగా వున్నా, అతడు భోజనం చేసి నాలుగు రోజులైంది. అతని వృత్తి పిక్‌పాకెటింగ్! దొరికితే కటకటాల వెనుక! దొరకనన్నాళ్ళూ, పేరుకుతగ్గట్టే రాజా జీవితం! అతనిప్పుడే ట్రైన్ దిగి వస్తున్నాడు. ట్రైన్‌లో కొట్టేసిన వస్తువది! దాన్ని కూడా పరీక్షించడం పూర్తిచేసి, త్రాసులో వేశాడు సేట్‌జీ! కాస్త ముందు వెనుకల్లో వచ్చిన ముగ్గురికీ ఒకేసారి డబ్బిచ్చి పంపేశాడు. మరోసారి దేముడికి నమస్కారం చేసి మూడు మంగళసూత్రాలనూ ఒకేసారి సొరుగులోకి పడేశాడు అతను. ఏ పరిస్థితుల్లో అవి అక్కడికి చేరినా, సేట్‌జీ దృష్టిలో వాటి విలువ ఒకటే!

—విశాఖ

## తిరుగులేని ఋజువు

హెడ్‌క్వార్టర్స్ వదలి ఎక్కడికీ వెళ్ళకూడదనే షరతుమీద సార్జంట్ సుబ్బారావుకి వారంరోజులు సెలవు దొరికింది. అదే మహాభాగ్యమని పక్క ఊరిలో వున్న భార్యను ఆ వారంరోజులు తనతో గడపవలసిందిగా ఆహ్వానిస్తూ ఉత్తరం రాసేశాడు. లగేజ్ వీలయినంత తక్కువగా వుండాలని మరీమరీ రాశాడు.

భర్త చెప్పినట్లే చిన్న సూట్‌కేస్‌లో తన బట్టలు, టాయిలెట్ సామగ్రి మాత్రం తీసుకుని బయలుదేరింది సూర్యకాంతం. స్టేషను కెళ్ళి ఆమెను రిసీవ్ చేసుకుని దగ్గర్లోనే వున్న హోటల్ కెళ్ళాడు సుబ్బారావు.

అయితే ఆ ఊళ్ళో హోటల్ మేనేజర్లమీద ఒక ఆంక్షవుంది. అదేమంటే 'గది కావాలని వచ్చే మిలిటరీ వ్యక్తుల వెంట ఎవరైనా ఆడవాళ్ళుంటే వాళ్ళిద్దరూ దంపతులని ఋజువైతే గానీ వాళ్ళకు గదులు యివ్వకూడదు' అని.

గదిఒకటి కావాలని సుబ్బారావు అడిగిన వెంటనే "మీరిద్దరూ భార్యా భర్తల్లాగ అనిపించడం లేదు. అందువలన గది మీకివ్వడానికి వీల్లేద"న్నాడు ఆ హోటల్ మేనేజరు.



ఆ మాట వినేటప్పటికి సూర్యకాంతంకు అరికాలి మంట నెత్తికెక్కినట్టయింది. వెంటనే రౌద్రాకారం దాల్చి భర్త వైపు తిరిగి "చూశారా! మీ తెలివితేటలు యిలా యేడుస్తాయి. పైగా సామాన్లేవీ తీసుకు రావద్దని రాయడమొకటి. సిగ్గులేదూ మీ ముఖానికి? ఇలాంటివన్నీ ఆలోచించకుండా ఎంత చవట మొగుడైనా యిలా రాస్తాడా? ఇంకా అలా వాజమ్మలా నిలబడక–పదండి స్టేషనుకి...." అంటూ భారతం విప్ప బోతుండగా వెంటనే హోటలు మేనేజరు ఆమెను ఆపి "'అమ్మా! ఈమాత్రం ఋజువు చాలు! ఇదండి గది తాళాలు" అంటూ తాళాలందించాడు!

—బి. గౌరి

## మనిషిలో మనిషి

ఆరు పోర్షన్లు వున్న ఆ పూరింట్లోని చివరి పోర్షనులో దిగారు సుబ్బారావూ సుశీలా నవ దంపతులు.

పులి బోనులోకి అడుగు పెట్టిన మేకపిల్లను చూసినట్లు జాలిగా చూశారు సుశీలవైపు అక్కడున్న వాళ్ళంతా.

పసితనం వీడని పదహారేళ్ళ ముగ్ధ. నిర్మలమైన చూపులు. ముద్ద బంతిలాంటి సుశీల పులివాత పడవలసిందే! రామచిలుక మానభంగం తమ కళ్ళముందు జరగవలసిందే! బాధగా నిట్టూర్చారు ఎవరికి వారు.

నాలుగో వాటాలోవున్న వీర్రాజు ఆ పులి. తల్లి తప్ప మరో తోడులేదు, మెలితిరిగిన మీసాలతో నల్లగా అచ్చోసిన ఆంబోతులా వుంటాడు. ఆ ఇంట్లోనే కాదు ఆ పేటకే హడల్ వీర్రాజంటే. వయసు వచ్చిన ఆడపిల్లలున్న వాళ్ళెవరూ ఆ యింట్లో దిగరు. తెలియక దిగారో కొద్ది రోజుల్లోనే ఆ పిల్ల మీద అత్యాచారం జరగక మానదు.

మారుమూల పల్లెలో పుట్టి పెరిగిన సుశీలకి ఆ వూరు వింత ప్రపంచంలా అద్భుతంగా కనబడింది. తనకు రానున్న ఆపద తెలుసుకోక అక్కడ వుండటం తన పూర్వజన్మ సుకృతంగా భావించింది.

తన అదృష్టానికి పొంగిపోయాడు వీర్రాజు. జున్ను ముక్కలాటి పడుచు చేతికి అందుబాటులో వుంది. సమయం కోసం వేచి వున్నాడు.



వచ్చిన వారంలోనే సుబ్బారావు కాంపు పని మీద పొరుగూరు వెళ్ళాడు.

వూరంతా బలాదూరు తిరిగి రాత్రికి యింటికి చేరాడు వీర్రాజు. తను పొందబోయే సుఖాన్ని తలుచుకుంటూ గుటకలు మింగుతున్నాడు. గేటు తీసుకుని కాంపౌండులోకి అడుగు పెట్టేసరికి కెవ్వుమన్న కేకతో ఒక్క పరుగున బయటకి వచ్చింది సుశీల. ఎదురుగా వున్న వీర్రాజుని కావలించుకుని "అన్నయ్యా! వాడు చూడు. నన్నల్లరి పెడుతున్నాడు." అంది గడగడ వణికిపోతూ.

ఆ సంబోధన అతని మనసుని తాకి వింత అనుభూతిని కలిగించింది. అతనిలోని మరో మనిషి మేల్కొన్నాడు. "ఎవడ్రాడు! దొంగనా కొడుకు! నా చెల్లెమ్మమీద చెయ్యేస్తావురా!" అని బూతులు తిడుతూ ఎడాపెడా కుమ్మేశాడు వాడిని. "మళ్ళీ ఎప్పుడైనా నా చెల్లెమ్మని కన్నెత్తి చూశావో, గొయ్యితీసి పాతేస్తాను. జాగ్రత్త" విసురుగా బయటకి తోశాడు ఆ కుర్రాడిని. యిదే సందని పరుగు లంకించుకున్నాడు ఆ కుర్రాడు.

భయంతో వణికిపోతూ గోడకి కరుచుకు పోయింది సుశీల. "అన్నయ్యా! సమయానికి నువ్వొచ్చావు. లేకపోతే నేనేమైపోయేదాన్నో." అని బావురుమంది.

"వూరుకోమ్మా! వూరుకో. నేనున్నాగా, నీకేం భయంలేదు, అంతగా అయితే బావొచ్చేం దాకా అమ్మ నీకు తోడు పడుకుంటుందిలే." అన్నాడు లాలించుతున్నట్లు.

ఆ గల్లంతుకు బయటకి వచ్చిన అన్ని వాటాల వాళ్ళూ అనుకోని సంఘటనకి 'ఆశ్చర్యంగా చూశారు. 'కలా! నిజమా!' అన్నట్లు.

—సరస్వతి

## ముష్టి

గుడిలోనుంచి బయటకు వచ్చింది వర్దనమ్మ. మెట్ల ప్రక్కగా కూర్చుని వున్నారు బిక్షగాళ్ళు అనేకమంది. తమ చేతులలో వున్న గిన్నెలను ముందుకు చాచి "తల్లీ ధర్మం" అంటూ యాచిస్తున్నారు.

కుంటివాళ్ళు, గుడ్డివాళ్ళు, పసిపిల్లలు పండు ముసలివాళ్ళు అనేకమంది దరిద్రానికి వారసుల్లాగా కూర్చొని వున్నారు. వాళ్ళందరినీ చూస్తుంటే చెప్పలేని అసహ్యమూ, ఏవగింపు, కోపం కలిగాయి వర్థనమ్మకు.

ఒక్కరికి కూడా ఒక్క పైసా ధర్మం చేయటం యిష్టం లేదామెకి.

"ముష్టి వెధవలు" అని మనస్సులో అనుకొని వాళ్ళ ముఖం చూడడమే పాపం అన్నట్లుగా సాగిపోయింది ఆమె.

మెట్లచివరగా కూర్చొన్న రెండు కాళ్ళులేని ముసలివాడు "తల్లీ! రెండు కాళ్ళులేని ముసిలోణ్ని. దయతలచి పది పైసలు ధర్మం చేసి పుణ్యం కట్టుకోమ్మా" అని గిన్నెను ముందుకు చాచి ఆమె కాళ్ళకు దణ్ణం పెట్టబోయాడు.

తన కాళ్ళను తాకబోతున్న వాడి చేతులను చూసి పాముని చూసినట్టుగా భయపడింది వర్ధనమ్మ.



"యూ డర్టీ బెగ్గర్" అని వాడిని తిట్టి గబగబా మెట్లు దిగింది.

'అసలీ ముష్టి వెధవలనందరినీ కాల్చిపారేస్తే తప్ప యీ దేశం బాగుపడదు. ఎక్కడ పడితే అక్కడ తయారు వీళ్ళు' అని తిట్టుకుంది మనస్సులో.

"రిక్షా కావాలా అమ్మా" వర్ధనమ్మను చూస్తూనే అడిగాడు ఒక రిక్షావాడు.

"గాంధీ బొమ్మ దగ్గరికి ఏం తీసుకుంటావు?" అనడిగింది.

"మీకు తెలియనిదేటుందమ్మగారూ! రూపా యివ్వించండి" చెప్పాడు.

"రూపాయా? ఏమంత దూరముందని రూపాయి అడుగుతున్నావు? ముప్పావలా యిస్తాను" అన్నది.

"లేదండమ్మగారూ! కష్టం గమనించండి" ప్రాధేయపడ్డాడు రిక్షావాడు.

"తొంభై పైసలిస్తాను. వస్తేరా లేదంటే వెళ్ళు" నిక్కచ్చిగా చెప్పింది.

"సరే రండి" అని వాడు అనగానే రిక్షా ఎక్కి కూర్చొంది వర్ధనమ్మ.

గాంధీ బొమ్మ దగ్గర రిక్షా దిగి రూపాయి కాగితం వాడి చేతికిచ్చింది.

"దయ తలచండమ్మగారూ!" రూపాయి వుంచుకుంటానన్నట్టుగా ప్రాధేయపడ్డాడు.

"అదేం కుదరదు – పది పైసలివ్వు" దబాయించింది. "ముష్టాడి కేశాననుకుంటాను. ఉంచుకోండమ్మా" అని జేబులోనుంచి పది పైసలు తీసి వర్ధనమ్మ చేతిలో పడేశాడు రిక్షావాడు.

—పి. పుణ్యవతి

## మనసులోని మనసు

వరండాలో కూర్చుని వారపత్రిక చదువుతున్న నేను గేటు తీస్తున్న చప్పుడికి తల ఎత్తి చూసాను. ఎవరో ఒక అపరిచిత యువకుడు వస్తున్నాడు. నేను వెంటనే లేచి నిలబడి, "ఎవరు కావాలండి?" అని అడిగాను. "గది అద్దెకిస్తారని తెలిసి వచ్చానండి" అన్నాడతను. అతన్ని తీసుకెళ్ళి గది చూపాను. అద్దెంతో చెప్పాను. అన్నిటికి అతను తల సాంతం ఎత్తకుండానే తల ఊపుతున్నాడు. చాలా అమాయకుడిలా ఉన్నాడే పాపం అనుకుంటూ లోపలికి వెళ్ళిపోయాను.

*

రమణ గదిలోచేరి నెల దాటింది. ఈ నెల రోజులలో అతను ఇంట్లో వాళ్ళకు చేరువయ్యాడు.



మా తలిదండ్రులను తాను కూడా అమ్మా, నాన్న అని మాతోపాటే పిలుస్తున్నాడు. ఏం తోచనప్పుడు నేను కూడా అతని గదికెళ్ళి కావలసిన పుస్తకాలు తెచ్చుకుంటున్నాను.

*

ఒకరోజు అనుకోకుండా బజార్లో ఆలశ్యమైంది. బస్సు స్టాపులో వచ్చి నిలబడ్డాను. ఎంతసేపటికీ బస్సు రావటము లేదు. చుట్టూ కుర్రకారు గొడవ ఎక్కువైంది. అంతలో దూరంగా రమణ కనపడ్డాడు. నావైపు వీపు పెట్టి స్నేహితునితో మాట్లాడుతున్నట్లు ఉన్నాడు. 'హమ్మయ్య' అనుకొని, అతన్ని తోడు తీసుకొని యింటికెళ్దామనుకొని, వడివడిగా అటు నడిచాను. దగ్గరకెళ్ళి పేరు పెట్టి పిలుద్దామనుకున్నంతలో, రమణ స్నేహితునితో మాట్లాడుతున్న మాటలు పెద్దగా వినపడుతున్నాయి. "నాకు గది అద్దెకిచ్చిన వాళ్ళమ్మాయి ఒకతుందిరా. ఈ మధ్యే లైనులో పడుతున్నట్టుంది. అప్పుడే అలా ముఖం పెట్టి చూడకురా. నిదానంగా నా వల్లో పడనీ - చెప్తా" అంతే! ఆ తర్వాత నాకింకేమీ వినపడలేదు. ఎలా రిక్షా ఎక్కి యింటికి చేరానో నాకే తెలీదు!

—ఇందు

• కీలకం

సిటీబస్సు ఆలస్యంగా రావడంవల్ల ఆరోజు ఆఫీసుకు చేరేసరికి కొంచెం లేటయింది. ఆఫీసు రూంలో అడుగు పెడుతుంటే మా హెడ్‌క్లార్కు స్వరం కొంచెం హెచ్చుస్థాయిలో విన్పించింది.

"మీ టైపింగ్‌లో ప్రతి లైనులోను తప్పులు వున్నాయి. స్పేసింగు కూడా సరిగ్గా లేదు. పై ఆఫీసుకు పంపే కాగితాలు యిలా టైపుచేస్తే కుదరదు." హె॥క్లా ధోరణి అత్తగారు, కొత్త కోడలు సంవాదం పక్కీలో ఉంది. ఆఫీసు రూంలోకి వెళ్ళగానే హె॥క్లా ఎదురుగా ఒక కొత్త అమ్మాయి నిల్చొని ఉంది. పాపం ఆ అమ్మాయి మొహం వెలవెల పాలిపోయింది. 'బహుశ కొత్తగా అప్పాయింటయిన సునంద యీమే కావచ్చు' అనుకొన్నాను.

నేను నా పని చేసుకొంటున్నాను. కాని, ఏదో అవ్యక్తమైన బాధపడ్డాను. బహుశ తోటి స్త్రీని, అందులోను కొత్తగా ఉద్యోగంలో చేరిన అమ్మాయిని కించపరచినందువల్ల కావచ్చు. మా హె॥క్లా మనస్తత్వం నాకు బోధపడలేదు. వయస్సు 30-35 ఏళ్ళకుమించి ఉండవు. చదువుకున్న భార్య ఉంది. ఎక్కడో ఉద్యోగం చేస్తోందని కూడా విన్నాను. సునంద మళ్ళీ టైపు చేసిన కాగితాలు తీసుకొని వెళ్ళి చూపించింది. కాని హె॥క్లా ముఖంలో సంతృప్తి కనిపించలేదు.



"ఉద్యోగంలో కొత్తగా జాయినయ్యారు కనుక తన అధికారం చూపడం కొరకు హె॥క్లా అలా మాట్లాడి వుంటారు. మీరేమీ బాధపడకండి" అన్నాను కాస్త ఓదార్పుగా, లంచ్ టైంలో సునందతో పరిచయం చేసుకొన్నాక.

"చూడండి, నా వర్కులో లోపాలు చూపినందుకు నేను బాధపడలేదు. కాని ఉద్యోగంలో యీ రోజునే చేరిన నేను మీకందరికీ యీ విధంగా పరిచయం అయినందుకే బాధ పడుతున్నాను" సునంద ముఖంలో జాలి గోచరించింది. వెంటనే ఓ చిరునవ్వు నవ్వి టాపిక్ మార్చింది. నేను స్థాణువునై పోయాను సునంద హుందాతనానికి.

హె॥క్లాతో ఏదో ఫైలు డిస్కస్ చేస్తూ, టేబిల్‌మీద సునంద టైపు చేసిన కాగితాలు చూచాను. హె॥క్లా చెప్పింది కరక్టే. సునందకు టైపింగ్‌లో అనుభవం తక్కువ. మర్నాడు సునంద మామూలుగానే టైపు చేసింది. హె॥క్లా బయటినుంచి వచ్చిన ఫోనుకాల్సు, ఆఫీసరు ఇంటర్‌కమ్ ఇనస్ట్రక్షన్సుతో చాలా బిజీగా ఉన్నారు. సాయంత్రం ఇంటికి వెళ్ళేముందు హె॥క్లా సునందను పిలిచి, సబార్డినేట్ ఆఫీసెస్‌కు వెళ్ళే కాగితాలు టైపు చేయమని, నెమ్మదిగా పని నేర్చుకోమనీ నవ్వుతూ చెప్పారు. హె॥క్లా ముఖంలో ముందురోజు విసుగు స్థానంలో ప్రసన్నత చోటు చేసుకొంది. నేను రెండోసారి ఆశ్చర్యపోయాను హె॥క్లా మనస్తత్వంలో మార్పుకు.

ఇంటి వెళ్ళిపోతుంటే మా మెసెంజరు చెప్పాడు—సునంద ఇంకో పెద్ద ఆఫీసులోని సూపరెంటెండెంటుగారమ్మాయని! మా హెడ్‌క్లార్కు భార్య ఆయన దగ్గర గుమస్తా!

—పప్పు సత్యవాణి

## మీ భాషాభివృద్ధికి

ఇక్కడ పది మాటలున్నాయి. అయితే, ఒకేలా వున్న రెండు మాటల్లోనూ ఏదో ఒకటే సరైనది. మీ ఉద్దేశంలో ఏది రైటు అనుకుంటారో ఓ కాగితం మీద రాసుకోండి. అన్నీ అయిన తర్వాత, ఇక్కడే వున్న 'సమాధానం'తో మీ సమాధానాల్ని సరి చూసుకోండి. అన్నీ రైటే అయితే, మీకు మీ మాతృభాషలో బాగా ప్రవేశం వున్నదన్నమాటే. ఐదు తప్పులు వచ్చాయనుకోండి—మీరు మరి, బాగా కృషి చెయ్యాలన్నమాట!

| | | |
|---|---|---|
| 1. | దిస | దిశ |
| 2. | నేరస్థుడు | నేరస్తుడు |
| 3. | శ్రేష్టము | శ్రేష్ఠము |
| 4. | సమష్టి | సమిష్ఠి |
| 5. | సరుకు | సరకు |
| 6. | వ్యవస్త | వ్యవస్థ |
| 7. | సౌష్టవము | సౌష్ఠవము |
| 8. | శంఖు | శంకు |
| 9. | ధ్రువము | ధృవము |
| 10. | భాష్పము | బాష్పము |

జవాబులు: 1. దిశ 2. నేరస్థుడు 3. శ్రేష్ఠము 4. సమష్టి 5. సరుకు 6. వ్యవస్థ 7. సౌష్ఠవము 8. శంఖు 9. ధ్రువము 10. బాష్పము

# అబ్బాయిలకు అందమైన దుస్తులు

చాలామంది తల్లులు—"అప్పుడప్పుడు మీరు చిన్నారి పాపల దుస్తుల గురించి రంగుల ఫొటోలు వేస్తూ వుంటారు. కాని చిన్నారి బాబుల కోసం అటువంటివి ఎందుకు వెయ్యరు?" అని రాస్తూ వుంటారు. వారి



కోసం ఈసారి చిన్నారి బాలలకు కొత్తరకం దుస్తులు ప్రచురిస్తున్నాం. ఈ వర్ణచిత్రాల లోని బాలురిద్దరూ కూడా హిందీ చిత్రాలలో వేషాలు వేస్తున్న బాల తారలు. ఆ దుస్తులు వారి అందాన్ని యినుమడింపజేస్తున్నాయి. అందులో కొన్ని సిల్కువీ వున్నాయి; నూలువీ వున్నాయి. మరి వాళ్ళలాగే మీ అబ్బాయిలు కూడా ముచ్చటగా వుండాలని అనిపిస్తోంది కదూ!....అయితే, మీ టైలర్‌కు ఈ బొమ్మలు చూపించి – అలా కుట్టమని అడగండి.








కె. సాయిలీలానాథ్, హైదరాబాద్

ఈ మధ్య స్పాంజితో తయారుచేసిన బొమ్మలు అమ్ముతున్నారు. అవి చూడటానికి చాలా ముద్దుగా వున్నాయి. స్పాంజితో బొమ్మలు చేయడం ఎలాగో తెలుపుతారా ?

ఫోటోలో వున్న రెండురకాల బొమ్మల గురించి చెబుతాను. మొదట 'పద్మసుందరి' గురించి తెలుసుకుందాం.

ప్లాస్టిక్ బొమ్మగానీ, రబ్బరు బొమ్మగానీ పొడవు–సుమారు 7 అంగుళాలు కావలసిన ముక్కలు–14. మీటరులో 4 వ వంతు ముక్క సరిపోతుంది. ప్రతి రకంలోను ముందు ముక్కను కాగితం మీద కత్తిరించి మడచుకొని, తర్వాత స్పాంజి మీద కత్తిరిస్తే తప్పులుంటే తెలుస్తాయి.



మొదట జాకెట్ కుట్టుకోవాలి. బొమ్మకి సరిపడ ముక్కను తీసుకొని పెద్ద మెడ (తల దూరేలా), చేతులు కత్తిరించుకోవాలి. చేతులకుగాను ముక్కలు కత్తిరించుకొని జాకెట్‌కు అతకాలి. బుట్టచేతులు కాబట్టి భుజంకు దగ్గరగా అటు ఇటు చిన్న చిన్నగా మడవాలి. చేతి కొనకు పోగుపోసి మధ్యకు లాగి గట్టికుట్టు వేయాలి. చేతి కొనకు పూసలు, చమ్కీ బిళ్ళలు కుట్టుకొని చేతులు, ప్రక్కలు మడచి తల నుండి జాకెట్ తొడగాలి. మెడకవర్ అవటానికి ఇంకొకముక్క చుట్టూ అతికి, అది కనిపించకుండా వుండటానికిగాను పూసలు, చమ్కీలు కుట్టాలి. జాకెట్ అయిపోయింది. బొమ్మను ఓ ప్రక్క విశ్రాంతి తీసుకోనివ్వాలి. బాగా అలిసిపోయింది కదా మరి!

(2 వ బొమ్మ)

1 వ బొమ్మలోలాగ ముక్కలు 14 కత్తిరించుకోవాలి. షేపు చెడకూడదు. లేకపోతే పద్మం సరిగా రాదు. ముక్కలన్నింటిని నిలువులో సగానికి మడచి ఒక దారానికి ఎక్కించాలి. A B లు కలిసేచోట సగం అంగుళం క్రిందుగా ఎక్కించాలి. A B ల భాగం అడుగున వుండాలి C భాగం పైకి మన వైపున వుండాలి. అన్నిటినీ ఎక్కించిన తర్వాత నడుం చుట్టూ పెట్టి, బాగా సర్దుకొని జాకెట్‌కు, దీనికి కలిపి వూడిరాకుండా కుట్లు వేయాలి. దారం ముడి వేసి ఎక్కువైనది తెంపెయ్యాలి.

అర్ధ అంగుళం క్రిందుగా ప్రతి ముక్కకు ఒక కుట్టు వేయాలి విడివిడిగా. తర్వాత ముప్పాతిక అంగుళం క్రిందుగా ఒక ముక్కలోని ఎడమవారకు, ఇంకొక ముక్కలోని కుడివారకు కలిపి కుట్టు వేయాలి. తర్వాత ఒక అంగుళం క్రిందుగా హనీ కోంబ్ లాగా కుట్లు వేయాలి. 4 వ మారు కూడా ఒక అంగుళం క్రిందుగా కుట్టు వేసుకోవాలి. ఇప్పుడు



పూసలు, చమ్కీబిళ్ళలు తీసుకోవాలి. పూసలు పెద్దవికావాలి. గుండుసూదికి పూస, తర్వాత చమ్కీ బిళ్ళ ఎక్కించి ప్రతి కుట్టు మీద ఒక గుండుసూది జాగ్రత్తగ గుచ్చాలి క్రిందికి వెళ్ళేలా. గుండుసూది అక్కరలేదనుకొంటే మామూలుగా పూస, చమ్కీ

వేసి కుట్టుకోవచ్చు.

బెల్టుకుగాను ఒక ముక్క మీద పూవలు కుట్టుకొని నడుం దగ్గర అతికించాలి. తలకు గుండ్రటి ముక్క మడిచి, విడిపొరలు ముందు భాగానికి వచ్చేలాపెట్టుకొని మధ్యన ఒకటి, రెండు చెవుల దగ్గర రెండు గుండుసూదులు పూవలు, చమ్కీ బిళ్ళలు ఎక్కించి గుచ్చాలి. జాకెట్ మధ్యన గల పువ్వును కూడా కావలసిన రీతిలో మడచుకొని గుండుసూది గుచ్చాలి.

హమ్మయ్య బొమ్మ చేయడం అయిపోయింది. ఇప్పుడిది బాగా కుచోటానికిగాను ఒక సూచన. స్కర్ట్ కుట్టేటప్పుడు ముందు మొదటి కుట్టు, తర్వాత 4 వ కుట్టు వేసుకొని (పద్మంలాగా) ఆ తర్వాతనే మధ్య రెండు కుట్లు వేసుకోవాలి. అడుగున (అంటే క్రింద లోవైపు) $\frac{1}{2}$ అంగుళం వదలి కుట్టువేస్తే (ప్రతి రేకునకు) బాగా కుచుంటుంది బొమ్మ.

'నయనసుందరి' చాలా సింపుల్. నిరాడంబరజీవి. అందుకే ఈవిడ అరగంట, గంటలో తయారవు తుంది. పద్మసుందరి తయారవటానికి ఒక రోజు కావాలి. అందుకే ఆవిడ అంత ఆకర్షణీయంగా వుంటుంది మరి.

4 అంగుళాల వ్యాసం గల గుండ్రటి ముక్కను తీసుకొని మధ్యకు మడచి, మెడకుగాను కొద్దిగ వంపు – (అతి కొద్దిగ) కత్తిరించాలి. పక్కలు కుట్టం కాబట్టి, జాకెట్‌ను సులభంగా తొడిగి (మెడ నుండి దింపి) స్కర్ట్ అతకాలి. స్కర్ట్‌కుగాను బొమ్మలో చూపిన విధంగా ముక్కలు 6 అంగుళాల పొడవు, 4 అంగుళాల వెడల్పువి 9 తీసుకొని దారానికి ఎక్కించి సర్ది నడుం దగ్గర కుట్లు వేయాలి. 1 అంగుళం క్రిందుగా వేరువేరు ముక్కలలోని రెండు పొరలను కలిపి కుట్లు వేయాలి. తిరిగి మూడు లైనులు $1\frac{1}{2}$ అంగుళాల ఎడంతో కుట్లు వేసుకోవాలి పైదానిలాగ. కుట్లపైన రంగురంగుల గొట్టాలు వేయాలి. అలాగే నడుం మీద కూడా. దీనికి వేరే బెల్టు అవసరం లేదు. జాకెట్, చేతులకు కావాలను కుంటే గొట్టాలతో అలంకరించవచ్చు. ప్రక్కల కనిపించకుండా రెండు కుట్లు వేస్తే చాలు జాకెట్ బాగా వుంటుంది. బొమ్మ బాగా నుంచోటానికి అడుగున కుట్లు వేయాలి.

బొమ్మలు చేయటం ఒక ఎత్తయితే వాటిని జాగ్రత్తగా దాయటం ఇంకొక ఎత్తు. పిల్లలకు అందుబాటులో లేకుండా వీటిని గ్లాస్‌బాక్స్‌లో పెడితే చూడటానికి బాగుంటాయి. త్వరగా పాడవవు కూడా.

జి. వి. రమణమ్మ, బాగలమ్రి

కుక్కబొమ్మ చేయడం గురించి తెలియజేస్తూ ఎనిమిది స్మాష్‌లు వుంటాయని వ్రాశారు. అసలు స్మాష్ అంటే ఏమిటి? అట్లాగే 16 ముక్కలు కట్ చేయాలన్నారు. మాకు అర్థం కాలేదు. దయచేసి వివరిస్తారా?

ప్లాస్టిక్ వయర్‌తో కుక్క అల్లే విధానం చాలా కష్టమైనది. అందుకే అనుభవం వున్నవారే దీనిని అల్లాలని చెప్పాను. ఈ కష్టానికి తోడు అచ్చులో కూడా చిన్న పొరపాటు జరిగింది. మార్చి ఒకటి 'వనిత' 22 వ పేజి మొదటి కాలం క్రింది నుండి 2 వ పేరాలో 5 వ లైనులో 'పీటిపైన పువ్వులు' అని పడింది. దానిని 'పీటిపైన 3 పువ్వులు'గ చదువుకోవాలి. స్మాష్ అంటే ఇక్కడ అర్థం ఒకదానితో ఒకటి దూసుకుపోవట




మని. కుక్క ఆకారం రావాలంటే 8 దగ్గర స్మాష్‌లు రావాలి. ఈ స్మాష్ అయిన తర్వాత 2 ముక్కలు కత్తిరించివేస్తాం. ఇక వాటి అవసరం వుండదు. ఒక్కొక్క స్మాష్‌కు 2 ముక్కలు చొప్పున 8 చోట్ల స్మాష్‌లకు 16 ముక్కలు వెళ్తాయి. ఎంత




వరకు కావాలో అంతవరకు అల్లుకొని ఆ తర్వాతనే ముక్కలను కత్తిరిస్తాము. మనం కుక్కకు తీసుకొనేది 16 ముక్కలే అయినా, వాటిని మధ్యకు మడచి అల్లుతాము కాబట్టి 32 ముక్కలుగా వుంటాయి. ఇక మొదటి స్మాష్ కుక్క నడ్డి మీద వుంటుంది కాబట్టి అది ఎలా చేయాలో బొమ్మతో సహా వివరిస్తాను. కుక్క తోక భాగం కుడివైపు వుండాలి. అంటే ఎడమ నడ్డి మీదన్నమాట స్మాష్.

1 వ బొమ్మలో B ముక్కోణంలోని (అంటే నడ్డి మీద) ఒక పువ్వు. A క్రింది పువ్వు. ముందు ఇవి విడివిడిగా వుంటాయి. అక్కడ పువ్వు వేస్తే 5 పువ్వులు వస్తాయి. అక్కడ 5 పువ్వులు అవసరం లేదు. చదరం అంటే 4 పువ్వులు గల చదరం మాత్రమే కావాలి. అందుకే ఎక్కువగా వున్న ఈ వయర్లను కత్తిరించాలి. అలానే కత్తిరిస్తే పువ్వు వూడిపోతుంది. అందుకే జాగ్రత్తగా అల్లి కత్తిరిస్తాం. ఇది ఎలా అల్లాలో చెబుతాను.

2 వ బొమ్మలోని A వయరును లోనికి తోయాలి B వయరును ఒకటిలో నుండి దూర్చి 2 పైగుండా కాళీస్థలం ద్వారా అడుగునుండి 3 కు వెళ్ళాలి. తిరిగి 3 పైనుండి 4 లోపల 5 లోపల దూర్చాలి. 6 పైగుండా కాళీనుండి అడుగున వెళ్ళి పైనుండి 8 లోనికి దూర్చి పైకి తీసి బాగా లాగి కత్తిరించాలి దగ్గరిగా. అలానే లోనికి దోపిన A వయరును కూడా ఒక సెంటీమీటరు వుంచి కత్తిరించాలి. ఈ రెంటినీ తక్షణం కత్తిరిస్తే, ఒకవేళ కుక్క అల్లికలలో తప్పులుంటే విప్పవలసివస్తుంది. అప్పుడీ ముక్కలు చిన్నవై పనికిరాకుండాపోతాయి. అందుకే కొంతదూరం అల్లిక తర్వాత తప్పొప్పులు తెలుస్తాయి కాబట్టి అప్పుడు కత్తిరిస్తే మంచిది. ఇప్పుడు మీకు స్మాష్ అంటే వివరంగా తెలిసింది కదూ!

ఎస్. రాజేశ్వరి, వెల్లూరు

మీరు చెప్పినట్టు కుక్కబొమ్మ చేశాను. చాలా బాగా కుదిరింది. కాని ఒక్క సందేహం. మీరు బొమ్మలో వేసిన కుక్కకు తల పైన ఎత్తుగా నాలుగు పువ్వుల చదరం వేసినట్లు కనబడుతోంది. మరి నేను ఎంత జాగ్రత్తగా అల్లినా ఆ విధంగా రాలేదు. ఎందువల్ల? అట్లాగే నోరు, తోకల దగ్గర దోపాల్సిన వైర్లు బాగా లోపలికి వెళ్ళటం లేదు. కొంచెం అర్థమయ్యేటట్లు వివరించి చెబుతారా?

తలపైన నాలుగు పువ్వుల చదరం సెపరేటుగాకాని, స్పెషల్‌గాకాని వేయలేదు. అయితే స్మాష్‌లప్పుడు వయర్లను వాటిమీద అల్లాము కాబట్టి అలా లావుగా కనిపించివుండవచ్చు. అయినా కుక్క బాగా కుదిరినప్పుడు దీని గురించి మథనపడటమెందుకు? ఇకపోతే నోరు, తోకల దగ్గర దోపాల్సిన వయర్ల సంగతి. మీకు దోపటం కష్టమనుకుంటే ఆ ముక్కలు 2 అంగుళాలకు మారుగా 4, 5 అంగుళాలు అంటే ఎంత మిగిలి వుంటే అంతా అలానే వుంచి దోపండి. మీరు అప్పుడే వీటిని కత్తిరించివుంటారు కాబట్టి ఇప్పుడిక జాగ్రత్తగా దోపటమే మార్గం. బాగా లాగుతూ జాగ్రత్తగా దోపండి వస్తుంది.

ఓగత్పుకుంటూ ఎదుట నిలబడిన భార్యని.... తన్ను శల్య పరీక్ష చేస్తున్న భార్యని–చూసేసరికి పై ప్రాణాలు పైనే పోయాయి సుబ్బారావుకి!

"ఏమిటలా కళ్ళేట్టుకు చూస్తారు?" అని అడిగింది పార్వతి.

"ఏముంది? ఏముంది?" అన్నాడు తడబాటుగా. కంగారుగా సిగరెట్టు వెలిగించే ప్రయత్నంలో పడ్డాడు.

అతని అవతారాన్ని చూసి....ఏదో అయిందని అనుకుంది పార్వతి. ఆవేశంతో ఊగిసలాడిపోయింది. కోపంతో నోట మాట రాలేదు.

సిగరెట్టు పొగచాటున ముఖం అడ్డు పెట్టుకొని మరదలి చేతి మహిమకి ఎర్రబడిన దవడని భార్యకి కనిపించకుండా చాటు చేసుకొని "ఏమిటిలా వచ్చావు?" అన్నాడతను.

"మీ బావామరదళ్ళ సరసాలు యెంతవరకు వచ్చాయో చూసి సంతోషిద్దామని...." అంది పార్వతి పెడసరంగా.

మరదలు చేసిన అవమానం నుంచి ఇంకా అతను పూర్తిగా తేరుకోలేదు. భార్య మాటలు చురకల్లా తగిలేసరికి అతనికి కాళ్ళక్రింద నిప్పులు చిమ్మినట్టే అయింది.

ఇప్పటికే భార్యకెంతో లోకువయిపోయాడు. 'ఇది' కూడా జరిగిందని తెలిస్తే....ఇంక తన పాట్లుకి అంతుండదు! నోరు జారి తనేదయినా యిప్పుడంటే తన అవసరాలు తీరే మార్గం కాస్తా బందయిపోతోంది. తన భార్యవల్ల, తన అత్తింటి వారి మంచితనంవల్ల...తన డబ్బవసరాలు చక్కగా తీరుతున్నాయి. ప్రస్తుతం ఉద్యోగం పోయిందన్న బాధలేదు....

కాని, భార్యకి నిజం తెలిస్తే అంతటితో తన పని సరి! క్షణంలో ఇన్ని ఆలోచనలు చేసాడు సుబ్బారావు. ఇక్కడ ప్లేటు ఫిరాయించాడు మళ్ళీ! "నేనేం రమ్మనలేదు పార్వతీ! నిజం! నీమీదొట్టు....తనే వచ్చింది." అన్నాడు చటుక్కున.

సుబ్బారావుకి బొంకే విద్య క్రొత్తదికాదు. ఎంతో అనుభవం ఉంది. ఎక్కడ మాట అక్కడ మాట్లాడ్డంలో మహాదిట్ట. ఇటువంటి విషయాల్లో అతని బుర్ర ఎప్పుడూ చురుగ్గానే పనిచేస్తుంది.

భార్య నిర్ఘాంతపోవటం చూసి మరో మాట జోడించాడు. "వయసులో ఉంది. మీవాళ్ళు పెళ్ళి చేయకపోతే పాపం....ఏం చేస్తుంది?"

భర్త ఆరోపణలు చెల్లెలిమీద ఏర్పడిన చెడు అభిప్రాయాల్ని బలపరచటానికి పనికి వచ్చాయని ఆమెకు తెలియదు. ఆ క్షణంలో తన భర్త బొంకటానికెంతో అవకాశముందన్న చిన్న సంగతి ఆమెకు తట్టలేదు. "ఆ పాపిష్టిపీనుగ ఏమందేమిటి?" అని హుంకరించింది.

"తప్పని చెప్పి నేనే వెళ్ళిపొమ్మన్నాను." అన్నాడు తాపీగా.

పార్వతికి ఏడుపు వచ్చేసింది. "పాడుపీనుగ. దీనికి వెధవబుద్ధి ఎప్పుడు పుట్టిందీ? దీనికి మరెవడూ దొరకలేదూ? దొరక్క దొరక్క అక్కమొగుడే దొరికాడా?" అంటూ రాగాలు మొదలు పెట్టింది.

మా యింటావంటా లేవు ఈ పాడుబుద్ధులు.... దాన్ని....దాన్ని...." అంటూ పళ్ళు పటపట లాడించింది పార్వతి.

గుక్కిళ్ళు మింగాడు సుబ్బారావు. గొంతు తగ్గించి బ్రతిమాల సాగాడు. "తొందరపడకు పార్వతీ!....కొన్ని క్షణాలు స్థిమితంగా ఆలోచించు. మీ చెల్లెలి బ్రతుకు నువ్వే పాడుచేస్తావా?...." అంటూ నీతులు వెళ్ళబోసాడు.

పార్వతి కవేం పట్టలేదు. "ఈవేళ మీర య్యారు రేపింకొకరవుతారు. మొదట్లోనే బుద్ధి చెప్పకపోతే అది బరితెగించిపోతుంది."

"ఏమిటో నీ చాదస్తం కాని....అంతవరకూ వస్తే అప్పుడు మనం చేయగల్గింది మాత్రం ఏముంటుంది? అనుభవిస్తుంది....ఇప్పుడు నలుగుర్లోను నువ్వు నోరు జారావంటే ముందు దాని మాటెలావున్నా మనమీద నిందలువచ్చి పడతాయి. ఇప్పటికే. మనమంటే మీవాళ్ళకి చులకనగా ఉంది...."




విమలారామం

భార్యకి తనమీద అనుమానం కలగలేదని గ్రహించేసరికి సుబ్బారావుకి ఎక్కడలేని ధైర్యం వచ్చింది. "ఊర్కో పార్వతీ! ఇప్పుడేం జరగలేదు. దానికి బుద్ధిచెప్పి పంపేసానుగా!" అన్నాడు ఆమెను దగ్గరకి తీసుకుంటూ.

అతని చేతులు త్రోసేసింది పార్వతి. "లేదు. దానికింతటితో బుద్ధిరాదు. మా అమ్మ–నాన్నతో చెప్పి తాట వొలిపిస్తాను....వాతలు పెట్టిస్తాను".

గతుక్కుమన్నాడు సుబ్బారావు. నిర్మల నిజం చెపితే అంతా తన తాట వొలుస్తారు. ఆ వాతలేవో తనకు పెడతారు...అందుకే కంగారుగా భార్య చేతులు పట్టుకున్నాడు. "అంతపని చేయకు. పాపం, నలుగుర్లోను అవమానం జరిగితే మీ చెల్లిలికే కదా బాధ. ఏదో చిన్నది. తొందర పడింది...."

"వీల్లేదు. చెయ్యి వదలండి. ఇన్నాళ్ళూ తనేదో పతివ్రతయినట్టు నాకేవో నీతులు చెప్పుకొచ్చింది. దాని బండారం బయిట పెట్టిస్తాను.

సుబ్బారావు తెలివితేటలు అప్పుడు భార్యని మాయజేయటానికి చక్కగా పనికి వచ్చాయి.

చీరచెంగుకి కళ్ళొత్తుకుంటూ "సమయం రానివ్వండి. దీనిపని చెపుతాను!" అంది పార్వతి.

బావగారు చేసిన ఘోరాన్ని తన మనసులోనే అమాయకంగా దాచుకున్న నిర్మలకి.... అక్కగారు తనమీద కక్ష పెంచుకోటానికి ఆ బావగారే కారకుడయ్యాడని తెలియదు!

## 21

బంధువుల హడావిడి తగ్గాక చూసుకుంటే— ఒకటి రెండు నెలలపాటు ఇల్లు గడిచిపోవటానికి సరిపడ తిండి సామగ్రి – ఎనిమిది వందలపై చిల్లరడబ్బు మిగిలాయి. కృష్ణవేణికి గుండెలమీద

నుంచి ఎంతో బరువు దిగిపోయినట్లయింది.

పెళ్ళిలో ఆమె మెడ బోసిపోయి ఉండటం చూసి పుట్టింటివాళ్ళు, దగ్గర చుట్టాలు అడక్కపోలేదు. "ఏదో రిపేరు వచ్చి కంసాలికిస్తే సమయానికిచ్చారు కాదు!" అని మాట తప్పించేసిందామె. పెళ్ళికి వచ్చిన కృష్ణవేణి తల్లి తన నగ ఒకటి తీసి కూతురి మెడలో వేసింది. దాంతో తర్వాత ఎవ్వరూ ఆ ప్రసక్తి ఎత్తలేదు. ఆమెకా గండం గడిచింది.

అసలామె హృదయభారం తగ్గటానికి ముఖ్య కారణం....భర్త ప్రవర్తన!

ఆమెకా మధ్య జ్వరం వచ్చినప్పటి నుంచీ అతను చాలా మారిపోయినట్లు కనిపిస్తున్నాడు. ప్రొద్దున్నప్పుడు తమ్ముడితో కలిసి భోజనం చేస్తున్నాడు. ఎక్కువగా డబ్బు కూడా అడగటం లేదు. రాత్రిళ్ళంతగా ప్రొద్దుపోయి రావటం లేదు. పిల్లలతో అడపా తడపా ఆడటం, మంచి చెడ్డలు మాట్లాడ్డం....అనేక విధాలుగా మళ్ళీ వెనకటి మంచిరోజులు గుర్తు చేస్తున్నాడు!

మరిది పెళ్ళి దగ్గర పడుతోంది-తన సంసారం గుట్టు ఏం రచ్చకెక్కుతుందో అని మొదట భయపడింది. కాని, ఆ గండం గడిచిపోయింది. ఆమె పనులన్నింటిలోనూ కష్టసుఖాలడిగి తెల్సుకున్నాడు. చివరకి షావుకారు కొట్టుమంచి



సామానుతెచ్చుకునే రోజున ఆమెకు సాయంగా కూడా వచ్చారు.

ఆపూట ఆమె డబ్బు లెక్క చూసుకుంటుంటే విశ్వనాధం గదిలోకి వచ్చారు. ఆమె చేతిలో అంతడబ్బు చూసాక అతని కళ్ళు మెరిసాయి. తటపటాయిస్తూ నిలబడ్డారు. అతన్నోక్షణం పరకాయించి చూసింది కృష్ణవేణి.

అతను పేకాట వ్యసనంలో పడ్డాక అతని కెదురుగా ఆమె డబ్బు లెక్కపెట్టటం – 'అసలు డబ్బంతా ఒక చోట పెట్టడం మానేసింది. డబ్బు చూస్తే అతని బలహీనత పెరుగుతుందేమో అన్న భయం ఒక మూల – అడిగినంతా ఇచ్చేస్తే ఇల్లు గడవటం ఎలా అన్న అధైర్యం మరోమూల ఆమెకు దాపరికం నేర్పాయి. అవసరం వచ్చినప్పుడు అతనితో అబద్ధమాడటమూ ఆమెకు తప్పని సరయింది.

అలాగే, ఆ బలహీనత నణచుకోలేనప్పుడు అతను బ్రతిమాలో, మురిపించో....ఆ అస్త్రాలేవీ పనిచేయనప్పుడు కోపగించో డబ్బడిగి పట్టుకుపోతుంటాడు. అంతేకాని, ఆమె దగ్గర ఏరోజున ఎంతవుందో ఆమె చెప్పటమూలేదు. అతనడగటమూలేదు. తనకాస్వతంత్రం లేనివాడిలా బయట మనిషిలా తల తిప్పుకొని తనకు కావల్సింది అడుగుతాడు. ఆమె యిచ్చింది పుచ్చుకొని ముఖంలోకి చూడనయినా చూడకుండా వెళ్ళిపోయాడు.

అందుకనే, ఆమె డబ్బులు తీస్తున్నప్పుడు అతను దగ్గరగా వెళ్ళటం కూడా ఈ మధ్య కాలంలో జరగలేదు. ఆ పూట, ఆ స్థితిలో ఒకర్నొకరు చూసుకొని ఇద్దరూ కంగారు పడ్డారు.

కృష్ణవేణి ముందర తేరుకుంది. 'ఛ! ఎంతయినా తన భర్త' ఎవర్నో పరాయివాడ్ని చూసినట్టు, నేరస్తుడ్ని చూసినట్టు–చూడ్డమేమిటి!' అని తన్ను తాను మందలించుకుంది. "రండి! అలా నిలబడిపోయారేం?" అని నవ్వుతూ దగ్గరకి పిలిచింది.

కంగారును నవ్వుతో కప్పిపుచ్చుకుంటూ "ఏంలేదు....ఊరికినే...." అన్నారు.

"ఖర్చులు పోగా కొంతడబ్బు మిగిలింది. షాహుకారు కొట్లో బాకీ తీర్చేస్తే మంచిదనుకుంటున్నాను."

"అలాగే! అదే మంచిది."

"బాకీకి సరిపడా ఉంది. అంతా ఒక్కసారే ఇచ్చేస్తే షాహుకారు కొట్లో ఖాతా మానెయ్యచ్చు. కొంత విశ్రింతగా ఉంటుంది."

"అలాగే! ఇచ్చేయ్యి."

"పోనీ. మీరిచ్చేసి రాకూడదూ!"

"నేనా? ఎందుకులెద్దూ! నువ్వే యిచ్చేయ్యి." అన్నాడతను కంగారుగా.

తనమీద తనకే నమ్మకం లేని మనిషిలా కంగారు పడ్డాడతను. అతని ముఖం చూసేసరికి ఆమె మనస్సు చివుక్కుమంది. తన ముందు తన భర్త దోషిలా తల దించుకోవటం భరించలేకపోయింది. ముందు మాటవరసకన్నది–తర్వాత మమకారం తెచ్చుకొనే అంది. "మిమ్మల్ని అనుమానించేంత పాపాత్మురాలి ననుకున్నారా?"

విశ్వనాధం మనస్సు చలించిపోయింది. "ఛ! అదేం లేదు." అన్నారు.

"నాకు తెల్సు మీరు మారిపోయారని. నాకు తెల్సు నా కష్టాలు గడిచిపోయాయని!" అంటూ అతని చేతులు తీసుకొని తన బుగ్గలకి చేర్చుకుంది.

ప్రేమగా ఆమెను దగ్గరకు తీసుకున్నాడు విశ్వనాధం.

ఆ క్షణంలో ఆమె అతన్ని నమ్మటమేకాదు భార్య తనమీద ఏర్పరచుకున్న నమ్మకాన్ని నిలబెట్టుకోవాలని మనస్సులో దృఢంగా అనుకున్నాడతను. అయితే, వ్యసనానికి బానిసలయిన వాళ్ళకి ఒక్క మాటతో మనసుమారుతుందా? ఒక్క పూటలో జ్ఞానోదయమవుతుందా? అలా అయితే, కృష్ణవేణి లాంటి ఇల్లాళ్ళకు ఈ కన్నీటి బాధలుండేవేగావు....

*

పెళ్ళయిన తర్వాత ఆవేళ మొదటిసారి కాలేజీకి వెళ్ళింది మాధవి. ఆమె తిరిగివచ్చాక గుమ్మంలోనే యెదురువచ్చి "ఏం వదినా? నీ మంగళసూత్రం చూసి కొంటె కుర్రాళ్ళేమన్నారు?" అని అడిగింది నిర్మల.

మాధవి బుగ్గలు కెంపులయ్యాయి. "ఏమంటారు? ఇక నుంచి ఒళ్ళు దగ్గరపెట్టుకోవాలి కాబోలనుకున్నారు." అని నవ్వింది.

ఆమెను ఆపాదమస్తకం పరీక్షించింది నిర్మల.

"ఏమిటా చూపులు?" గోముగా అడిగింది మాధవి.

"ఏదో అనుకున్నాకాని........ఈ మంగళ సూత్రం, ఈ నల్లపూసలు....నిజంగా నీకెంతో నిండుతనం తెచ్చాయి వదినా!"

"యేం – నీకు వెంటనే వేయించుకోవాలనిపిస్తోందా?" అని నవ్వింది మాధవి.

"నాకా?....పెళ్ళికీ మనకీ అసలుపడదని నీకు తెల్సుగా?"

"ఆఁ! అలాగన్నవాళ్ళే ఎవరితో చెప్పకుండా ఏదో రోజున టక్కున పెళ్ళాడేస్తారు!" అంది మాధవి మూతితిప్పుతూ.

"అఫ్‌కోర్స్! అదయితేమాత్రం అక్షరాలా నిజం!"

ఇద్దరూ పకపక నవ్వుకున్నారు.

కృష్ణవేణి మంచినీళ్ళు తెస్తూ "....ఏమిటర్రా నవ్వులు?" అని అడిగింది.

"మామూలే!...." అంది నిర్మల.

"నువ్వు తెచ్చావెందుకక్కా! నేనే వచ్చేదాన్నిగా!" అని అక్కగారి వెంట లోపలికి నడిచింది మాధవి.

"ఏమిటమ్మా కాలేజీ విశేషాలు?" అని అడిగింది కృష్ణవేణి.

"పెళ్ళయిన వారానికే పరిగెత్తి వచ్చిందేం పిల్ల – అని బుగ్గలు నొక్కుకుని వుంటారు లెక్చరర్సు. నిన్న మొన్నటిదాకా బెదిరేకళ్ళతో పాఠాలు చెప్పేపిల్ల పంతులమ్మ....ఒక్క వారంలో ఎంత పెద్దరికం సంపాదించిందీ – ఎంత ధీమాగా చూడగల్గుతోందీ – అని తెల్లమొహాలేసుంటారు పిల్లలు!..." అని అభినయించి చెప్పింది నిర్మల.

అంతా నవ్వుకున్నారు.

"మరో నాల్గురోజులు సెలవుపెట్టాల్సింది." అంది కృష్ణవేణి.

"రెండునెలల్లో మీ మరిదికి పరీక్షలున్నాయిగా! అప్పుడు పెట్టచ్చని...." అంది మాధవి.

"ఆఁ! అన్నయ్యేక చదివినట్టే! నువ్వెదురుగా ఉంటే ఇంకేం చదువుతాడు?" అంది నిర్మల వేళాకోళంగా.

"పరీక్షలకి వెళ్ళే కుర్రాళ్ళని ఎలా అదుపులో పెట్టాలో మీ లెక్చరరు వదినకి తెల్సులే!" అని నవ్వింది కృష్ణవేణి.

"మీ అక్కయ్య కూడా నిన్నే ఆటపట్టిస్తోంది." అని మాధవి బుగ్గలో పొడిచింది నిర్మల.

మాధవి సిగ్గుగా నవ్వింది.

కాఫీలు కలిపింది కృష్ణవేణి. తాగుతూ కబుర్లు చెప్పుకుంటున్నారు ముగ్గురూ.

ఇంతలో ఏదో గుర్తొచ్చి "....నీ దుద్దులు దొరికాయి నిర్మలా!" అంది మాధవి.

నిర్మల ఉలిక్కిపడింది!

కృష్ణవేణి ఆత్రంగా అడిగింది. "ఎక్కడ దొరికాయమ్మా?"

"రజిని అనే అమ్మాయి పెట్టుకువచ్చిందక్కా! అచ్చు నిర్మలవే! అచ్చేమిటి-నిజంగా నిర్మలవే! నువ్వు చేయించినప్పుడు నేను చూడలేదేమిటి?.... అనుమానం ఆపుకోలేక రజినిని పిల్చి అడిగాను-ఎప్పుడు కొన్నావని. ఓ పదిహేను రోజుల యింది!"

కంగారు కప్పిపుచ్చుకుంటూ "అలాంటివే కంసాలి చేస్తే ఆ పిల్ల కొనుక్కుందేమో!" అంది నిర్మల.

"రజిని ఎవరిదగ్గర కొన్నదో వెళ్ళివాకబు చేస్తే తెలుస్తుందిగా!" నిర్మలనే పరీక్షగాచూస్తోంది కృష్ణవేణి.

"రజని అలాంటిది కాదు వదినా!" అంది నిర్మల తడబడుతూ.

"పోన్లేమధూ! నిజంగానే పోయాయేమో!" అంది కృష్ణవేణి.

"రజనిని కాదక్కా అడిగేది. కంసాలి నడుగుతాను....అతనికెవరమ్మారో తెలిస్తే దాన్ని బట్టి కొంత నిజం తెల్సిపోతుందిగా?" అంది మాధవి.

స్కూలు నుంచి పిల్లలు రావటంతో ఆపై సంభాషణ ఆగిపోయింది.

మరి కాసేపటికి మురళి వచ్చాడు. అతని చేతుల్లో పెద్ద పూలపొట్లం ఉంది.

"ఎవరికివ్వాలి?" అన్నాడు భార్యనీ చెల్లెల్నీ మార్చిమార్చి చూసి నవ్వుతూ.

"ఇంకెవరికి? ఈవిడకే!" అంటూ అన్నగారి మీద పడేలా వదిన్ని ఒత్తోపు తోసింది నిర్మల.

మాధవిని పట్టుకొనే హడావిడిలో మురళి చేతుల్లోంచి పూలపొట్లం పైకెగిరిపోయింది.



## పుస్తకాలు

### అరుణ కిరణాలు

(గేయాలు)

[రచన : అడవి కొలను పార్వతి; వెల : రు. 5.00 పేజీలు : 56 : ప్రతులకు : అడవి కొలను పార్వతి, అపర్ణా పబ్లికేషన్స్; గాంధీ నగర్, కాకినాడ-4]

"బాధల్లోంచి, ఆవేదనల్లోంచి, కవిత జన్మిస్తుంది. అన్యాయాల్ని, అక్రమాల్ని కవిత గర్హిస్తుంది" అని తన మాటగా చెబుతూ 'అరుణ కిరణాల్ని' అందుకు ఉదాహరణగా చూపిస్తారు-రచయిత్రి.

పఠితల్లో ఆవేశం రగిలించి, ఆత్మ విశ్వాసం కల్గించి (కొన్ని) మళ్ళీ మళ్ళీ చదవాలనిపించే ఈ గేయాలన్నీ కవయిత్రి ప్రతిభకు మచ్చుతునకలు.

"ప్రతి వనితా ఝాన్సీలక్ష్మిగా, ప్రతి మహిళా రాణీ రుద్రమగా పోరాటం సలపండి" అని వెన్ను తట్టి ప్రోత్సహిస్తారు.

"తిరగలిలా తిరగకండి, తిరుగుబాటు చెయ్యండి" అంటూ దగా పడిన కన్యలకు, దోచబడిన గృహిణులకు 'మీ గమ్యం తిరుగుబాటు-మీ లక్ష్యం తిరుగుబాటు...మీ భావితరాల బాట మీరే నిర్మించండి అని సూచిస్తారు.

"ఇది ఏ నాగరికత పూసిన పువ్వు: ఇది ఏ నాగరికత పండించిన పంట: వలువలు మార్చినంత సులువుగా, విలువలు విసర్జించేస్తారు" అని వాపోతూ...."ఈ కుహనా నాగరికతను, పునాదులతో పెళ్ళగించి, సమతా వ్యవస్థను స్థాపించాలి. సమధర్మాన్ని విరియించాలి" అని 'ఆధునిక నాగరికత' లో తెలియబరుస్తారు.

ఇందులో వున్న ముప్ఫయి కవితలు, సమ సమాజ నిర్మాణం కోసం, అన్యాయాల నిర్మూలన కోసం, వనితల ఆవేదన తొలగించటం కోసం, కవయిత్రి పొందిన తపన, భావావేశం ఆమె ప్రతి కవితలోనూ స్పష్టమవుతుంది.

అరుణ కిరణాలు చదివింప చేసేవే కావు.... ఆలోచింప చేసేవి కూడా!

### తేజోమూర్తులు

[ప్రముఖుల జీవిత విశేషాలు]

[రచన : ఇల్లిందల సర్వతిదేవి; వెల : రు. 10.00 పేజీలు : 106 : ప్రతులకు : ఇల్లిందల సరస్వతీ దేవి, 'సుదర్శన', 2. 2. 1118-½-న్యూ నల్లకుంట, హైదరాబాద్-44]

ఇందులో పదిమంది తేజోమూర్తులు వున్నారు. దాశరథిగారు చెప్పినట్లు తెలంగాణా కోటి రతనాల వీణ అనుకుంటే ఆ వీణమీద మంగళగీతిక నాలాపించటానికి అనువుగా తీగెలు వేసి, స్వరం కట్టిన మహానుభావులెందరో!

వీర తెలంగాణాలోని ప్రముఖులైన పదిమంది తేజోమూర్తులను పఠితలకు పరిచయం చేయటం ఉత్తేజంగానూ, ఉత్సాహంగానూ వుంది. ఆదర్శవంతమైన ఈ చిన్న గ్రంథం పఠనీయమే గాని సరసమైన ధరలో లేనందున....కొనటానికి సంశయించక తప్పదు.

అందరి హృదయాల్లోనూ చోటు చేసుకున్న రాజాబహద్దూర్ వెంకట్రామ రెడ్డిగారు, తెలంగాణను తేనె మాగాణిగా చేసిన కృషీవలుడు మాడపాటి హనుమంతరావుగారు, తెలంగాణా చీకట్లను పారద్రోలిన వారిలో అగ్రగణ్యులైన సురవరము ప్రతాపరెడ్డిగారు, '52లో ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రిగాను, ఆతర్వాత కేరళ గవర్నరుగాను పనిచేసిన బూర్గుల రామకృష్ణారావుగారు, యావదాంధ్ర దేశన్నే తేజోమయం చేసిన ఆదిరాజు వీరభద్రరావుగారు, ఈ నాటికీ ప్రజ్వలిస్తున్న తెలుగు వెలుగు రావి నారాయణ రెడ్డిగారు 'రయ్యత్' పత్రికతో తెలంగాణాలోని చీకట్లను పార ద్రోలిన మందుముల నరసింగ రావుగారు, అనాధల పాలిట అమృత భాండమైన శ్రీమతి సంగెం లక్ష్మీబాయిగారు, దళితవర్గాల పాలిట కామధేనువు, వనితలకు ఆదర్శప్రాయమైన శ్రీమతి సుమిత్రాదేవిగారు, సాంసారిక జీవితంలో దేశసేవ కూడా ఒక బాధ్యతగా గ్రహించి, కృషి చేస్తున్న అభాగ్యుల ఎడ కల్పవృక్షమైన యల్లాప్రగడ సీతాకుమారిగారు పాఠకుల్ని ఉత్తేజ పరుస్తారు.

ఈ సంపుటీకరణకు కారణమైన రచయిత్రి అభినందనీయురాలు.

"కేచ్!" అని పిల్లలొక్కసారిగా అరిచారు.

క్రిందపడకుండా పొట్లాన్ని టక్కున పట్టుకుంది నిర్మల. "...అన్నయ్య కావాలా? పూలు కావాలా? క్విక్......నిర్ణయించుకో!" అని కొంటెగా నవ్వింది నిర్మల.

అందరూ గలగలా నవ్వేసరికి సిగ్గుతో ముడుచుకుపోయి మురళి చేతుల్ని మృదువుగా విడిపించుకుంది మాధవి.

## 22

మర్నాడు మాధవిని కాలేజీలో కల్సుకుంది నిర్మల.

"వచ్చావా? నీ కోసమే ఎదురుచూస్తున్నాను. రజనిని పిలుస్తానుండు." అని కదలబోయింది మాధవి.

చటుక్కున ఆమె చెయ్యిపట్టుకొని ఆపింది నిర్మల. "ముందు నీతో ఓ సంగతి చెప్పాలి ఇలా రా వదినా!"

ఇద్దరూ స్టాఫ్ రూమ్ వదిలి కాలేజీ గ్రౌండులో చెట్ల క్రిందకి చేరారు.

"ఏమిటి చెప్పు!" అంది మాధవి.

"వదిన బాధపడుతుందని ఈ సంగతి యింట్లో చెప్పలేదు. నా దుద్దులు కంసాలికి అమ్మేసింది మరెవరోకాదు. నేనే!" అంది తల దించుకుంటూ.

నిర్ఘాంతపోయింది మాధవి.

"తప్పనిసరయి...."

చటుక్కున ఆమె చేయి పట్టుకుంది మాధవి. "ఎందుకు? ఎందుకమ్మాల్సివచ్చింది? అక్కయ్యతో కూడ చెప్పకూడనంతటి అవసరం నీకే మొచ్చింది?"

"అవసరమైన ఖర్చే వచ్చింది. వదిన్నడిగి బాధపెట్టలేక...."

"అబద్ధం. నీకు దుద్దులమ్ముకునేంత ఖర్చే ముంటుంది? నా నుంచి ఏదో దాస్తున్నావు."

"లేదు వదినా! నిజం."

"నిజం! నిజం నిశ్చలంగా ఉంటుంది. నీ ముఖంలోలా బెదురుతూ ఉండదు."

నిర్మల మాట్లాడలేదు.

మాధవి ముఖం జేవురించింది. "అవునులే! నాకెందుకు చెపుతావు. అవసరం వచ్చినా నన్ను డబ్బే అడగనిదానివి. వద్దు నిర్మలా! నాకు చెప్పద్దు. ఏమయినా నేను పరాయిదాన్ని." అంది ముఖం చిన్నబుచ్చుకుంటూ.

నిర్మల కంగారుగా ఆమె చెయ్యి పట్టుకుంది. "ప్లీజ్ వదినా! నన్నపార్థం చేసుకోకు."

"ఇన్నాళ్ళు అపార్థమే చేసుకున్నాను నిర్మలా! నువ్వు నాకు చెల్లెలిలాంటిదానివనుకున్నాను. నీ కష్టసుఖాలునావనుకున్నాను. నువ్వు మనస్సు విప్పి చాలా విషయాలు చెపితే నా గుండెల్లో పెట్టుకొని అన్నీ దాచుకున్నాను........చివరకి పొరపాటున కూడా పెదవివిప్పి మీ అన్నయ్యతో చెప్పలేదు."

"వదినా!"

"మనసులో నాకిష్టం లేకపోయినా నువ్వడిగావు కదాని పార్టయిమ్ జాబు యిప్పించాను. నేడో రేపో మొదటి జీతం వస్తుంది. నీ స్వంత సంపాదన చేతికి వస్తుంది. నీ యిష్టం వచ్చినట్టు చేసుకొనేదానివి .... ఎందుకు ఖర్చుపెట్టావని ఎవ్వరమూ అడిగేవాళ్ళము కాదే!...."

"అప్పటికింకా ఈ జాబ్ దొరుకుతుందని కూడా నాకాశ లేదు వదినా!...."

"నా దగ్గర అప్పయినా తీసుకోవాల్సింది. ఆ అవకాశం నువ్వు నాకివ్వలేదు. కనీసం దుద్దు లమ్మేసానని తర్వాతయినా నాతో చెప్పలేదు.... ఇప్పుడు తెలిసాక....ఎందుకు చేసావంటే చెప్పనంటున్నావు. నా మీద నీకెంత విశ్వాస ముందో తెల్సిపోయాక ఇంకా అర్థం చేసుకోకుండా ఉంటానా? థేంక్స్ నిర్మలా! మెనీ థేంక్స్!" అంది మాధవి ముఖం ముడుచుకుంటూ.

"నన్ను క్షమించు వదినా! నిన్ను నొప్పించాను."

మాధవి కోపంగా తల త్రిప్పుకుంది.

నిర్మల కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి. "సరే, ఎలాగా నిన్ను బాధపెట్టిన దాన్నయ్యాను. ఆ నిజమే నీకు చెప్పనీ!"

మాధవి ఆమెవైపు సూటిగా చూసింది.

"తాంబూలాలు పుచ్చుకొనే దానికి రెండు రోజుల ముందు ఇంట్లో బొత్తిగా ఏమీలేక చీర కొనటానికి డబ్బు అప్పు తెమ్మంది వదిన. మాట మీద మాట వచ్చి....అన్నయ్య చెయ్యి చేసుకున్నాడు...."

మాధవి మనస్సు చివుక్కుమంది. తెల్లబోయి చూసింది.

"అసలే వదిన ఆరోగ్యం బాగాలేదు. మీదకి వచ్చిన ఖర్చులెలా భరించాలని ఆందోళన. వీటన్నిటి మీద అన్నయ్య కొట్టటం....ఆ రాత్రి పస్తుండటం వీటితో తెల్లవారేసరికి వదినకి జ్వరం వచ్చేసింది!"

"బావగారెలాంటి వారెలా మారిపోయారు?"

"ఒకప్పుడు ఆదర్శదంపతులంటే వీళ్ళలా ఉండాలనుకునేవాళ్ళు తెలిసినవాళ్ళు. అప్పంటే అసహ్యించుకొనే వాడు అన్నయ్య — ఇంటిమీద అప్పులు తీరిన్నాదే తను కంటినిండా నిద్ర పోవాలనుకునేవాడు. అటువంటివాడు ఇప్పుడు యింకా అప్పులుచేసి పేకాడుతున్నాడు. పేకాటలో వేలు గెల్చి అప్పులు తీర్చగలనని భ్రమ పడుతున్నాడు. మమకారాలు మర్చిపోతున్నాడు. తనకేం జరుగుతోందో తనకే తెలియటం లేదు. ఆవేళ రాత్రి నేనన్నంపెడుతుంటే తనే ఆ మాట అన్నాడు. తను తప్పు చేస్తున్నానని తనకు తెల్సు. ఆ తప్పు మాత్రం సవరించుకోలేక పోతున్నాడు. నిజంగా అన్నయ్యని ఆ స్థితిలో చూస్తే నా కసహ్యం వేయలేదు వదినా! జాలే కలిగింది...."

"అసలేం జరిగింది?"

"వదిన మనస్సుకి శాంతి దొరకాలి. తాంబూలాలవేళ అవసరం తీరాలి. చిన్నన్నయ్యకి సంగతి చెప్పటానికి నా మనస్సొప్పలేదు వదినకి అదిష్టంలేదు. అందుకే మాలతిని పిలిపించి డబ్బవసరం గురించి చెప్పాను. పాపం, నలభై రూపాయలయితే ఇవ్వగలనంది. మరెక్కడి కయినా వెళ్ళి అడిగే వ్యవధిలేదు. ఒకవేళ అప్పు పుట్టినా తీర్చే మార్గంలేదు. ఇప్పుడయినా ఎప్పుడయినా వదిన్నే బాధపెట్టాలి. అందుకనే దుద్దులు అమ్మేసి....ఆ డబ్బుతో చీర తెచ్చిపెట్టమన్నాను"

మాధవి నివ్వెరపోయింది. "అంటే.... ఆవేళ నాకు పెట్టిన చీర...."

"ఏంచేయను వదినా! అప్పుడా గండం గడవటానికది తప్ప మరో మార్గం లేకపోయింది.

"ఎంతపని చేసావు నిర్మలా!"

నిర్మల చిన్నగా నవ్వింది. "ఆ పనివల్ల ఎంత మేలు జరిగిందో తెలుసా? వదిన జ్వరం క్షణాలమీద తగ్గిపోయింది. జరిగినదానికి అన్నయ్య పశ్చాత్తాపపడ్డాడు. ఆవేళ ఆ ముచ్చట తీరి ఇంటి గౌరవం నిలబడింది!"

మాధవి కళ్ళు చెమర్చాయి. "అక్కయ్యతో చీర ఎలా కొన్నానని చెప్పావ్?"

"అన్నయ్య కొనిచ్చి వెళ్ళారని చెప్పాను. అన్నయ్యతో అప్పుచేసి నేనే కొన్నానని చెప్పాను.

వదిన అడిగితే తను కొన్నట్టే చెప్పమన్నాను. దానివల్ల తనతప్పు తానే తెల్సుకున్నాడన్నయ్య. వదిన మనస్సు కుదుట పడింది. అంతకన్నా ఆనందం నాకేంకావాలి?''

"నువ్వు చేసినపని నాకు మాత్రం బావోలేదు".

''అందుకే. నీకివేవీ చెప్పటానికిష్టపడలేదు నేను. వదినకి తెలిస్తే ఇంకా బాధపడుతుందని నిజం చెప్పలేదు. మాలతి వాళ్ళచుట్టాల పెళ్ళికి పెట్టుకు వెళ్ళిందని, అక్కడ పొరపాటున పోగొట్టుకుందని అబద్ధమాడాను. పాపం, నామూలంగా మాలతి నిందమోస్తోంది. నువ్వు రజని చెవులకి చూడకపోతే—ఈ సంగతి ఎవరికీ మళ్ళీ గుర్తుకి వచ్చేదేకాదు..నిజంగా అబద్ధానికున్న అవసరం నిజానికి లేనేలేదు! చూడు....ఒక అబద్ధం చెప్పి వదిన్ని ఎంతో సంతోషపెట్టగలిగాను....మరి నిజం చెప్పి నిన్నిప్పుడెంతో బాధపెట్టినదాన్నయ్యాను''.

మాధవి ముఖంలో ఇంకా విషాదం గూడు కట్టుకునే ఉంది. ''కనీసం నన్నప్పుగానయినా అడిగుంటే నాకింత బాధ వుండేదికాదు''.

''చెప్పానుగా—ఆ పరిస్థితుల్లో ఇల్లు కదిలి రావటానికి వీల్లేకపోయిందని. అదీకాక, నీకు చీర కొనటానికి నీ దగ్గరే అప్పు తీసుకోనా?'' అని నిర్మల నవ్వింది.

''అవును. అందులో తప్పేముంది? అప్పంగా కాదు—అప్పుగానే కదా! ఇప్పుడు బైపు పని చేసుకుంటున్నావు. నీ జీతం వచ్చాక నువ్విచ్చే దానివి....''

''ఇప్పుడు నేనిస్తే పుచ్చుకుంటావా?''

''ఆఁ! తప్పకుండా పుచ్చుకుంటాను. ప్రిన్సిపుల్ కోసమయినా నీ మాటని గౌరవించే దాన్ని....''

''అప్పటికింకా పని దొరకలేదుగా నాకు! అప్పుడీ ఆలోచన లేముంటాయి? అయినా నువ్వింత బాధపడనక్కర్లేదు. ఇప్పటికి వదిన అమ్మేసిన వాటితో పోలిస్తే ఇదెంత? నథింగ్! ఆవేళ నేను దుద్దులమ్మకపోయుంటే—తను మరోటి అమ్మేసుండేది. నాకు తప్పినా ఆవిడకు తప్పుండేది కాదు.''

మాధవి చీర చెంగుకి కళ్ళొత్తుకుంది, "అవును నిర్మలా! మనస్సు నిండా బంగారం నిండివున్న మనిషివి....నీకీ బంగారపు వస్తువులు అవసర మేముంది?''

వదినగారి చేతులు గుత్తిగా పట్టుకొని ముద్దు పెట్టుకుంది నిర్మల. ''వీటికేమి కాని—నా మీద నీకు కోపం పోయింది. నాకంతే చాలు!''

ఆ సాయంత్రం యింటికి వచ్చాక కృష్ణవేణి అడక్కముందే తనే చెప్పింది మాధవి. ''నేనే పారవద్దనక్కా! ఆ దుద్దులు నిర్మలవి కావు... రజని క్రొత్తగా చేయించుకుంది'' అని.

## 23

''వదినా! ఇదిగో జీతం.'' అంటూ అందించాడు మురళీమోహన్.

''మాధవికియ్యి మురళీ!'' అంది కృష్ణవేణి.

మాధవిని పిలిచాడతను. ''వదిన జీతం నీకియ్యమంది ఇదిగో!'' అని యిచ్చి చేతులు దులుపుకుంటూ నవ్వాడతను.

మాధవి తెల్లబోయింది. ''నాకియ్యటమేమిటి? ఇదిగో, నాది కూడా అక్కయ్యకే ఇద్దామని తెస్తున్నాను....'' అంటూ తన చేతిలోని డబ్బు చూపించిందామె.

''ఇప్పుడేమంటావ్ వదినా?'' అన్నాడు మురళి భుజాలెగరేస్తూ.

''ఇకనుంచి ఇంటి ఖర్చు—అదీ మీరు చూసుకోవటం మంచిది మురళీ!'' అంది కృష్ణవేణి నవ్వటానికి ప్రయత్నిస్తూ.

''అదేం వీల్లేదు. అప్పుడే రిటయిరై పోదామనుకుంటున్నావా?'' అన్నాడతను పరిహాసంగా.

''నేనసేది....డబ్బవసరం వచ్చినప్పుడు నేనే అడుగుదామని....''

వదినగారి మాట కడ్డు వచ్చాడు మురళి. ''మాకవసరం వచ్చినప్పుడు మేమే అడుగుతాము!''

ఆ డబ్బంతా కృష్ణవేణి చేతిలో పెడుతూ, ''అవునక్కయ్యా! ఎలా సమర్ధించుకోవాలో మాకేం తెలుస్తుంది? నిన్నటిదాకా నాన్నగారికిచ్చే దాన్ని. ఇప్పుడు నీకిస్తున్నాను. కావల్సినవేవయినా ఉంటే చెప్పు, మేం తెస్తాం. అంతేకాని, ఇంటి ఖర్చులూ అవీ మాకేం తెలుస్తాయి!'' అంది మాధవి.

''పోనీ, కొంతయినా నీ దగ్గరుంచమ్మా!'' అంది కృష్ణవేణి.

---



ఇది కంప్యూటర్ల యుగం కదా అని ఇంగ్లండులోని ఒక బ్యాంకు ఈమధ్యనో కంప్యూటర్ను ఏర్పాటు చేసుకుంది. అన్ని కంప్యూటర్లలాగే ఈ కంప్యూటరూ చకచకా పన్లు జేసెయ్యడం మొదలుపెట్టింది. ఆ బ్యాంకులోనే ఒక అందమైన సెక్రట్రీ వుంది. ఇక్కడే వచ్చింది చిక్కు. ఈ అందమైన సెక్రట్రీ కాస్తా ఆ కంప్యూటర్ దగ్గరకెళ్తే చాలు—అది సరిగ్గా పన్జెయ్యడం మానేసి, గుడ్లప్పగించి చూస్తున్న దానిలా బ్యాలన్స్ తప్పి, లెక్కలన్నీ తప్పుల తడకగా చెయ్యడం ప్రారంభించింది. బ్యాంకులోని వారికి రెండు సందేహాలు కలిగాయి, కొంపదీసి దీనికి ఆడగాలి పడదా, లేక అందమైన ఆ అమ్మాయిని చూడగానే కంప్యూటర్‌కీ మనస్సు స్థిమితం తప్పిందా? అని....ఆ తరువాత హేమా హేమీలైన కంప్యూటరాపరేటర్లు, తదితర సిబ్బంది వచ్చి—''ఛట్...అవేవీ కావు.... ఈ కంప్యూటర్‌కి సింథటిక్ ఫైబర్ పడదు. ఆ ఫైబర్ దగ్గరకు వస్తే ఈ రకం కంప్యూటర్లు సరిగ్గా పని చెయ్యవు..'' అని చెప్పారుట.

ఇంతకీ—ఆ సెక్రట్రీ సింథటిక్ ఫైబర్ గల నైలాన్ చీరలే ధరిస్తుందట.... అద్గదీ అసలు కారణం!

"సరే, నీ మాటెందుక్కాదనాలి?" అని ఐదు పది నోట్లు తీసుకుంది మాధవి.

"ఊహుఁ! ఇది కూడా ఉంచు...." అని ఆమె చేతుల్లో వందనోటు పెట్టి గబగబా లోపలికి వెళ్ళిపోయింది కృష్ణవేణి.

ఆ రాత్రి తొమ్మిదిగంటల వేళప్పుడు వచ్చాడు విశ్వనాధం. వస్తూనే తన జేబులోని డబ్బు తీసిచ్చాడు. లెక్కపెట్టింది కృష్ణవేణి. ఎప్పట్లాగే అర్ధజీతం! పరిస్థితిలో ఏం మార్పులేదు. తమ్ముడి పెళ్ళయినప్పట్నుంచీ అతను మారినట్టు కనపడింది కేవలం కనపడ్డమే అనిపించింది.

మాధవి ఎంత యిచ్చిందో, మురళి ఎంత ఇచ్చాడో చెపుదామని ఆమెకి పెదవి చివరిదాకా వచ్చింది....

దానివల్ల అతను సిగ్గుపడతాడన్న ఆశ కలగ లేదు. ఆమె చేతిలో ఇంత డబ్బుంది కదా అన్న 'నిశ్చింత'లో రేపట్నుంచి ఇంకా ఎక్కువ అడగ వచ్చు. అందుకనే, నోరు విప్పకుండా నిరుత్సాహంగా నిలబడిపోయిందామె.

ఈమధ్య కాలంలో అతనెదురుగా ఆమె డబ్బు లెక్కపెట్టటం జరగలేదు. అతనెంత ఇస్తే అంత మౌనంగా తీసుకోవటమే! ఇంత తక్కువ వచ్చిందేమని ఆమె అడగటమూ లేదు....అతను చెప్పటమూ లేదు.

తను లోపలికి వచ్చేటప్పుడు మాధవి కూడా హాల్లో కూచుని కబుర్లు చెపుతూండటం చూసాడు విశ్వనాధం. ఆమెక్కూడా ఆవేళ జీతం వచ్చి ఉంటుందని అతనికి స్పృహలోకి వచ్చింది. తనవైపు మార్చి మార్చి చూస్తూ కృష్ణవేణి డబ్బు రెండుసార్లు లెక్కపెట్టింది. అది చూసేసరికి మాధవి తన జీతం ఆమెకిచ్చిందని కూడా అర్ధమయింది....తన తప్పును భార్య ఎత్తి చూపించటానికి ఇష్టంలేక అలా చూస్తూ నిలబడిందని కూడా అతని కర్ధమయింది....

అందుకనే "పాత అప్పులుంటే తీర్చేసాను" అన్నాడు కంగారు కప్పిపుచ్చుకుంటూ.

ఆమె చూపులు చలించలేదు.

"వచ్చే నెలనుంచి ఇంత బాధుండదు!" అని మళ్ళీ తానే అన్నాడు.

తనకు పేకాట బాధ ఉండదనా – తనవల్ల భార్యకి బాధ వుండదనా–ఆ మాటలకేమని అర్థం చెప్పుకోవాలో ఆమెకు తెలియలేదు. గాఢంగా నిట్టూర్చింది. ఆ డబ్బు కూడా లోపల పెట్టేసి, "కాళ్ళు కడుక్కోండి. వడ్డిస్తాను" అని గది బయిటకి నడిచింది.

అప్పుడే బయిటనుంచి వచ్చింది నిర్మల.

"ఏమిటి నిర్మలా ఇంత ప్రొద్దుపోయేదాకా ఉన్నావ్?" అంది కృష్ణవేణి.

నిర్మల నవ్వుతూ ఒక వందనోటు, ఐదుపదులూ ఆమె చేతికందించింది. "ఇది నా జీతం వదినా!"

"జీతం సరే! ఏమిటింతవరకూ పనుందా?"

"కొంచెం కాగితాలు ఎక్కువయ్యాయి. పని పూర్తి చేయందే ఎలా రావటం?"

వాళ్ళమాటలు విని మాధవి, మురళీమోహన్‌లు వాళ్ళ గది బయిటకు వచ్చారు.

"చేసింది చాలుకాని....ఇంకీపని మానెయ్!" అన్నాడు మురళి.

నిర్మల నొసలు చిట్లించింది. "ఏం? ఎందుకు మానెయ్యటం?"

"చీకటి పడేదాకా ఉండి పని చెయ్యవల్సిన కర్మేమిటి నీకు?"

''ఇందులో కర్మేముంది? ఊరికే ఇంట్లో కూర్చునేబదులు చేస్తున్నాను. మీ అందర్కీ ముందే చెప్పి చేస్తున్నాను కదా! మరో పనేదైనా దొరికితే ఇది మానేస్తాను!''

''నువ్వయినా చెప్పు వదినా!....'' అన్నాడు మురళి.

''నువ్వే చెప్పు వదినా! చిన్నవదిన వాళ్ళ నాన్నగారు పని యిప్పించారు. మా ప్రొప్రయిటరు గారు కూడా చాలా మంచివారు. మధ్యలో హఠాత్తుగా మానేస్తే మనకేం మర్యాదగా ఉంటుంది చెప్పు?'' అంది నిర్మల.

అప్పుడే కాళ్ళు కడుక్కొని వచ్చిన విశ్వనాధం ''పోనీ, చెయ్యనియ్యండి. దాన్ని నిరుత్సాహ పరచటం ఎందుకు?'' అన్నాడు.

అతనా విషయంలో కలగచేసుకోవటమే ఒక గొప్ప విషయంగా తోచింది అందర్కీ. ఆ సంతృప్తిలో 'చీకటివేళ ఆడపిల్ల పనికి వెళ్ళి వస్తోంద'న్న 'ఆందోళనే మర్చిపోయింది కృష్ణవేణి.

''రేపట్నించి ఇంత ఆలశ్యంగా మాత్రం రాకు....పని ఎక్కువగా ఉంటే ప్రొద్దున్నే వెళ్ళి చేద్దుగాని'' అంది.

నిర్మల సంతృప్తిగా తల వూపింది!

## 24

సత్యనారాయణగారి జీవితం మొదట్నించీ ఒడిదుడుకులతోనే నడిచింది. తండ్రి అర్ధంతరంగా గుండె జబ్బుతో చనిపోయాడు. దాంతో యావత్తు యింటి బాధ్యత ఆయన మీద పడింది. ముగ్గురు చెల్లెళ్ళకి పెళ్ళిళ్ళు చేయాల్సి వచ్చింది. ఒక తమ్ముడ్ని చదివించాల్సి వచ్చింది. వాళ్ళని పెంచి పెద్దవాళ్ళని చేసి వాళ్ళని జీవితాల్లో స్థిరపరిచేసరికి ఉన్న యిల్లు తప్ప తాతలనాటి ఆస్తంతా కరిగిపోయింది.

తన పిల్లలు పెరిగేనాటికి చేస్తున్న తాలూకాఫీసు గుమాస్తా ఉద్యోగం తప్ప వేరే ఏ ఆధారమూ లేకపోయింది. పెద్దకొడుకు కృష్ణారావుని స్కూలు ఫైనలు పాసయిన వెంటనే తనకు కొంత ఆసరాగా వస్తాడని – ఉద్యోగంలో చేర్పించటమే మంచిదనుకున్నాడు. కాని, కొడుకు పైకి చదువుతానన్నాడు. 'ఎలాగోలా కొడుకుని పైకి చదివించవయ్యా! చదువుకుంటానన్న వాడిని ఆపకూడదు. ఇప్పుడు కష్టపడి చదివించావో తర్వాత పెద్ద ఉద్యోగం వస్తుంది. అప్పుడు నిన్ను సుఖపెడతాడు....' అని పోరారు స్నేహితులు – పరిచయస్తులు. భార్య సుభద్రమ్మ కూడా కొడుకు తరఫున పోరాడింది!

ఆ కొడుకు భవిష్యత్తుతోపాటు తక్కిన పిల్లల భవిష్యత్తు కూడా దృష్టిలో పెట్టుకొని.... అప్పటికి శక్తికి మించిన పనే అయినా కృష్ణారావును చదివించటానికి నిశ్చయించుకున్నాడు. ఆ తర్వాత కొడుక్కి డబ్బు పంపటానికి ఎంత శ్రమ పడ్డాడో....ఎన్ని పాట్లుపడ్డాడో ఆయనకి తెల్సు – భగవంతుడికి తెల్సు!

చివరకి కృష్ణారావు ఫైనలియర్ ఇంజనీరింగులోకి వచ్చేసరికి....డబ్బుకి కటకటలాడిపోతున్న సత్యనారాయణగారికి రెండో కొడుకు అండ నిలవవల్సి వచ్చింది. అప్పటికి స్కూలు ఫైనల్లోకి వచ్చిన విశ్వనాధం ఉద్యోగంలోచేరి సంపాదించవల్సి వచ్చింది.

'వచ్చే యేటికి అన్నయ్య కుద్యోగం వస్తుంది. అప్పుడు నువ్వు కాలేజీలో చేరి తప్పకుండా చదువుకుందుగానిరా!' అన్న తండ్రి మాటని కాదనలేకపోయాడు విశ్వనాధం. 'ఒకేడు చదువు పోయినా ఫర్వాలేదు. తర్వాత చదువుకుంటాను కదా'ని – అప్పుడు సమాధాన పడిపోయాడు – కాని, ఆ తర్వాత అన్నగారుద్యోగం సంపాదించిన వెంటనే....ఇంట్లో ఎవరికీ చెప్పకుండా ఎవర్నో పెళ్ళాడి యింట్లోంచి వెళ్ళిపోతాడని, ఆ పైన తండ్రికి చదివించే శక్తి లేక తనా ఉద్యోగంలోనే స్థిరపడి పోవాల్సి వస్తుందని అతనూహించలేకపోయాడు!

సత్యనారాయణగారి ఆశల్ని వమ్ము చేయటమే కాదు – విశ్వనాధం భవిష్యత్తునే పాడు చేసేసాడు కృష్ణారావు!

ఆ తర్వాత తక్కిన పిల్లలు యెదిగి వచ్చారు. విశ్వనాధం ఆసరా లేకుండా కుటుబం గడవటమే కష్టమయిపోయింది. పులిమీద పుట్రలా తమ్ముడు డబ్బు కావాలని పీకలమీదకి వచ్చి కూర్చున్నాడు. తండ్రి పోయాక తన్ను చదివించి ఒక ఉద్యోగస్తుడ్ని చేసాడన్న విశ్వాసమయినా లేకుండా.... తన కూతురికి పెళ్ళి చేయాలని....యిల్లు అమ్మేసి తన వాటా డబ్బు యివ్వమని అడిగాడు.

పిత్రార్జితమైన ఆస్తిలో చివరకి మిగిలినది ఉన్న ఆ యిల్లు ఒక్కటే! అది కూడా అమ్మేసుకుంటే ఈ మాత్రం నిలవ నీడ కూడా పోతుంది. ఇక ముందు అద్దెలు కూడా పెట్టుకుంటూ సంసారం ఈడ్చటం ఎలా?

ఆ భయంతోనే యిల్లు అమ్మలేకపోయాడు సత్యనారాయణగారు. అదే సమయంలో విశ్వనాధంకి పెళ్ళి సంబంధాలు రావటం ప్రారంభించాయి. మొదట తనకప్పుడే పెళ్ళివద్దన్నాడు తను....కాని, యిల్లు నిలబెట్టుకోవటం కోసం పెళ్ళికొప్పుకోవాల్సి వచ్చింది. అత్తవారిచ్చిన కట్నం అతను అనుభవించలేదు. పినతండ్రికి యింటి వాటా సొమ్ముగా ధారాదత్తం చేయాల్సి వచ్చింది!....ఆ కట్నం సొమ్ము చాలక అదే యింటి మీద కొంత అప్పు తీసుకొని కూడా యివ్వవల్సి వచ్చింది.

రక్తమాంసాలు పిండి డబ్బు పట్టుకుపోయిన రక్త సంబంధీకుల కన్న – అప్పులవాడే మెరుగనిపించాడు! వడ్డీ పుచ్చుకున్నా....యిల్లు లాక్కుంటానని మాత్రం అనలేదు.

కృష్ణవేణి అత్తవారింటికి వచ్చేసరికి అదీ పరిస్థితి....

మరుసటి సంవత్సరం మురళి స్కూలు ఫైనల్ పాసయ్యాడు. కాని మొదట్నించీ అతన్ని పైకి చదివించాలనే ఉద్దేశ్యం పెట్టుకోలేదు సత్యనారాయణగారు. పెద్దకొడుకులా చేస్తాడన్న అనుమానం వల్ల కాదు....కేవలం తనకా శక్తిలేక!

[సశేషం]

వచ్చి మిర్చి తాజాగా వుంచడానికి వాటిని పొడిగా వున్న సీసాలో వేసి కాస్త పసుపు గుండ వేయండి. గట్టిగా మూత వేస్తే వారం రోజుల వరకూ తాజాగా వుంటాయి.





వెయ్యి కంపు కొట్టకుండా తాజాగా ఉండడానికి నేతి సీసాలో చిన్న బెల్లం ముక్క వేయండి.

—శుభ

కుటీర పరిశ్రమ:

# అగ్గిపెట్టెల తయారీ

మనదేశంలో అగ్గిపెట్టెలు తయారుచేసే పరిశ్రమలో ముందంజ వేస్తున్న నగరం దక్షిణ ప్రాంతంలోని 'శివకాశి'. 'వనిత' ప్రతినిధి ప్రత్యేకించి 'శివకాశి'కి వెళ్ళి అక్కడి పయనీర్ మాచ్ ఫ్యాక్టరీని సందర్శించి వచ్చారు. విశేషమేమంటే అక్కడ అనేక వందలమంది స్త్రీలే పని చేస్తున్నారు. పైగా ఆ ఫ్యాక్టరీ భాగస్వామురాలు ఒక స్త్రీ. ఆమె పేరు రామేశ్వరీ అణ్ణామలై. అగ్గిపెట్టెల పరిశ్రమకు సంబంధించిన వివరాలు, ఫొటోలు యిక్కడ పొందుపరుస్తున్నాము.

పంచభూతాలలో పవిత్రమైనది అగ్ని. వివాహాది శుభకార్యాలలో అగ్నికి ప్రముఖ స్థానముంది. హోమగుండం రాజేయడం. అగ్నిప్రదక్షిణం చేయడం వంటివి అనాదినుండి వస్తున్న ఆచారాలు. సమస్త పాపాలను, మలినాలను ప్రక్షాళితం చేసి–పవిత్రవంతం చేయగల శక్తి అగ్నికి మాత్రమే వున్నదని మన పూర్వీకుల విశ్వాసం.



అంతేకాదు. అగ్ని మన నిత్యజీవితంలో ఒక భాగమయిపోయింది. అంచేత అగ్గిపెట్టెలూనూ. తెల్లవారి లేస్తూనే పాలు కాచుకోవాలన్నా, కాఫీ కలుపుకోవాలన్నా అగ్గిపెట్టె కోసం వెతకాలిగదా!

అసలీ అగ్గిపెట్టెల పరిశ్రమ అంటే ఏమిటి? అక్కడ అగ్గిపుల్లలు ఏవిధంగా తయారవుతాయి?

శివకాశిలో అగ్గిపెట్టెల పరిశ్రమ దాదాపు 56 ఏళ్ళక్రితం ప్రారంభమయింది. 1922 ప్రాంతాలలో అయ్యనార్‌నాడార్, షణ్ముగనాడార్ సోదరులు శివకాశి నుంచి కలకత్తా వెళ్ళి ఆ పరిశ్రమ గురించి క్షుణ్ణంగా అధ్యయనం చేశారు. తాము నేర్చిన విద్యతో శివకాశిలో అగ్గిపెట్టెల పరిశ్రమకి నాందీ ప్రస్థావన పలికారు. నేడు అక్కడ ఈ అగ్గిపెట్టెల పరిశ్రమలు మాత్రమే వెయ్యిదాకా వున్నాయి! అవన్నీ కూడా కుటీరపరిశ్రమలే కావడం మరో విశేషం. వీటికి ప్రభుత్వమూ, బ్యాంకులూ ఋణ సహాయం చేస్తున్నాయి.





అసలు ఈ పరిశ్రమ ప్రారంభించడానికి పెద్దగా పెట్టుబడి అవసరం లేదు. దాదాపు అయిదారు వేల రూపాయలుంటే చాలు. దీనికి ప్రత్యేకంగా శిక్షణ కూడా అవసరం లేదు. సాంకేతిక పరిజ్ఞానమూ అవసరం లేదు.

అగ్గిపెట్టెలు తయారీలో ప్రగతి సాధిస్తున్న సంస్థలలో పయనీర్ మాచ్ ఫ్యాక్టరీ ఒకటి. ఈ సంస్థ డైరెక్టర్ శ్రీ అశోక్. ముఖ్య భాగస్వామిని శ్రీమతి రామేశ్వరి. ఆమె అగ్గిపుల్లల తయారీ గురించి వివరిస్తూ "అగ్గిపుల్లలు తయారు చేయడానికి అవసరమైన కర్రలను కేరళ నుంచి తెప్పిస్తూ వుంటాము. వీటిలో 'ఆస్పెన్' 'మట్టి' అనేరకాలు ముఖ్యమైనవి. సాధారణంగా అందరూ కూడా ఈ రెండురకాల పుల్లలనే వాడుతూ వుంటారు. వీటిని 38 మి. మీ. 44 మి. మీ. మందంతో చిన్న చిన్న పుల్లలుగా తయారు చేసుకోవాలి. ఆ తరువాత 'చెక్కై' అనే ఫ్రేమ్‌మీద ఈ పుల్లలను వరసగా పేర్చాలి. ఈ ఫ్రేమ్ వెడల్పు 1", నిడివి 15", మందం ¼" ఉంటుంది. ఈ ఫ్రేమ్‌కు ఒకవైపున పుల్లలు అమర్చడానికి వీలుగా 52 సన్నని పొడుగాటి గళ్ళు వుంటాయి. వెనుకవైపు ఒక చిన్నగుడ్డ (మామూలు దుప్పటిగుడ్డ) పీలిక అమర్చుకోవాలి. ఈ 'చెక్కై'లో ఉంచిన పుల్లలు – చెక్కైతో సహా ఒక చట్రానికి బిగించుకోవాలి. ఆ విధంగా బిగించేటప్పుడు పుల్లలు కింద పడిపోకుండా ఉండడానికి ఈ గుడ్డ ఉపయోగపడుతుంది. బిగుతుగానూ వుంచుతుంది" అని తెలియజేశారు.

అవిధంగా ఒకేసారి 52 పుల్లలను ఈ చట్రంలో అమర్చవచ్చునన్న మాట. ఈ చట్రాలలో 'గా', 'టక్కా' అని రెండు రకాలు వున్నాయి. ఈ విభాగాన్ని 'ఫ్రేమ్ ఫిల్లింగ్' అంటారు. ఒక్క ఈ విభాగంలో మాత్రమే అయిదారు వందల మంది స్త్రీలు పని చేస్తున్నారు.

ఆ తరువాత ఈ చట్రంలోని పుల్లలన్నీ సరిసమానంగా ఉండేటందుకు క్రమపద్ధతిలో ఒకవైపు నెమ్మదిగా తడతారు. దీనినే 'లెవలింగ్' అంటారు. పుల్లలతో బిగించబడిన ఈ చట్రానికి కరిగించిన మైనం పూస్తారు. పుల్లల చివరలకు మందు అతకడానికి అనువుగా ఈ విధంగా మైనం పూస్తారన్నమాట. దీనినే 'వాక్స్ డిప్పింగ్' అని అంటారు. దీనికి 'మాచ్ వాక్స్' అనే ప్రత్యేకమైన మైనాన్ని వాడాలి. అంతేకాని మామూలు మైనం వాడకూడదు. మైనం పూయకపోతే మందు మాత్రం వెలిగి, వెంటనే ఆరిపోతుంది. ఎక్కువసేపు వెలగడానికి ఈ మైనం ఉపయోగపడుతుందన్నమాట.

ఇలా మైనం అంటించిన పుల్లలకు 'క్లోరెట్ ఫాస్ఫరస్' అనే రసాయనాన్ని పూస్తారు. అగ్గిపుల్లలమీద మనకు కనిపించే నల్లని మందు ఇదే! ఈ రసాయనం పూసిన తరువాత చట్రాలన్నిటినీ ఒక అరలో పేర్చి పెడతారు. ఈ విభాగాన్ని 'డిప్ స్ప్లింటర్ విభాగం' అని అంటారు. ఇక్కడ, పుల్లలకు వున్న మందు ఎండడానికి అరగంట వ్యవధి చాలు!

తరువాత ఈ చట్రాలను విడదీసి, చెక్కల నుండి అగ్గిపుల్లలను కూడా విడిగా తీస్తారు. వాటిని అగ్గిపెట్టెలలో అమర్చే విభాగాన్ని – 'బాక్స్ ఫిల్లింగ్' విభాగం అని అంటారు. "సాధారణంగా ఒక్కొక్క పెట్టెకు 50 పుల్లలు వుంటాయి కాని ఒక్కో సమయంలో అవి తగ్గడానికి అవకాశం లేకపోలేదు. అందువల్ల ఓ రెండు పుల్లలు అధికంగానే పెడుతూ వుంటాము" అని చెప్పారు శ్రీమతి రామేశ్వరి.

ఇహ—

అగ్గిపెట్టెల తయారీకి 'ఎలవు' అనే చెక్కలను, లోపలి పెట్టెలకు 'వాట్టమరమ్' అనే చెట్టు పట్టలను ఉపయోగిస్తారు. మనం ఉపయోగించే అగ్గిపెట్టెల ఆకారంలోకి యిది రావడానికి వీలుగా వీటిని మలుస్తారు. దీనిని 'స్కోరింగ్' అంటారు. ఇక్కడి ఫ్యాక్టరీలో పని పూర్తయిన తరువాత కార్మికులు అగ్గిపెట్టెలు చేయడానికి కావలసిన సరంజామాను ఇళ్ళకు తీసుకువెళ్ళి – తమ తీరిక సమయాలలో పెట్టెలను తయారు చేసి – తీసుకువస్తూ వుంటారు. ఈ పెట్టెలు తయారుచేయడానికి కావలసిన సరంజామా అంతా





కూడా శివకాశి దరిదాపులలోనే లభిస్తుంది. అగ్గిపెట్టెల వెనుక భాగంలో నీలం రంగు కాగితం అంటిస్తారు. ఆ తరువాత అగ్గిపెట్టెల పక్కలకు మందు రాస్తారు. ఈ మందు కూడా అగ్గిపుల్లలకు వాడే 'క్లోరైట్ ఫాస్ఫరస్' రసాయనమే!

ఇక మిగిలిందల్లా అగ్గిపెట్టెలమీద అది ఎవరు తయారుచేశారో తెలియజేసే చీటీలు అంటించడం. అదికాక ఎక్సైజు సుంకానికి సంబంధించిన లేబులు అతికించడం. ఈ లేబుల్ లేకుండా అగ్గిపెట్టెలు ఫ్యాక్టరీ దాటి, బయటకు రావడానికి వీలు లేదు. ఇలా తయారయిన అగ్గిపెట్టెలను 12 పెట్టెలు కలిపి ఒక ప్యాకెట్‌గా కడతారు. స్థూలంగా యిదీ అగ్గిపుల్లలు, అగ్గిపెట్టెలూ తయారు చేసే విధానం.

"మా అగ్గిపెట్టెల పరిశ్రమ కుటీర పరిశ్రమే అయినా—దీంతో యంత్రాల సహాయంతో పనిచేసే భారీ పరిశ్రమలు పోటీకి వచ్చే ప్రసక్తిలేదు. కారణం – మొత్తం వాడకంలో వారు సరఫరా చేస్తున్నది 30% మాత్రమే. పైగా శివకాశిలో తయారయే అగ్గిపెట్టెలు – శ్రీలంక, అమెరికా, ఇంగ్లాండు, అరబ్బు దేశాలకు ఎగుమతి అవుతున్నాయి. కేవలం మా ఒక్క సంస్థ మాత్రమే రోజుకి 80 కోట్ల అగ్గిపుల్లలు తయారు చేస్తోంది" అన్నారు రామేశ్వరి – ఈ పరిశ్రమలో పోటీ గురించి ప్రస్తావిస్తూ. వీరు తయారు చేసిన అగ్గిపుల్లల నాణ్యతను పరీక్షించడానికి ఒక ప్రయోగశాల కూడా వున్నది.

సామాన్యంగా ఇక్కడి 'ఫ్రేమ్ ఫిల్లింగ్', 'బాక్స్ ఫిల్లింగ్' శాఖలలో స్త్రీలే పని చేస్తూ వుంటారు. అగ్గిపుల్లలను ఏర్చి కూర్చడం, పెట్టెలలో వుంచడం వంటి పనులు చేయడానికి ఎంతో ఓర్పు కావాలి. అందుకే ఈ పనులకి స్త్రీలనే వినియోగిస్తూ వుంటారు.

ఇలా పని చేస్తున్నవారికి ఫ్రేమ్‌కి (52 పుల్లలకి) పదకొండు పైసల చొప్పున యిస్తారు. ఈ విధంగా వారు రోజుకి దాదాపు నాలుగైదు రూపాయలు దాకా సంపాయిస్తారు. విశేషమేమంటే శివకాశిలో సోమరితనం గలవాళ్ళు కనిపించనే కనిపించరు. అక్కడి పరిశ్రమలలో పని చేయడానికి చుట్టుపక్కల గ్రామాలనుండి కూడా మనుషులను రప్పిస్తూ వుంటారు. స్కూలు పిల్లలు కూడా తమ తీరిక సమయాలలో ఏదో ఒక పని చేసి ధనార్జన చేస్తూ వుంటారు. స్త్రీ కార్మికులకు చంటి పిల్లలుంటే వారికి ఏ ఇబ్బంది లేకుండా 'క్రెషె'లను ఏర్పాటు చేశారు. పిల్లలను అక్కడ నియమింపబడిన ఆయాలు చూసుకోవడమే కాక-వారికి పాలు, బిస్కట్లు వంటివి యిస్తారు. కార్మికులకు మధ్యాహ్న విరామ సమయంలో భోజన వసతులు కూడా ఏర్పాటు చేయబడుతున్నాయి. వారిని ఫ్యాక్టరీకి తీసుకురావడానికి ప్రత్యేకించి వాహనాలు కూడా వున్నాయి.

నిరుద్యోగం, సోమరితనం మచ్చుకైనా కనిపించని 'శివకాశి' యిలపై నిజమైన 'కాశి' అంటే అందులో ఏ మాత్రం అతిశయోక్తి కనిపించదు. □

## వనిత మాటల కొలువు - 35

### సరైన సమాధానం :

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 గ | ర | 14 గ | 15 రి | క | ■ | 2 ఆ | లు |
| జ | ■ | 3 ణి | మ | ■ | 4 నీ | రు | ■ |
| 5 ము | 16 తు | క | ■ | 6 నూ | లు | పో | గు |
| ■ | ను | ■ | ■ | 7 న | గు | రు | ■ |
| 8 నా | క | 17 వ | 18 ని | త | ■ | ■ | 19 ర |
| గ | ■ | 9 గ్ర | ద్ధు | ■ | 10 కూ | చి | క |
| ము | ■ | 11 హ | ర | 20 కు | డు | ■ | క |
| ■ | 12 వా | ము | ■ | టి | ■ | 13 క్ష | రి |

పై సమాధానంతో సరిపోయే సమాధానాలు ఇద్దరు పంపారు. వారు :

1. బుర్రా వెంకటలక్ష్మి, వేటపాలెం.
2. ఆర్. అరవిందకుమారి, హైదరాబాదు.

బహుమతి మొత్తం రూ. 150 లను ఈ ఇద్దరికీ సమానంగా పంచి అందజేస్తున్నాము.





## నిబంధనలు

'వనిత మాటల కొలువు'లో స్త్రీలు మాత్రమే పాల్గొనాలి. ఈ సంచికలో ఉన్న కూపను పూర్తి చేసి కవర్లో పెట్టి 'వనిత మాటల కొలువు – 37' చందమామ బిల్డింగ్స్. మద్రాసు – 600 026 చిరునామాకు జూలై నెలాఖరులోగా చేరేలా పంపాలి. ఆ కవర్లో మాటల కొలువు కూపను తప్ప మరేదీ ఉండకూడదు. ఒక కవర్లో ఒక్క ఎంట్రీయే ఉండాలి. గళ్ళలో వేసే అక్షరాలు శుభ్రంగా, తెలిసేలా ఉండాలి. కొట్టివేతలూ దిద్దుబాట్లూ ఉండకూడదు. దీని సమాధానం, ఫలితాలూ 1978 సెప్టెంబర్ సంచికలో ప్రచురింపబడతాయి. మా దగ్గర గల సమాధానంతో సరిపోయే సమాధానం పంపినవారికి రూ. 150 లు బహుమతిగా పంపుతాము. సరైన సమాధానం పంపేవారు ఒకరికంటె ఎక్కువమంది గనుక ఉంటే, బహుమతి మొత్తం సమానంగా పంచబడుతుంది. దీనికి సంబంధించిన ప్రతి విషయంలోనూ 'వనిత' నిర్వాహకవర్గానిదే తుది నిర్ణయం. ఈ విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరపబడవు.

### ఆధారములు – అడ్డము

1. సంగీతాన్ని సృష్టించే అక్షరాల్లో మూడు కలిస్తే జరీలా మెరుస్తాయి
2. తపాలా బిళ్ళలతో ఒక రకమైన 'దగ్గర' సంబంధంగల నది
3. విసురుతుంది. కాని గాలీ తగలనివ్వదు; దెబ్బా తగలనివ్వదు
4. పొంచి ఉండడం తిరగబడడం
5. పొగా వెయ్యడానికి అనువుకానిది
6. చివర కొమ్ముంటే అనుకూలంగానే వుంటుంది
7. మిమ్మల్నేనండీ—తిరగెయ్యండి!
8. ఎక్కువమంది సులభంగా ఇవ్వగలిగేదే గాని, ఎక్కువమంది పుచ్చుకోలేరు!
9. పాలు, పెరుగు కావాలంటే ఏం వేస్తారు? కుడి నుంచి ఎడమకు చదవండి
10. పండుగలా కనిపించాలంటే, మకు కొమ్మిచ్చి చివర్లో నిలపాలి
11. నాలుగు అక్షరాల్లో ముఖ్యమైనది
12. పుణ్యక్షేత్రం ఇది—సరిగ్గా అమర్చండి
13. ముట్నప

### ఆధారములు – నిలువు

1. చదరంగంలో కనిపిస్తుంది; లెక్కల్లో కనిపిస్తుంది
2. రెండోచోట కొమ్ముండాలి; వెంటనే నార కలిపి చూసుకోవాలి. అప్పుడుగాని సంచులకు పనికిరాదు
5. తన పేరులోని మొదటి అక్షరం లాగే కూత పెట్టే పిట్ట
8. ఇది రావడానికి మధ్య ఇరవై తొమ్మిది సంవత్సరాలున్నాయి
10. తిరగవేస్తే చలిపందిరికి కఠినమైన పదం
14. 11 అడ్డంలోని ముందు అక్షరం దీని ముందు పెడితేగాని, ముందంజ కనిపించదు
15. పాలు న్యాయంగా, దీని మీద కాచాలి
16. చెట్టుకు కొమ్మ వుంటుంది; కొమ్మకేముంటుంది?
17. ముందున్న కొమ్ము తీసేసి చూడండి; ఇంచుమించు అర్థమయిపోతుంది
18. మందుకీ మానుకీ జంటపదమే
19. గాలి లేకపోతే రేగదు
20. క్రీడాకారులందరూ స్త్రీలేనా?
21. భార్యలందరూ పతివ్రతలు కాకపోవచ్చు గాని, పతివ్రత మాత్రం భార్యే.
22. ఒక పప్పులో వుంది; ఇంకొక చెట్టులో వుంది; ధరించమంటుంది
23. 22 నిలువులోని రెండవ అక్షరాన్ని చివర తగిలిస్తే, 22 (నిలువు) ఆధారాన్ని వివరుస్తుంది

## వనిత మాటల కొలువు-37
## రూ 150 లు బహుమతి

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 | | 14 | ■ | 2 | 15 | | 16 |
| | ■ | 3 | 17 | | | ■ | |
| 4 | 18 | ■ | | ■ | ■ | 5 | |
| ■ | 6 | 19 | | ■ | ■ | | ■ |
| 20 | ■ | 7 | | ■ | 8 | | |
| 9 | | ■ | ■ | 10 | | ■ | ■ |
| | ■ | 21 | ■ | 11 | | 22 | 23 |
| 12 | | | | ■ | 13 | | |

పేరు ____________________

చిరునామా ____________________

____________________

____________________

వనిత మాటల కొలువు – 37

# సూపర్ 777

## మురికికి ముప్పు, మెరుపుల తెలుపు




భారతదేశంలో లక్షలాది గృహిణులు మెచ్చిన సూపర్ 777 డిటర్జెంట్ ఉతికే బార్.

**హెచ్చు తెల్లదనము, తక్కువ ఖర్చులో**

Shilpi dm. 15 A/78 Tel

# భాషలు నేర్చుకోండి

త్వరలోనే 'వనిత' ద్వారా మీరు "సంస్కృత పాఠాలు" నేర్చుకోబోతున్నారని తెలియజేయడానికి సంతోషిస్తున్నాము. పోతే, ఈ సంచిక నుంచి, మీరు, మీకు తెలియని కొన్ని దేశీయ భాషలను నేర్చుకోడానికి కూడా చిన్న అవకాశం కల్పిస్తున్నాము. తక్కిన మూడు దక్షిణ భాషలు; మరాఠీ, గుజరాతి, ఒరియా అక్షరాలు తెలియజేస్తున్నాము. హిందీ నేర్చుకోడంలో ఇబ్బంది వుండదు గనక అది ఇవ్వడం లేదు. వీటిలో మీకు ఏ భాష నేర్చుకోవాలంటే ఆ భాష అక్షరాలను 'ప్రాక్టీస్' చెయ్యవచ్చును. లేదా అన్నీ నేర్చుకో వచ్చును. తొలి అక్షరాలతో ఈ శీర్షికను ఆరంభిస్తున్నాము.

| తెలుగు | తమిళం | కన్నడం | మలయాళం | మరాఠి | గుజరాతి | ఒరియా |
|---|---|---|---|---|---|---|
| అ | அ | ಅ | അ | अ | અ | ଅ |
| ఆ | ஆ | ಆ | ആ | आ | આ | ଆ |
| ఇ | இ | ಇ | ഇ | इ | ઇ | ଇ |
| ఈ | ஈ | ಈ | ഈ | ई | ઈ | ଈ |
| ఉ | உ | ಉ | ഉ | उ | ઉ | ଉ |
| ఊ | ஊ | ಊ | ഊ | ऊ | ઊ | ଊ |
| ఋ | – | ಋ | ഋ | ऋ | ઋ | ଋ |
| ౠ | – | ೠ | – | ॠ | – | – |
| ఎ | எ | ಎ | എ | – | – | – |
| ఏ | ஏ | ಏ | ഏ | ए | એ | ଏ |
| ఐ | ஐ | ಐ | ഐ | ऐ | ઐ | ଐ |
| ఒ | ஒ | ಒ | ഒ | – | – | – |
| ఓ | ஓ | ಓ | ഓ | ओ | ઓ | ଓ |
| ఔ | ஔ | ಔ | ഔ | औ | ઔ | ଔ |
| అం | – | ಅಂ | അം | अं | અં | ଅଂ |
| అః | ஃ | ಅಃ | അഃ | अः | અઃ | ଅଃ |




ఈ నెల 7 వ తేదీ పూరీ జగన్నాథంలో ప్రపంచ ప్రఖ్యాతి చెందిన 'రథయాత్ర' జరుగుతుంది. ఆ సందర్భంగా పూరీ క్షేత్ర విశేషాలను 'మన దేవాలయాలు' శీర్షికలో వివరిస్తున్నాము:

అనంతమైన ఆకాశంలో అంతులేని నక్షత్రాల సమూహం! తేజోమయుడైన సూర్యుడు, చల్లని కిరణాల చంద్రుడు, వివిధ గ్రహాలు, ఉప గ్రహాలు! వీటికి మధ్య ఒక చిన్న గోళం భూమి!

భూగోళంలో మూడు భాగాలు జలమయం. మిగిలిన నాలుగోవంతు నేలను చాలావరకు కొండలు, కోనలు, పర్వతాలు, అరణ్యాలు ఆక్ర మించుకున్నాయి! వీటితో పోల్చి చూసినట్టయితే— మనిషి స్థానం సూదిమొన మోపినంత మాత్రమే!

కాని ఈ స్వల్పమైన స్థానం నుంచి సువిశాల ప్రపంచపు పుట్టుపూర్వోత్తరాలు తెలుసుకోడానికి విశ్వప్రయత్నం చేస్తున్నాడు మానవుడు. ఇదే అతని ప్రత్యేకత, ప్రతిభ!

ప్రకృతి విలయతాండవానికి గడగడలాడిన ఆదిమానవుడు రోజులు జరగను, జరగను అనుభవజ్ఞానంతో ప్రకృతిలో ఒక రీతి, క్రమం వుండడం గమనించాడు! సూర్యోదయం, అస్త మయం, ఆరు ఋతువుల అందమైన పరిభ్రమణం మొదలైన వాటిని చూసి ఎంతో ఆశ్చర్యపడ్డాడు!

దీనికి ఆధారభూతంగా, సత్యమైన దివ్యశక్తి ఏదో వుందని పసికట్టాడు. ఆ దివ్యశక్తిని తెలుసుకుని అనుభూతి పొందడమే శాంతి సౌఖ్యాలకు రాజమార్గం అని తెలుసుకున్నాడు! ఆ స్థితికి చేర్చే మహత్తరమార్గాలు అన్వేషించాడు.

జీవితపు ఒడుదుడుకులు, కష్టనష్టాల నుంచి, సుఖ దుఃఖాల నుంచి బయటపడి శాంతి యుతంగా సాగడానికి, ఆధ్యాత్మిక పరిపక్వత పొందడానికి—మూడు మార్గాలు ప్రతిపాదించారు మన సనాతన ఋషులు. అందులో మొట్టమొదటిది భక్తిమార్గం!

ప్రతి ప్రాణిని దైవస్వరూపంగా భావించి, తన కర్తవ్యాన్ని దైవకార్యంగా నెరవేర్చినపుడు మనిషి శాంతి సౌఖ్యాలు పొందుతాడు. దైవ సాన్నిధ్యానికి దగ్గరి మార్గం కూడా అదే— అంటుంది ఉదాత్తమైన భక్తి యోగం!

ఆధ్యాత్మిక పరిణతి పొందిన మహాత్ములకు ప్రతి హృదయం ఒక ఆలయం! ప్రతి స్థలం ఒక దివ్యక్షేత్రం! అనుక్షణం దివ్యస్మృతితో గడప గలరు వారు. కాని అందరికీ అది సాధ్యం కాదు. అందువల్ల సామాన్య ప్రజానీకానికి సైతం దివ్య శక్తిని గుర్తు చేయడానికి ఆలయ నిర్మాణాలు జరిగాయి. వాటిని వారు తరచు దర్శించే విధంగా చేయడానికి పండుగలు పర్వదినాలు, ఉత్సవాలు వేడుకలు యేర్పాటు చేయబడ్డాయి.

హైందవులు అతి పవిత్రంగా భావించే పుణ్య క్షేత్రాలలో ప్రముఖమైనది పూరీ జగన్నాథ ఆలయం. ఒరిస్సా రాష్ట్రంలో, సముద్రతీర 'నీల పర్వత' ప్రాంతంలో వెలుగొందే ఈ పురుషోత్తమ ధామం—భారతదేశంలోని సప్త ముక్తి స్థలాలలో ఒకటి!

పూరీక్షేత్రంలోని పంచతీర్థాలను పరమ పవిత్రాలుగా, పుణ్యప్రదాలుగా భక్తులు పేర్కొం టారు. వీటిని సేవించడంలో కూడా ఒక క్రమం నిర్దేశించారు.



మొదట మార్కండేయ తటాకంలో స్నానం చేసి, పంచాక్షరీమంత్రం జపిస్తూ సమీపంలో వున్న మార్కండేయేశ్వర ఆలయంలో శివదర్శనం చేసుకోవాలి. ఆటుపైన విష్ణు స్వరూపాలుగా భావించబడే అశ్వత్థ వృక్షాలకు ప్రదక్షిణం చేసి— శ్రీకృష్ణ బలరాములను సుభద్రను దర్శించిన తర్వాత ఇంద్రద్యుమ్న తటాకంలోనూ సముద్రంలోనూ స్నానం చెయ్యాలి. ఇలా చేయడంవల్ల సంసార సాగరం తరించడానికి — పరంధాముని కరుణా కటాక్షం తోడవుతుందని భక్తుల విశ్వాసం.

ఇరవై అడుగుల ఎత్తు రాతి ప్రాకారంతో పరివేష్ఠింపబడి చతురస్రాకారంలో వున్న విశాలమైన జగన్నాథ ఆలయంలో చిన్నచిన్న దేవాలయాలు చాలా వున్నాయి. ప్రాకారానికి నాలుగు వైపులా ద్వారాలు వున్నాయి. ఆలయానికి తూర్పు దిశగా, ఇరువైపులా సింహ విగ్రహాలున్న సింహద్వారమే ప్రధాన ద్వారం।

రెండువందల అడుగుల ఎత్తుగల ఈ ఆలయ గోపురం చుట్టూ నరసింహ, వామన, వరాహ మొదలైన దేవతల విగ్రహాలు అందంగా వున్నాయి. గోపురశిఖరాగ్రంలో నీలచక్రం— దానిమీద విష్ణుధ్వజం అమర్చబడి వున్నాయి।

భోగమందిరం, సత్యమందిరం, జగన్మోహన మందిరం, గర్భగృహం—అని నాలుగు భాగాలుగా ఆలయం విభజింపబడి వుంది.

గర్భగృహంలో పదహారడుగుల పొడవు, నాలుగడుగుల ఎత్తు వున్న రాతివేదిక మీద ప్రధాన మూర్తులు ప్రతిష్ఠింపబడి వున్నాయి. దీనిని 'రత్న వేది' అంటారు. దీనికి ఉత్తర దిశగా సుదర్శన చక్రం అమర్చబడి వుంది.

నీలమేఘ వర్ణంతో ఐదడుగుల కృష్ణ విగ్రహం — శ్వేతవర్ణంతో ఆరడుగుల బలరామ విగ్రహం—వీటి మధ్య నాలుగడుగుల ఎత్తుగల సుభద్ర విగ్రహం పసుపు పచ్చని రంగుతో అలరారుతూ వుంటాయి! కంఠం వరకే ఉన్న ఈ విగ్రహాలు వేపకొయ్యతో చేయబడినవి.

మాళ్వదేశరాజైన ఇంద్రద్యుమ్నుడు గొప్ప హరిభక్తుడనీ ఆయనే విష్ణువు ఆనతిమేరకు— సముద్రంలో తేలుతూ వచ్చిన వేపకొయ్యతో మొట్టమొదట ఈ విగ్రహాలు చెక్కించి ప్రతిష్ఠించాడనీ—స్థలపురాణాలు పేర్కొంటాయి.

కొందరు బ్రాహ్మణేతరులు కూడా ఇక్కడ పూజారులుగా వుండడం—దాని ద్వారా దేవునికి జాతిమతభేదాలు లేవు అని చాటడం—ఈ ఆలయ వైశిష్ట్యం! అందుకే 'సర్వం జగన్నాథం' అంటారు. ఈ క్షేత్రాన్ని 'సర్వోత్తమ క్షేత్రం'గా బ్రహ్మపురాణం పేర్కొనడం కూడా అందువల్లనే ఏమో!

పదకొండవ శతాబ్దంలోనో, పన్నెండవ శతాబ్దంలోనో నిర్మింపబడింది అని విశ్వసింపబడే ఈ ఆలయ నిర్మాణానికి పద్నాలుగేళ్ళు పట్టిందట!

వైదికధర్మ పునరుద్ధరణలో పూరీక్షేత్రానికి సమున్నతమైన స్థానం వుంది!

ఒక వంక మితి మించిన మతోన్మాదం — మరోవంక కన్ను కానని నాస్తిక వాదం కారు చిచ్చులా ప్రబలి భరత ఖండంలో అశాంతి

# లోకజ్ఞానం

1. రేడియో మన జీవితంలో ఒక భాగమైపోయింది. అసలు రోజూ కొంత సేపయినా రేడియో వినకపోతే మనలో చాలామందికి తోచదు. మరి మన దేశంలో మొట్టమొదటి క్రమబద్ధమైన రేడియో ప్రసారం ఎక్కడ, ఏ సంవత్సరంలో ప్రారంభమయినదో చెప్పగలరా?

2. బంగ్లాదేశ్ రాజధానీ నగరం ఏది? ఆ దేశం ఏ సంవత్సరంలో స్వాతంత్ర్యాన్ని సంపాయించింది?

3. ఐక్యరాజ్యసమితిలో 'గ్రూప్ ఆఫ్ 77' అని వుంది. ఈ "గ్రూప్ ఆఫ్ 77" అంటే ఏమిటో చెప్పగలరా?

4. ఉప్పు మానవ జీవితానికి అవసరమైన ఆహార పదార్థాలలో ఒకటి. ఈ ఉప్పు మన దేశంలోని వివిధ ప్రాంతాలలో లభిస్తోంది. అయితే మన దేశంలో అతి పెద్దదయిన 'ఉప్పు సరస్సు' (సాల్ట్‌లేక్) ఎక్కడుంది? దాని పేరేమిటి?

5. ప్రపంచంలో కల్లా అతి చిన్న దేశం (విస్తీర్ణంలో) ఇటలీలో వున్న స్వాతంత్ర్య ప్రతిపత్తిగల వాటికన్. మరి, ప్రపంచంలో కల్లా అతి పెద్ద దేశం ఏది?

6. ఈ మధ్య మన రాష్ట్రంలో ముఖ్యంగా— విజయవాడలో అగ్నిప్రమాదాలు సంభవించాయి. ఆస్తి నష్టం, జన నష్టం కలిగాయి. ప్రపంచంలో అతి ఘోరమైన అగ్నిప్రమాదం ఎక్కడ ఎప్పుడు జరిగిందో చెప్పగలరా?

7. మన దేశంలో అత్యున్నత స్థానమైన అధ్యక్ష పదవిని అలంకరించిన తొలి వ్యక్తి ఎవరు? ఎన్ని సంవత్సరాలు ఆయన ఆ పదవిలో వున్నారు?

8. 'ప్రెషర్ కుకర్' తో వంట వండుకోవడం వల్ల సమయమూ కలిసి వస్తుంది. శ్రమ అట్టే వుండదు. ఐతే ఈ ప్రెషర్ కుకర్‌ను కనిపెట్టిన వారు ఎవరో చెప్పగలరా?

9. ప్రపంచంలో కల్లా అతి పెద్ద ద్వీపం గ్రీన్‌లాండ్. మరి ప్రపంచంలో కల్లా అతి పెద్ద ద్వీప సమూహం ఏది?

10. వేసవి కాలంలో మన రాష్ట్రంలోని కొన్ని ప్రాంతాలలో 124° ఫారన్‌హీట్ దాకా ఉష్ణోగ్రత వుంటుంది. ప్రపంచంలో కల్లా రికార్డయిన అత్యధిక ఉష్ణోగ్రత ఎంత? ఏ ప్రాంతంలో?

[సమాధానాలు ఈ సంచికలోనే వుంటాయి. వెతికి, మీ సమాధానాలతో సరి చూసుకోండి]

రగిలించి అల్లకల్లోలం చెలరేపిన సమయంలో— ''జగమంతా మిథ్య. బ్రహ్మమే సత్యం: జీవుడే బ్రహ్మం!'' అన్న అద్వైత సత్యామృతం అందించిన మహాత్ములు శంకర భగవత్పాదులు! సనాతన ధర్మ పునరుద్ధరణ కోసం జగద్గురు స్థాపించిన ''గోవర్ధన పీఠం'' ఇక్కడే వుంది! 'పరోపకారం కోసం దేవుడంతటివాడు, చేపగా, తాబేలుగా, పందిగా పుట్టాడు. అలాంటప్పుడు సాటి మానవులలోనే తర తమ భేదాలు పాటించడం మానవతకే తీరని కళంకం! జాతి మత భేదాలు విస్మరించి పరంధాముని సేవించడమే మానవ జాతి మనుగడకు శ్రేయోదాయకం' అని ప్రబోధించి, సర్వ మానవ సౌభ్రాతృత్వానికి ముఖ్యంగా హిందూ ముస్లిం సమైక్యతకూ పాటుపడిన భక్తకబీరు ఇక్కడ కొన్నాళ్ళు గడిపాడట! ఆయన స్మృతి చిహ్నంగా కబీరు ఆశ్రమం వున్నది.

జగమంతా కృష్ణమయం — అని భావించి, శ్రీకృష్ణ దివ్యమంగళ స్వరూపాన్ని మనసార ధ్యానిస్తూ, ఆయన గుణగణాలను నోరార కీర్తిస్తూ, ప్రకృతిలో, ప్రతి ప్రాణిలో కృష్ణ

### బేబీ నివేదిత



తిరుపతి క్యాంపస్ స్కూల్‌లో మూడవ తరగతి చదువుతున్న నివేదిత — కూచిపూడి నాట్యం ప్రదర్శించడంలో 'దిట్ట' అని విన్నప్పుడు ఎవరికైనా ఆశ్చర్యం కలుగుతుంది. ఈ అమ్మాయి నాలుగో ఏట నుంచే భగవతి కృష్ణకుమార్ దగ్గర నాట్యం నేర్చుకోవడం ఆరంభించింది. హైద్రాబాదులో జరిగిన 12వ అఖిల భారత నృత్య సంగీత పోటీల్లో పాల్గొని — ప్రథమ బహుమతి పొందింది. అదే ఆమె తొలి ప్రదర్శనం కూడా! అప్పట్నుంచి, ఆ అమ్మాయి అనేక వూళ్ళలో 50 ప్రదర్శనల వరకూ ఇచ్చింది! సంవత్సరం నుంచి సంగీతం కూడా నేర్చుకుంటోంది.

ఆ మధ్య తిరుమల వెంకటేశ్వర సదస్సులోనూ, ప్రపంచ బ్యాంక్ మేనేజర్స్ సభలోనూ—నివేదిత నాట్యం చేసింది. ఇవి రెండూ మంచి అవకాశాలు. అలాగే, తిరుపతిలోని కళాశాలల వార్షికోత్సవాల్లో కూడా ఆమె నాట్యాలు చేసి, మెప్పించింది. నివేదిత తండ్రి యస్. తిమ్మారెడ్డి వ్యవసాయ కళాశాలలో ఉపన్యాసకులుగా వుంటున్నారు.



సాక్షాత్కారం పొంది—భక్తులచే గౌరాంగ మహాప్రభువుగా కీర్తింపబడిన చైతన్యస్వామి — పూరి జగన్నాథ భక్తి ప్రచారానికి ఎంతో కృషి చేశాడట!

ఇక్కడ ప్రతి ఆషాఢమాసం శుక్లపక్షపు ద్వితీయ తిథినాడు జరిగే జగన్నాథ రథయాత్ర విశ్వ విఖ్యాతమైనది. ఏభై అడుగుల ఎత్తుగల రథంలో కృష్ణ విగ్రహం ఊరేగింపబడుతుంది. దానితోపాటు బలభద్ర, సుభద్ర విగ్రహాలను కూడా మరి రెండు రథాలలో ఊరేగిస్తారు. దేశం నలుమూలల నుంచి వచ్చిన లక్షలాది భక్తులు మాత్రమే కాకుండా — విదేశ భక్తులు కూడా ఈ రథయాత్రలో పాల్గొని—హరికీర్తనలు పాడి పరవశించి, నృత్యం చేసి తన్మయం చెందుతారు.

నేత్రపర్వంగా ఉత్సవాలు జరిపి, వీనుల విందుగా కీర్తనలు ఆలపించడం, కేవలం హృదయాహ్లాదం కల్గించడానికి మాత్రమే కాదు— సృష్టి స్థితిలయాలకు కారణ భూతమైన దివ్య శక్తిని ప్రతి ఒక్కరికి గుర్తు చేయడమే — అని విజ్ఞుల అభిప్రాయం! *



# ముఖచిత్రం: ఆశ్రమవాసిని — సీత

ముఖచిత్రం మీద కనిపిస్తున్న ఆకర్షణీయమైన తైలవర్ణ చిత్రాన్ని చూడగానే — అది ఎక్కడో చూసిన చిత్రంగానూ ప్రసిద్ధి చెందిన చిత్రంగానూ అనిపిస్తుంది. అవును — అందులో సందేహం ఏమీలేదు. అది జగత్ప్రసిద్ధి చెందిన చిత్రం కూడా.

ఆ చిత్రం 'ఆశ్రమవాసిని – సీత'. శ్రీరామచంద్రుడు, సీత, లక్ష్మణులతో తండ్రి ఆజ్ఞ ప్రకారం పద్నాలుగేళ్ళు వనవాసం చెయ్యవలసి వచ్చింది. ఆ వనవాస సమయంలో – ఒంటరిగా శిలపై కూర్చుని ప్రకృతి సౌందర్యాన్ని తిలకిస్తున్న సీత చిత్రమే–ఆ పెయింటింగ్. అలాగే, మధ్య పేజీల్లో (ఈ పేజీ ముందు పేజీల్లో) కూడా ఒక తైలవర్ణ చిత్రం కనిపిస్తున్నది. అదీ, జగత్ప్రసిద్ధమైన వర్ణ చిత్రమే – 'హంస— దమయంతి'.

విదర్భ దేశపు రాజకుమార్తె దమయంతి నిషధ దేశపు రాజయిన నలుని ప్రేమిస్తుంది. నలుడూ దమయంతిని కాంక్షిస్తాడు. అయితే, తనకు దమయంతి దగ్గర్నుంచి ఎలాంటి సందేశమూ అందలేదని, నలుడు తన హంసను రాయబారిగా, దమయంతి దగ్గరకు పంపుతాడు. నలుని సందేశం దమయంతికి అందజేసిన తర్వాత, దమయంతి కూడా, తాను చెప్పదలుచుకున్న విషయాన్ని హంసతో చెబుతుంది....ఆ ఘట్టమే ముందు పేజీల్లో వున్న చిత్రం.

ప్రపంచ ప్రసిద్ధి చెందిన ఈ తైలవర్ణ చిత్రాల రచయిత రాజా రవివర్మ. ఆ పేరు విననివారూ, పురాణ ప్రసిద్ధ వర్ణచిత్రాలను చూసినప్పుడు ఆ చిత్రం కింద వున్న రవివర్మ పేరు చూడనివారూ, వుండరు.

మనం ఆరాధించే దేవతలకూ, పురాణాల్లోని కొన్ని ప్రసిద్ధ పాత్రలకూ రూపాలు కల్పించి, వారిని సజీవులుగా చూపిన ఘనత రాజా రవివర్మది. అంతకుముందు, దేవతామూర్తులకు నిర్దిష్టమైన రూపాలు అంటూ కనిపించేవి కావు.



తన వూహాశక్తితో 'దివ్యదృష్టి'తో రవివర్మ ప్రముఖ దేవతా మూర్తులకు రూపకల్పన చేసి – "వాళ్ళు ఇలాగే వుండి వుంటారు" అన్నంతగా నమ్మించాడు! ఆనాటినుంచీ రవివర్మ చిత్రాలే ప్రామాణికాలైనాయి.

1848 ఏప్రిల్ 29న రాజారవివర్మ కేరళలోని 'కిలిమనూరు'లో జన్మించాడు. తిరువాన్కూరు రాజాకు ఒకానొక యుద్ధ సమయంలో రవివర్మ పూర్వీకులు సహాయం చేశారు. కృతజ్ఞతాసూచకంగా కిలిమనూరు గ్రామాన్ని తిరువాన్కూరు రాజు–వారికి, బహూకరించాడు.

రవివర్మ తల్లి ఉమా అంబాబాయి – గొప్ప కవయిత్రి. ఆమె సంతానం ఐదుగుర్లోనూ రవివర్మే పెద్దవాడు. రవివర్మ సంస్కృతం బాగా అధ్యయనం చేశాడు. తను చదువుతున్న గ్రంథాలలోని పాత్రలకు మనో రూపాలను కల్పించుకుంటూ, అప్పుడప్పుడు గోడలమీద సుద్ద ముక్కతోనూ, బొగ్గుతోనూ గీస్తూ వుండేవాడు. రవివర్మ మేనమామ రాజవర్మ. అతనికి చిత్రకళ మీద ఎంతో అభిమానం వుండేది. అందువల్ల రవివర్మకు అతని ప్రోత్సాహం బాగా లభించింది. ఐతే, కుటుంబంలోని తక్కిన వారెవరూ రవివర్మను ప్రోత్సహించలేదు; పైగా నిరుత్సాహపరిచారు కూడా!

తన 13వ ఏట, రవివర్మ రాజవర్మతో కలిసి త్రివేండ్రమ్ వెళ్ళి, తాను చిత్రించిన కొన్ని చిత్రాలను మహారాజుకు చూపించాడు. చిన్న వయసులోనే అలాంటి చక్కని చిత్రాలను చిత్రించిన రవివర్మను మహారాజు అభినందించాడు. అతనికి మంచి భవిష్యత్తు వుందని ఆశించాడు; తన ఆస్థానంలో ఆశ్రయం ఇచ్చాడు.

1866లో రవివర్మకు వివాహం జరిగింది. మరో రెండేళ్ళకు థియదోర్ జాన్సన్ అనే ఆంగ్ల చిత్రకారుడు తిరువాన్కూరు ఆస్థానానికి వచ్చాడు. తన కుటుంబ సభ్యుల తైలవర్ణ చిత్రాలను రచించవలసిందిగా మహారాజు జాన్సన్‌ను కోరడంతో–అతను అక్కడే వుండి వారి చిత్రాలను పెయింట్ చెయ్యడం ఆరంభించాడు. మహారాజు చేసిన సిఫార్సువల్ల, రవివర్మ–జాన్సన్ చిత్ర రచనా విధానాన్ని పరిశీలిస్తూ, దిగ్భ్రాంతి

ముఖచిత్రం : గవర్నమెంట్ మ్యూజియమ్, మద్రాసు సౌజన్యంతో   మధ్య పేజీలలోని చిత్రం : శ్రీ చిత్ర ఆర్ట్ గాలరీ అఫ్ మ్యూజియమ్ కాంప్లెక్స్, త్రివేండ్రమ్ సౌజన్యంతో

కలర్ ట్రాన్స్పరెన్సీస్ : సత్యకుమార్

చెందేవాడు. తైలవర్ణాలను ఉపయోగించడంలోని అతని ధోరణి – రవివర్మను ఎంతగానో ఆకర్షించింది. ఐతే, జాన్సన్ కోప స్వభావంగల వ్యక్తి కావడంవల్ల–రవివర్మకు అతని దగ్గర్నుంచి ఎలాంటి సలహాలూ సూచనలూ లభ్యం కాలేదు.

అప్పట్లో తిరువాన్కూరు రాజ్యంలో తైలవర్ణ చిత్రాలను వెయ్యడంలో రామస్వామినాయక్ అనే అతనికి పేరుండేది. తైలవర్ణాలను 'మిక్స్' చెయ్యడంలో తనకు తెలియని విషయాలను రవివర్మ రామస్వామినాయక్‌ను అడిగాడు. తనకంటె గొప్ప చిత్రకారుడు కాగల అర్హతలు రవివర్మకు వున్నాయన్న ఈర్ష్యతో–రామస్వామి నాయక్ రవివర్మతో ఏదీ చెప్పలేదు। దాంతో రవివర్మకు పట్టుదల పెరిగింది. తనంతట తానుగానే కృషి చేసి, తైలవర్ణ చిత్రాలు వెయ్యడంలో దిట్ట అనిపించుకున్నాడు. చిత్ర ప్రదర్శనలలో రామస్వామినాయక్ చిత్రాలు వున్నా–రవివర్మ చిత్రాలకే చాలాసార్లు బహుమతులు లభించాయి। అలాగే మహారాజు కేరళవర్మ అభిమానం, ఆదరణా కూడా అతనికి లభించాయి.

తర్వాత తర్వాత రవివర్మకు లభించిన ప్రశంసలు, పట్టాలూ, పతకాలూ, పారితోషికాలూ ఇన్నీ అన్నీ కావు. (రవివర్మ తమ్ముడు రాజారాజ వర్మ కూడా చిత్రకారుడే. అతని చిత్తరువులు కూడా కొన్ని 'మ్యూజియమ్స్'లో కనిపిస్తాయి.)

పౌరాణిక పాత్రలను రచించబోయే ముందు రవివర్మ ఎంతగానో కృషి చేశారు; ఎన్నో అవస్థలూ పడ్డారు; వాటి వస్త్రాలంకరణ మొదలైన అంశాల వివరాల కోసం ఎన్నో ప్రాంతాలు పర్యటించేవారు; ఎన్నెన్నో గ్రంథాలు చదివేవారు. ఆలా, అన్ని విధాలుగా కృషి చెయ్యబట్టే ఆయన చిత్రాలు ప్రపంచ ప్రఖ్యాతి చెంది–ప్రామాణికాలుగా నిలిచి వున్నాయి.

రవివర్మ ఎన్నో స్త్రీ మూర్తుల చిత్రాలను కూడా వివిధ భంగిమల్లో 'పెయింట్' చేశారు. ఆయన రచించిన 'నాయర్ జాతిస్త్రీ' 'తమిళస్త్రీ' మొదలైన చిత్రాలు విశేష ప్రశంసలు పొందాయి.

[ప్రసిద్ధమైన రవివర్మ వర్ణచిత్రాలను – ముందు పేజీలలో ఇచ్చినట్టుగా – చిత్రకళాభిమానులు 'ఫ్రేమ్' చేయించుకునేందుకు వీలుగా–అప్పుడప్పుడు 'వనిత'లో ఇవ్వదలచుకున్నాము. ఇవి అమూల్యమైన బహూకరణగా మేము భావిస్తున్నాము.]

# వైద్యసలహాలు



–డాక్టర్

**శ్రీమతి వి.**

నా వయసు ఇరవైమూడేళ్ళు. తొమ్మిదిమాసాల పాపాయి వుంది. ఇప్పుడు నేను నాలుగునెలల గర్భిణిగా వున్నాను. ఈ స్థితిలో పాపాయికి తల్లి పాలు పట్టవచ్చా? దయచేసి చెప్పగలరు.

**చేతిబిడ్డ వున్నప్పుడే గర్భిణి అయినారా? మీ ఆరోగ్యానికి, దేశసౌభాగ్యానికి ఇది అంత మంచిది కాదు. అయినా శిశువుకు తొమ్మిది నెలలు నిండాయంటే తల్లిపాలు పట్టడం ఆపి వేయవచ్చు. పాపాయికి – పాలు, పప్పన్నం, పళ్ళు, ఇడ్లీ తినిపించవచ్చు.**

**కుమారి ఎస్. వి.**

నా వయసు ఇరవైయేళ్ళు. అవివాహితను. గత సంవత్సరం రక్తం పాలిపోవడం వల్ల పాండు రోగం యేర్పడింది. డాక్టర్ సలహా మేరకు మందులు, మాత్రలు పదిహేను ఇంజక్షన్లు తీసుకున్నాను. నయమైంది. కాని యిప్పుడు మళ్ళీ ఆ వ్యాధి వచ్చే సూచనలు కనబడుతూ వున్నాయి. ఇకపోతే ఋతుకాలంలో ఎక్కువ రక్తస్రావం అవుతున్నది. దీనికీ, ఈ జబ్బుకు సంబంధం వుంటుందంటారా? అలాంటప్పుడు ఆ జబ్బు రాకుండా వుండడానికి ఎలాంటి జాగ్రత్తలు తీసుకోవాలో చెప్పండి.

**రక్తస్రావం అధికంగా జరగడం కూడా రక్తం పాలిపోడానికి కారణం కావచ్చు. ప్రేవుల్లో పురుగులు వుంటే కూడా ఈ వ్యాధి వస్తుంది. కాబట్టి వైద్య పరిశోధనలు చేసిన తర్వాత సరియైన చికిత్స పొందాలి. మంచి బలవర్ధకమైన ఆహారం తీసుకోవాలి.**

**శ్రీమతి ఎస్. పి. ఆర్.**

నా వయసు ఇరవైఆరు సంవత్సరాలు. రెండు సార్లు గర్భధారణ జరిగినా, ఆపైన రెండు మూడు నెలలలోపలే గర్భస్రావం అయిపోయింది. గర్భస్రావం జరగకుండా వుండడానికి ఏవైనా మందులున్నాయా? ఏవో ఇంజెక్షన్లు కూడా ఉన్నాయని మా మిత్రులు చెబుతున్నారు. నిజమేనా?

**గర్భస్రావానికి ఎన్నో కారణాలు వున్నాయి. దీనికి మొదట గర్భాశయం పరిశోధించి చూడాలి. హార్మోనులు తక్కువగా స్రవించేపక్షంలో-మందుల ద్వారా, ఇంజెక్షన్ల ద్వారా దానిని ఎక్కువ చేయడానికి అవకాశం వుంది. కడుపులోని శిశువు ఆరోగ్యానికి పెరుగుదలకు ఇది దోహదం చేస్తుంది. రక్తంలోని లోపాలవల్ల కూడా కొన్ని సందర్భాలలో గర్భస్రావం జరుగుతుంది. అందువల్ల వైద్య పరిశోధనచేసి చూసిన తర్వాతనే సరియైన చికిత్స చేయడానికి సాధ్యమవుతుంది.**

**శ్రీమతి ఆర్. టి.**

నాకు వివాహమై మూడేళ్ళు కాబోతూ వుంది. కాని ఇంకా పిల్లలు కలుగలేదు. ఒక లేడీడాక్టర్‌ను సంప్రదిస్తే – డి అండ్ సి చేసుకోమని చెప్పారు. డి అండ్ సి చేసుకోడానికి నాకేమో భయంగా వుంది. డి అండ్ సి చేసుకోకుండా మాత్రలు వాడితే పిల్లలు కలిగే అవకాశం వుందా?

**మాత్రలు వాడినంతమాత్రాన పిల్లలు కలుగుతారని నిశ్చయంగా చెప్పలేము. శరీరం ఆరోగ్యవంతంగా కనబడినప్పటికీ – గర్భాశయంలో ఏవైనా లోపాలు ఉన్నాయా అని చూడాలి. పైగా డి అండ్ సి ఒక సాధారణమైన చికిత్స! దీనికి ఎలాంటి భయమూ, సంశయమూ చెందవలసిన అవసరం లేదు. అసలు డి అండ్ సి ద్వారా గర్భాశయం ఆరోగ్యస్థితి ఎలా వుందో కూడా తెలుసుకోడానికి వీలవుతుంది. అందువల్ల డాక్టర్ సలహామేరకు ఆ చికిత్స చేయించుకోడం చాలా అవసరం!**

**కుమారి కె. ఇ.**

నా వయసు పదహారేళ్ళు. ముఖంలో విపరీతంగా మొటిమలున్నాయి. ఎన్నో మందులు వాడాను. కాని మొటిమలు రోజు రోజుకు ఎక్కువవుతున్నాయే కాని తగ్గినట్టు లేదు. వీటిని తగ్గించడానికి ఏదైనా మార్గం చెప్పండి.

**ముఖంలో జిడ్డు, మావె చేరకుండా శుభ్రంగా పెసరపిండిని ఉపయోగించి ముఖం కడుక్కోవాలి. ఆహారంలో క్రొవ్వులు తగ్గించడం – మలబద్ధం లేకుండా చూసుకోడం వల్ల మొటిమలను తగ్గించవచ్చు!**

# జాతీయబహుమతి పొందిన ఉత్తమ గాయని



చక్కటి డిజైనుగల సాదా నూలుచీర, తెల్ల జాకెట్టు ధరించి, గుండ్రటి పెద్ద బొట్టే అలంకారంగా ఎంతో సామాన్యంగా కనిపించారు ప్రసిద్ధ గాయని జానకి. ఆమెను చూసి ఇంత సింపుల్‌గా వున్నారేమిటి ఈవిడ అని ఒక్క క్షణం ఆశ్చర్యపోయాను. నేను 'వనిత' తరపున వచ్చానని తెలియగానే నవ్వుతూ పలకరించారు జానకీ, ఆమె భర్త రామప్రసాద్‌గారూ.

ఆమెకు జాతీయ బహుమతి లభించిన సందర్భంగా – 'వనిత' తరపున, పాఠకుల తరపున ఆమెను అభినందించాలని అనుకుంటూ వుండగా ఎవరో చిత్ర పరిశ్రమకు చెందిన వారు వచ్చారు. వారి వెనుక సంగీత దర్శకులు సాలూరి హనుమంతరావుగారు కూడా వచ్చారు. మర్నాడు వారి కన్నడ చిత్రానికి జానకిగారు పాడాలిట. రిహార్సల్స్ కోసం వచ్చారు. "పదిహేను నిముషాలు. అంతకు మించి అవదు" అన్నారు రామప్రసాద్‌గారు. సరే. రిహార్సల్స్ చూసినట్టూ వుంటుంది అనీ నేను సంతోషంతో కూచున్నాను. ఆ బృందంలో ఒకరు ఒక శాస్త్రీయగీతాన్ని ఆమెకు పాడి వినిపించారు. జానకిగారు టేప్ చేసుకుంటూనే ఆ గీతాన్ని యిట్టే అందుకున్నారు. అన్నట్లుగానే పదిహేను నిముషాలలో ఆ 'మిని – రిహార్సల్స్' అయిపోయింది. ఆమె కంఠంలోని మాధుర్యం స్వయంగా వినే అవకాశం నాకు కలిగినందుకు ఉప్పొంగిపోయాను.

''మీరు చిత్ర పరిశ్రమలోకి ప్రవేశించి ఎన్నేళ్ళయిందండీ?'' అని అడిగాను మొదటి ప్రశ్నగా.

''ఏప్రిల్ 1957 లో మొదటి పాట పాడాను ఒక తమిళ చిత్రంలో. తెలుగులో నేను పాడిన మొదటి పాట- పెండ్యాలగారి సంగీత దర్శకత్వంలో 'ఎం. ఎల్. ఎ' చిత్రంలోని 'నీయాశ, అడియాస' అనే పాట. అప్పటి నుంచి అన్ని రకాల పాటలూ పాడుతూనే వున్నాను. ఇరవై ఏళ్ళలో–పద్నాలుగు భాషలలో – దాదాపు ఐదారు వేల పాటలు పాడివుంటాను. ఏది యిష్టమని ప్రశ్నిస్తే మటుకు సమాధానం చెప్పలేను. పాడుతున్నప్పుడు ప్రతి పాటా యిష్టమనే అనిపిస్తుందికదా'' అన్నారు.

''ఇరవైఏళ్ళుగా మీరు మీ కంఠాన్ని ఇంత



చక్కగా ఎలా కాపాడుకోగలుగుతున్నారు?'' అని కుతూహలంగా ప్రశ్నించాను.

''నా కంఠం దేవుడిచ్చిన వరంగానే భావిస్తాను. ప్రత్యేకించి జాగ్రత్తలేమీ తీసుకోను. ఐస్‌వాటర్‌గానీ, చల్లని పానీయాలుగానీ తాగను. అంతే. అవే నేను తీసుకునే జాగ్రత్తలు'' అన్నారు జానకి చిన్నగా నవ్వేసి.

''మీకు అభిమానులున్నట్లే మీకూ అభిమాన గాయకులంటూ వుంటారుకదండీ. వారెవరో చెప్తారా?'' అనడిగాను. తికమకగా ప్రశ్నించానా, అని నేనే కంగారుపడ్డాను. కాని జానకిగారు చటుక్కున జవాబిచ్చేశారు.

''నా అభిమాన గాయని లతామంగేష్కర్. నిజానికి ఆవిడ పాటలు వినే నేను ఉత్తేజితురాలినయ్యాను. చిన్నప్పటి నుంచి కూడా నాకు లతా పాటలంటే తగని యిష్టం. ఆ పాటలు గ్రామఫోన్‌లో, రేడియోలో వింటూ అభ్యాసం చేస్తూ వుండేదాన్ని. మా అమ్మ నన్ను బాగా చదివించాలని అనుకున్నారు. కాని, సినిమా పాటల మీద నాకుగల వ్యామోహం చూసి సంగీతం నేర్పిద్దామనుకున్నారు మా అమ్మ. ఒక సంవత్సరం పాటు సంగీతం నేర్చుకుని ఆ తరువాత విసుగెత్తి మానేశాను. చదువు మీద శ్రద్ధ చూపనందుకు ఒకసారి మా అమ్మ నాకు వాత కూడా పెట్టారు....''అన్నారు నవ్వుతూ జానకి.

జానకి చిత్రసీమలోకి విచిత్రమైన పరిస్థితులలో ప్రవేశించారు. ప్రఖ్యాత మోనో–ఏక్టర్ చంద్రశేఖరంగారి కోడలు ఆమె. అప్పట్లో ఎ. వి. ఎమ్. వారు నూతన గాయని కోసం వెదుకుతున్నారు. చంద్రశేఖరంగారు జానకి బాగా పాడగలదని చెప్పడం–ఎ. వి. ఎమ్. అధినేతలకి ఆమె గాత్రం నచ్చడం చకచకా జరిగిపోయాయి.

ఆనాటి నుంచి ఆమె భారతదేశంలోని యావద్భాషలలోనే కాక, సింహళ భాషలో కూడా పాటలు పాడారు. నాలుగేళ్ళక్రితం వచ్చిన విజయదశమినాడు, ఉదయం ఎనిమిది గంటల నుంచి రాత్రి పదకొండు దాకా ఆమె ఆరు పాటలు రికార్డు చేశారు. విశేషమేమంటే అవి వివిధ భాషా చిత్రాలకు చెందిన గీతాలు కావడం!

'పదునారు వయదినిలె ('పదహారేళ్ళ వయస్సు') తమిళ చిత్రంలో పాడిన 'సెందూర పూవే' అన్న పాటకు ఆమెకు ప్రప్రథమంగా జాతీయ స్థాయిలో బహుమతి లభించింది. ఆ పాట రాసిన గంగై అమరన్‌కూ అదే తొలి అనుభవం:

''ఇంతటి అనుభవం సంపాయించారు కదా.... స్వయంగా మీరే ఎందుకు ఒక చిత్రానికి సంగీత దర్శకత్వం వహించకూడదు?''

''ఊహూ(....ఇప్పట్లో ఆ ఆలోచన లేదు. అలా చేస్తే గాయకురాలిగా ఏకాగ్రత దెబ్బతినే ప్రమాదం వుందనిపిస్తుంది నాకు. ఐతే, షిర్డీ సాయి బాబా మీద స్వయంగా రాసి పాడాను. ఆ పాటలకు స్వరకల్పన చేసింది కూడా నేనే. అవి, మరికొన్ని హిందీ భజన్స్ నా సంగీత దర్శకత్వంలో ప్రైవేట్ రికార్డులుగా వెలువడ్డాయి.''

''చాలామంది గాయకులు విదేశాలలో కచ్చేరీలు యివ్వడానికి వెళుతూ వుంటారుకదా.... మరి.మీరు యింతవరకు వెళ్ళలేదేమిటి? అందుకు ప్రత్యేకించి కారణం ఏదైనా వుందా?''

''విదేశాలలో కచ్చేరీలు చేయడానికి నాకు ఎన్నో అవకాశాలు వచ్చాయి. కాని నాకెందుకో అంత ఉత్సాహం కలగలేదు. ఎప్పుడైనా వెళ్ళాలనే వుంది. కచ్చేరీలకోసం వెళితే బాధ్యత ఎక్కువగావుంటుంది–అలాకాక విలాస యాత్రగా వెళితే స్వేచ్ఛగా అన్ని ప్రదేశాలు చూడడానికి అవకాశం వుంటుంది గదా అనిపిస్తుంది నాకు.''

''అన్నట్లు మీరు మన ఊళ్ళల్లో కూడా కచ్చేరీలు ఎక్కువగా చేయరెందుకు?''

''అందుకు ప్రత్యేకించి మరో కారణమంటూ ఏదీ లేదు. ఇక్కడ రికార్డింగులకు వాయిస్ కండిషన్‌లో వుండడం ముఖ్యం. కచ్చేరీల కని ఒక ఊరు నుంచి మరో ఊరుకి తిరుగుతూ వుండటం శ్రమతోకూడినపని. పైగా వాతావరణం, నీటి మార్పు వీటికి తోడవుతాయి. అదీకాక ఈ చిత్ర పరిశ్రమలోనిదంతా అర్జంటు వ్యవహారం. హఠాత్తుగా ఇవాళ రికార్డింగు వుంది రమ్మనమని కబురొస్తుంది. అటువంటి అవకాశాలు తరచు కచ్చేరీలు చేస్తూవుంటే కోల్పోవలసి రావచ్చు. అంతెందుకు—ఈ జాతీయ బహుమతి పొందిన పాట నేను పాడగలిగే దాన్ని కానేమో! ఏమయినా చిత్రాలలో పాడితేనేకదా బయట పేరు వచ్చేది'' అన్నారు నవ్వుతూ.

చలన చిత్ర జీవితంలో గాయకురాలిగా ఆమెకు సంభవించిన మధురమైన సంఘటన—బొంబాయిలో లతామంగేష్కర్‌ని కలుసుకోవడం 'కొంజుమ్ సిలంగై' చిత్రంలోని 'సింగారవేలనె' పాట రికార్డు లత విని అంత చక్కగా పాడినందుకు ఆమెను అభినందించడం.

అప్పుడే ఆమె పాటకు నాదస్వరం వాయించిన ప్రముఖ నాదస్వర విద్వాంసుడు కారైకుడి అరుణాచలంను షణ్ముఖానంద హాల్‌లో జరిగిన ఒక ఉత్సవంలో ఆమె కలుసుకున్నారు. విచిత్ర మేమంటే అప్పటికి ఆ చిత్రం విడుదలై ఐదు సంవత్సరాలైంది. కాని వారిద్దరూ కలుసుకోవడం అదే మొదటిసారి! అందుకు కారణం ఆమె పాడిన పాట, నాదస్వరం – రెండూ విడివిడిగా రికార్డు చేసి ఆ తరువాత వాటిని కలపడం జరిగింది.

ఒక కన్నడ చిత్రానికి బిస్మిల్లాఖాన్ షెహనాయ్ వాయిస్తూంటే ఆమె పాడడమూ, ఎం. ఎస్. గోపాలకృష్ణన్ వయొలిన్‌కి, నామగిరి పేట్టై కృష్ణన్ నాదస్వరానికి, లయగా మలయాళ చిత్రంలో పాడడమూ ఆమె జీవితంలో మరువలేని సంఘటనలు.

మేము కూర్చున్న గదిలో గోడలమీద కొన్ని వర్ణచిత్రాలు పటం కట్టివున్నాయి. అందులో జానకి తలిదండ్రుల పటం కూడా వుంది, వాటి వైపు చూస్తూ వుండే రామప్రసాద్‌గారు ''అవి వర్ణ చిత్రాలనుకుంటున్నారా····కాదు. నలుపు–తెలుపు ఫొటోలకి మా శ్రీమతి వేసిన రంగులు'' అన్నారు.

**జానకి వేసిన కృష్ణుడి చిత్రం**



నేను నిజంగానే ఆశ్చర్యపోయాను. అవి నిజంగా వర్ణచిత్రాలలాగే వున్నాయి.

''తీరిక లభించినప్పుడల్లా యిలా ఫొటోలకి రంగులు వేయడం, బొమ్మలు గీస్తూ వుండడం నా హాబీ'' అన్నారు జానకి.

''మీరు చిత్రలేఖనం కూడా నేర్చుకున్నారా?''

''లేదు. చిన్నప్పటి నుంచి నాకు ఏవో బొమ్మలు గీస్తూ వుండడం అలవాటు. కాని గాయకురాలు కావాలన్న తపన నాలోని చిత్రకారిణిని వెనకకు నెట్టింది. అంతే'' అన్నారు.

''మీరు వేసిన చిత్రం ఒకటి ఏదైనా ఇస్తారా? మా పాఠకులకి చూపుతాను'' అని అడగగానే కృష్ణుడి చిత్రం యిచ్చారు.

''మీకు కృష్ణుడంటే యిష్టమా?'' అని అడిగాను.

''అవును. కృష్ణుడు నా ఆరాధ్య దైవం. అందుకే మా అబ్బాయికి మురళీకృష్ణ అని పేరు పెట్టుకున్నాము'' అన్నారు.

వారికి అతనొక్కడే సంతానం. మురళీకృష్ణ పి. యు. సి. పరీక్ష రాశాడు. గిటార్ వాయిస్తాడు. అతన్ని పైచదువులు చదివించాలన్న ఆశయాన్ని వ్యక్తం చేశారు జానకి.

''మీకు తీరిక లభించినప్పుడల్లా యింకా ఏమేం చేస్తూ వుంటారు?''

''నా జాకెట్లు నేనే కుట్టుకుంటాను. ఇంత వరకూ ఎన్నడూ టైలర్‌కి ఇవ్వలేదు! అట్లాగే నా చీరలు కూడా నేనే ఉతుక్కుంటాను. ఇదివరకు షటిల్ బాడ్మింటన్ ఆడేదాన్ని. ఇప్పుడు కుదరడం లేదు. ఇంకా తీరిక లభిస్తే హాయిగా నిద్రపోతాను. నేను ఆహారం లేకుండా వుండగలను, పాడగలను. కాని నిద్ర లేకపోతే మాత్రం అసలు పాడలేను'' అన్నారు నవ్వుతూ.

''సాధారణంగా స్త్రీలకి పట్టు చీరలంటే ఎంతో యిష్టం. కాని, నాకు వాటిమీద మోజు అసలు లేదు. అట్లాగే నగలు కూడా. దైవభక్తి మాత్రం నాకు ఎక్కువే అని చెప్పాలి'' అన్నారామె.

దక్షిణదేశంలోని ముఖ్యమైన పుణ్యక్షేత్రాలన్నీ ఆమె దర్శించారు. ఆమె కలకత్తా చుట్టుపక్కలగల క్షేత్రాలు చూశారు. కాని ఉత్తర భారతదేశంలోని పుణ్యక్షేత్రాలు చూడడం పడలేదుట. ''ఈ అవార్డు పుణ్యమా అని మొన్న వెళ్ళినప్పుడు వాటిలో

కొన్నయినా చూడగలిగాము '' అన్నారు.

అవార్డులనగానే '' ఆనాటి ఉత్సవం ఎలా జరిగిందండీ '' అని అడిగాను.

'' చాలా బాగా జరిగింది. బహుమతి ప్రదానం తరువాత మమ్మల్ని పాటలు పాడమని కోరారు. నేను ఐదు పాటలు పాడాను '' అన్నారు.

తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ, హిందీ భాషలలో ఆమె ఆ పాటలు పాడారు. ఇంత వరకూ జరిగిన ఆ ఉత్సవాల్లో ఇన్ని భాషలలో ఎవరూ పాడలేదుట !

'' ఆ సాయంత్రం ఢిల్లీలోని మలయాళ సంఘాలు మూడు మాకు సన్మానాలు చేశాయి. ఆ కార్యక్రమాలు అయ్యేసరికి అర్ధరాత్రయింది. మర్నాడు ఉదయం హరిద్వార్‌కి ప్రయాణ మయ్యాము. అక్కడ గంగలో స్నానం చేశాము. ఎండలు మండిపోతున్నా గంగానది చల్లగా వుంది. అక్కడ గొలుసులు కట్టి వుంటాయి. వాటిని పట్టుకుని స్నానం చెయ్యాలి. లేకపోతే ఆ ప్రవాహానికి కొట్టుకుపోయే ప్రమాదముంది. మూడు గంటలసేపు అక్కడవున్నా యింకా ఉండాలని పించింది. నేను పెన్న, కృష్ణ, గోదావరి, కావేరీ, తుంగభద్ర నదులలోనూ, సముద్రంలోనూ స్నానాలు చేశాను. కాని గంగలో స్నానం చేసిన తృప్తి అంతకుముందు ఎన్నడూ కలగలేదు.

అక్కడి నుంచి ఋషికేష్ వెళ్ళాము. దారిలో లక్ష్మణఝూలా చూశాము. ఋషికేష్‌లో గీతాభవన్ చూశాము. ఆ సాయంత్రం హరిద్వార్‌కి తిరిగి వచ్చాము. హరిద్వార్‌లో అయ్యప్ప గుడి కట్టారు. అక్కడే వసతిగదులు వున్నాయి. మేము అందులోనే బసచేశాము. హరిద్వార్‌లో రోజూ సాయంత్రం, నది ఒడ్డున గంగాహారతి యిస్తారు. చూడచక్కని దృశ్యం అది.

యాత్రికులు కూడా దొన్నెలలో పువ్వులు పెట్టి వాటి మధ్య ప్రమిదలు వుంచి నదిలో వదులుతారు. మేమూ ఆ విధంగానే చేశాము. ప్రవాహంలో వేగంగా కొట్టుకుపోతున్న వందలాది జ్యోతులు – నీటిలో వాటి ప్రతిబింబాలు — చూడ ముచ్చటగా వున్నాయి. ఆ దృశ్యం తలచుకుంటే యిప్పటికీ నాకు తన్మయంగానే వుంటుంది. '' జయజగదీశహరే.... '' అనే పాట రికార్డులు, పాటల హోరు మనల్ని మరో ప్రపంచంలోకి తీసుకువెళతాయి. తెల్లవారు ఝామున మరో రెండు గంటలసేపు గంగలో స్నానం చేశాను. అయినా జలుబుగానీ, పడిశంగానీ రాలేదు. గంగమ్మతల్లి మహిమ అంటారు చూడండి–అంటే అదేనేమో!'' అన్నారు జానకి.

'' మరి అంతదూరం వెళ్ళారు కదా....మీ అరాధ్యదైవం కృష్ణుడి జన్మస్థలి చూశారా ? ''

'' లేదండి. మధురకు వెళదామనే అనుకున్నాం. కాని అప్పటికే ఆలస్యమయిపోయింది. మళ్ళీ ఒకటో తారీఖు మద్రాసులో రికార్డింగు వుండడంతో వెంటనే వచ్చేయవలసి వచ్చింది. మరోసారి మధురకు తప్పకుండా వెళతాము. హడావిడిగా మాత్రం కాదు '' అన్నారు జానకి మధుర చూడలేకపోయినందుకు చింతిస్తూ.

రికార్డింగ్ అనగానే నాకు మర్నాడు ఆవిడకి గల రికార్డింగ్ జ్ఞాపకం వచ్చింది. అందుకనే సెలవు తీసుకుంటూ ' వనిత ' తరపున, పాఠకుల తరపున ఆమెకు అభినందనలు తెలియజేశాను.

తన ధన్యవాదాలు తెలుపుతూ '' ఏ కళకయినా అభిమానులే ఆయువుపట్టు. వారుంటేనే ఏ కళయినా రాణిస్తుంది '' అని మరోసారి ' వనిత 'కు, పాఠకులకు తన కృతజ్ఞతలూ, అభినందనలూ తెలియజేశారు ఆమె.

—పూర్ణిమ

**[ లోకజ్ఞానం – సమాధానాలు ]**

1. బొంబాయిలో. 1927 వ సంవత్సరంలో జూలై 23న క్రమబద్ధమైన తొలి ప్రసారం ప్రారంభమయింది. అప్పట్లో ఆ ప్రసార కేంద్రానికి ' ఇండియా బ్రాడ్ కాస్టింగ్ కంపెనీ ' అని పేరు.

2. ఢక్కా. 1971 వ సంవత్సరం డిసెంబర్ 17 న బంగ్లాదేశ్ స్వాతంత్ర్యాన్ని సముపార్జించింది.

3. ఐక్యరాజ్యసమితిలోని అలీన దేశాల కూటమికే ' గ్రూప్ ఆఫ్ 77 ' అని పేరు. అలీన దేశాలన్నీ విడిగా ఒక కూటమిగా ఏర్పడ్డాయి. అప్పట్లో అందులో 77 అలీన దేశాలు సభ్యులుగా వుండేవి. అందుకే దీనికా పేరు వచ్చింది. ప్రస్తుతం నూరుకు పైగా దేశాలు ఇందులో సభ్యులుగా వున్నా ఈ నాటికీ అది ' గ్రూప్ ఆఫ్ 77 ' గానే వ్యవహరింపబడుతోంది.

4. రాజస్థాన్‌లోని సాంభార్ లేక్

5. సోవియట్ రష్యా. (దీనినే యూనియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్ అని అంటారు). రోమ్ సమీపంలోని పోప్ నివాస స్థలమైన వాటికన్ నగర వైశాల్యం 108. 7 ఎకరాలయితే రష్యా విస్తీర్ణం 86, 49, 550 చదరపు మైళ్ళు.

6. 1666 లో లండన్ నగరంలో జరిగింది ఈ అగ్ని ప్రమాదం. దీనినే ' ది గ్రేట్ ఫైర్ ఆఫ్ లండన్ ' అని అంటారు. సెప్టెంబరు 2 నుంచి సెప్టెంబరు 6 వ తేదీ వరకు ఏక ధాటిగా అయిదు రోజులపాటు ఈ అగ్ని ప్రమాదం సంభవించింది. ఈ అగ్ని ప్రమాదంలో ఎన్నో ప్రఖ్యాత భవనాలు, 89 చర్చిలు, 13, 200 ఇళ్ళు కాలిపోయాయి. రెండు లక్షలమందికి పైగా నిరాశ్రయులయ్యారు. వేలాదిమంది చనిపోయి వుంటారని భావింపబడుతోంది. కాని వారి సంఖ్య యితమిత్థంగా తేలలేదు.

7. బాబూ రాజేంద్రప్రసాద్. జనవరి 26, 1950 న అధ్యక్షపదవిని అలంకరించిన రాజేంద్రప్రసాద్ పన్నెండేళ్ళపాటు ఆ పదవిలో–అంటే 1962 దాకా–వున్నారు.

8. ఫ్రాన్స్‌కు చెందిన డెనిస్‌పాపిన్. ఇంగ్లండు దేశస్థుడైన రాబర్ట్‌బాయిల్ 1679లో ప్రెషర్ కుకర్‌ను కనుగొన్నారు.

9. ఇండోనీషియా. గ్రీన్‌లాండ్ వైశాల్యం 8,40,000 చదరపు మైళ్ళు అయితే ఇండోనీషియా 3,000 కి పైగా గల ద్వీపాల సమూహం.

10. అల్ అజీజియా. లిబియా దేశంలోని ఈ నగరంలో 1922 సంవత్సరంలో రికార్డయిన ఉష్ణోగ్రత 136° ఫారన్‌హీట్.

## 'తళతళలాడే' తెలుపు కోసం




## సుప్రీమ్ డెట్ డిటర్జెంట్ ఉతికే బిళ్ల

కొత్తగా మెరుగు పర్చబడిన డెట్ బిళ్ళ, బజార్లో దొరికే డిటర్జెంట్ ఉతికే బిళ్ళల కంటే ఎంతో మేలైనది.

మరికిని వదిల్చే శక్తికీ, నురుగు నివ్వడంలోనూ, సువాసనలు చిందించడంలోనూ దీనికి మరేదీ సాటికాలేదు.

వాడి చూడండి! తేడా ఏమిటో మీరే తెలుసుకోండి! నిజమే, సుప్రీమ్ డెట్ బిళ్ళే 'తళతళలాడే' తెలుపు యిచ్చేది!

**దివ్యమైన తెలుపు,**
**డెట్ యొక్క తెలుపు**

Shilpi-DM 7A/76 Tel



# బామ్మగారి పేజీ

'పెళ్ళి చేసి చూడు, ఇల్లు కట్టి చూడు' అన్నారు పెద్దలు. అంటే ఆ రెండూ అంత బాధ్యతా యుతమైనవీ; కష్టమైనవీ అని! పోయినసారి, నేను ఇల్లు కట్టడానికి కావలసిన స్థలం గురించి— అంటే అది ఎలా వుండాలి? దాన్ని ఎలా చూడాలి? — అని చెప్పానుగదర్రా. దానికి సంబంధించినవే మరికొన్ని విషయాలు కూడా చెబుతాను. అదే, మళ్ళీ ఎప్పుడైనా ఇంకోసారి చెబుతాను అన్నాననుకోండి. ఎప్పుడో చెప్పడం కంటే, ఇప్పుడే చెప్పి ఆ విషయం ముగించేస్తే బావుంటుందిగదా అనిపించింది. అందుకేనన్న మాట....

ఇల్లు కట్టడానికి ఎన్నిక చేసుకునే స్థలం వుంది చూశారూ—అది సమచతురస్రంగానైనా వుండాలి; లేదా దీర్ఘ చతురస్రంగానైనా వుండాలి. బొమ్మలు చూడండి.



స్థలాలు ఇలా వుంటే, ఇళ్లు కట్టుకోడానికి చాలా అనుకూలమైనవనీ, ప్రశస్తమైనవనీ శాస్త్రజ్ఞులు చెప్పారు. గుండ్రంగా, వృత్తాకారంలో వున్నా కూడా పర్వాలేదుట. అంటే ఇలా.



కాని, అలాగా ఇలాగా కాకుండా అడ్డదిడ్డమైన ఆకారాల్లో వుంటాయి చూడండి — ఇదిగో ఇలా—



ఇవి మాత్రం గృహనిర్మాణానికి పనికి రావు అన్నారు.

సామాన్యంగా ఇళ్లు సమచతుష్కోణాకారంలో వుంటాయిగనక, అలాంటి ఆకారంలో వుండే స్థలాన్ని ఎన్నుకోడం శ్రేయస్కరం — అన్నారు. ఇంట్లో ప్రవేశించడానికి ద్వారం వుంటుంది చూడండి —— ముఖద్వారం—అది తూర్పు వేపుగా వుండడం మంచిదన్నారు. ఎందుకో తెలుసా? పొద్దున్న వచ్చే ఎండ మంచిది గనక, అది ఇంట్లో వున్న సూక్ష్మజీవులను నాశనం చేస్తుంది గనక! ఆ ఎండ తిన్నగా ఇంట్లో వచ్చి పడడం, ఆరోగ్యకరం. తూర్పు, ఉత్తర దిశల మధ్య—అంటే ఈశాన్యం వేపు ముఖద్వారం వున్నా కూడా మంచిదే. పరిశుద్ధతనీ, ఆరోగ్యాన్నీ దృష్టిలో వుంచుకునే ఈ నిర్ణయాలు చేసినట్టుగా అనిపిస్తుంది.

ముఖద్వారం పశ్చిమదక్షిణాలుగా వుందనుకోండి. పగలు పన్నెండు దాటిన దగ్గర్నుంచీ ఎండంతా ఇంట్లోనే వుంటుంది. అదే, ఎండాకాలం అయితే చెప్పాలా! మరీ బాధ! అలా వున్నప్పుడు పడమటివేపు, దక్షిణం వేపు ఎత్తయిన గోడలో, పొడుగాటి చెట్లో, గుట్టలో వుండాలి. ఉంటే పర్వాలేదు.

ఇళ్లల్లో ఎలాంటి చెట్లు వుంటే మంచిది?— అన్న విషయం మీద పోయినసారి కొంత చెప్పానుగదర్రా — అలాగే, ఇళ్లల్లో కొబ్బరిచెట్లు, మామిడిచెట్లు, వేపచెట్లు—వుండవచ్చును. వేపచెట్టు వుండడం చాలా మంచిది. కొందరు మరీ పురాతన కాలం మాటలు చెబుతూ వుంటారు. 'వేసినప్పుడు వేపచెట్టు—తీసినప్పుడు అమ్మవారు' అని, వేపచెట్టు ఇంట్లో వుండకూడదంటారు. నాకు తెలిసి, అదేం కాదు. వేపచెట్టు వుండడం మంచిది. శాస్త్రాల్లో వేపచెట్టు వుండడం మంచిదే అని రాశారు. వేపచెట్టుగాలి, ఆరోగ్యకరమైనది. మన ఊళ్ళో అమ్మవారు, మశూచి వున్నప్పుడు వేపమండలు గుమ్మానికి తోరణంలా ఎందుకు కడతామనుకున్నారు మరీ? ఆ రోజుల్లోనైనా, ఆ గాలి ఇంట్లోకి వస్తుందనీ, దానివల్ల రోగవ్యాప్తి జరగదనీ! పళ్ళు తోముకోడానికి వేపపుల్ల చాలా శ్రేష్ఠమైనది. బాలింతరాళ్ళకు స్నానాలు చేయించేటప్పుడు, సలసలకాగే నీళ్ళలో వేపాకులు వేస్తారు తెలుసా? ఎందుకనుకున్నారు మరి? — ఆరోగ్యరక్షణకీ; అంటువ్యాధులు రాకుండా చెయ్యడానికీనూ! ఐతే ఈ చెట్లు నైరుతి, దక్షిణం, పడమర దిక్కుల వేపు వుండడం మంచిది. అలాయితే, ప్రతి రోజూ మధ్యాన్నం పన్నెండు తర్వాత చల్లగా నీడగా హాయిగా వుంటుంది.

ఆ మధ్య ఒకసారి తులసిమొక్క గురించి, దాని ఉపయోగాల గురించీ, చెప్పాను చూడండి. ఆ తులసిమొక్క విధిగా ఇంట్లో వేస్తాం. చాలా మంది పెరట్లో తులసికోట కడతారు. తులసి వెయ్యడంలో దేవతాభావం వున్నా—అది దివ్యమైన ఔషధం. ఇళ్లలో తులసి ఎక్కువగా వుందనుకోండి—తేళ్ళు, పాములు, కనీసం జెర్రులు కూడా రావు. తులసికి ఆశక్తి వుండడం చేతనే, కనీసం ఒక మొక్కనైనా విధిగా పెంచాలన్న ఉద్దేశంతోనే — పెరట్లో తులసికోట వుండాలన్నది ఆచారంగా వచ్చింది. మరి, తులసి చేసే మంచి గుణాలూ అవీ ఇదివరలోనే చెప్పేశాను. ఐతే ఒకటుంది— ఉదయం స్నానం చేసిన వెంటనే, పరగడుపున ఐదారు తులసి ఆకులు రోజూ — నమిలిమింగడం చాలా ఆరోగ్యకరం. అది ప్రేగుల్ని శుభ్ర పరుస్తుంది. శరీరంలోకి వేడి రానివ్వదు. ముఖంలో కాంతి కూడా వస్తుంది. తులసి చేసే ఉపకారాల్లో ఇదొక గొప్ప మేలు!

అలా—మనకి మేలు చేసే మొక్కల్ని మన యింట్లో వేసుకుంటే—ఎంతో ఉపయోగం వుంది. 'పెరటిచెట్టు మందుకి పనికిరాదు' అన్న సామెత ఏదో వ్యంగ్య ధోరణిలో అన్నదేగాని, అందులో ఏమాత్రం నిజం లేదని, మనమే రుజువు చెయ్యవచ్చు. గదర్రా! □

# నిర్లక్ష్యం తెచ్చిన ప్రమాదం

మద్రాసులోని ప్రభుత్వ శిశు, స్త్రీ వైద్యశాల (ఎగ్మూరు)లోని ఒక నర్సు చేసిన పొరపాటువల్ల ముగ్గురు గర్భిణీస్త్రీలు ప్రాణాలు కోల్పోయారు! ఆ ముగ్గురి పేర్లు రాజీ (22) కుప్పాబాయి (25) దయాళు (25) ఆ నర్సు పేరు-ప్రభావతి. ఆ ముగ్గురు స్త్రీలకూ పురుడు పోసుకునే రోజులొచ్చాయని, డాక్టర్లు ఆసుపత్రిలో 'అడ్మిట్' చేసుకున్నారు. శరీరంలో ప్రోటీన్లు పెరగడానికి, మామూలుగా ఆరోగ్య రక్షణకూ-పురుడు వచ్చే ముందు 'ప్రొటీనొసాల్' అనే మందు ఇస్తారు. అయితే, అదే రంగులో వుండే 'ఫినాల్' (ఎక్కువ శక్తి గల ఫినైల్, తీవ్రమైన విషపదార్థం) అనే ద్రవాన్ని ప్రభావతి అనే ఆ నర్సు చూసుకోకుండా-ఆ ముగ్గురు స్త్రీలకూ ఇచ్చేసింది! అది తీసుకోగానే, ముగ్గురూ వాంతులు చేసుకున్నారు; ఆ మంట భరించలేక కేకలు వేశారు. ఆ కేకలు విని, ప్రభావతి మందు రుచిచూసి, తన తప్పు తెలుసుకుని డాక్టర్ల దగ్గరకు పరుగెత్తింది. అంతలోనే ఇద్దరు స్త్రీలు ప్రాణాలు కోల్పోయారు; మరొక ఆమెను రక్షించడానికి ఎందరో డాక్టర్లు మూడు గంటలసేపు శ్రమపడినా, లాభంలేక పోయింది! కేవలం నిర్లక్ష్యం, అజాగ్రత్తల వల్ల జరిగిన ఘోరం అది! ఆ నర్సు వయసు ఇరవై సంవత్సరాలు. శిక్షణ పొందుతోంది; చివరి పరీక్షకు ఇంకా కూర్చోలేదు! రెండు సెక్షన్ల కింద కేసుపెట్టి పోలీసులు ప్రభావతిని అరెస్ట్ చేశారు. మందు ఇవ్వడంలో ఆమెకు ప్రమేయం కల్పించిన హెడ్ నర్సునూ, మరో స్టాఫ్ నర్సునూ ఆసుపత్రి అధికారులు 'సస్పెండ్' చేశారు. ఒకే రంగుగల ఫినాల్, ప్రొటీనొసాల్-ఒకే చోట వుండడం వల్ల ఆ పొరపాటు జరిగినట్టుగా కథనం. అయితే, విషపూరితమైన ఆ ఫినాల్ సీసాలు అక్కడికెలా వచ్చాయో ఆశ్చర్యం! ఈ సంఘటన తర్వాత, ఏ ప్రభుత్వ ఆసుపత్రిలోనూ 'ఫినాల్' వాడకూడదని, దానికి బదులు 'ఫినైల్' వాడమనీ ప్రభుత్వం ఆర్డర్సు పంపింది. అన్ని ఆసుపత్రుల్లో వున్న 'ఫినాల్' సీసాలను స్వాధీనం చేసుకున్నది. ఆ గర్భిణీ స్త్రీలకు మందు ఇచ్చేముందు ఒక్కసారి సీసామీద వున్న పేరునూ, 'అపాయం' హెచ్చరికనూ ఆ నర్సు చూసుకుని వుంటే—అంతటి 'ఘోరం' సంభవించక పోయివుండేది!



మృతి

ప్రముఖ విద్యావేత్త, నిస్వార్థ సేవాపరాయణురాలు - శ్రీమతి ఎల్లెన్‌శర్మ జూన్ 9 ఉదయం భర్తని, ముగ్గురు కుమార్తెలను విడిచి దివంగతులైనారు ఆమె వయస్సు 79 సంవత్సరాలు.

1898 లో జర్మనీలోని బెర్లిన్‌లో జన్మించిన ఎల్లెన్ డాక్టర్ ఎ. ఎన్. శర్మని అక్కడే వివాహం చేసుకున్నారు. నలభైమూడేళ్ళ క్రితం మద్రాసుకు వచ్చారు. అప్పటి నుండి బాలల విద్యే జీవిత ధ్యేయంగా భావించి అందుకోసం కృషి చేశారు. 1937 లో ఏడుగురు విద్యార్థులతో మైలాపూర్‌లో చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలు ప్రారంభించారు. నేడు ఆ విద్యాలయంలో దాదాపు రెండువేలకు పైబడి విద్యార్థినీ విద్యార్థులు విద్య నభ్యసిస్తున్నారు.

ఆమె మద్రాసు ఎ. సి. కాలేజీ ఆఫ్ టెక్నాలజీ లోనూ, మాక్స్‌ముల్లర్ భవన్‌లోనూ మూడు దశాబ్దాల పాటు వందలాదిమందికి జర్మన్‌భాష నేర్పించారు. జర్మన్ దేశపు ప్రముఖ సంస్థల సహకారంతో అనాథలకు, పేద విద్యార్థులకు ఉచిత విద్యావసతి సౌకర్యాలు కల్పించారు. చిల్డ్రన్ గార్డెన్ స్కూలులోనే దాదాపు రెండువందలమంది ఆ విధంగా వుంటూ విద్యనభ్యసిస్తున్నారు.

ఆమె ఆత్మకు శాంతి కలగాలని ప్రార్థిస్తూ—ఆమె కుటుంబ సభ్యులకు 'వనిత' తన సంతాపాన్ని తెలియజేసుకుంటున్నది.

## 'వనిత' సంవత్సర పరీక్ష

ఈ సంచికతో 'వనిత' మూడేళ్ళు పూర్తిచేసుకుని, నాలుగో ఏడులో ప్రవేశించింది. అందువల్ల, ఇదివరకు లాగే ఈ సంవత్సరం కూడా 'వనిత' సంవత్సర పరీక్ష వుంటుంది. ఈ సంగతి మీకు తెలుసు. మరి, 'వనిత' సంచికలన్నీ జాగర్తగా వుంచుకున్నారా?....వచ్చే సంచికలో ఆ పరీక్షా పత్రం వుంటుంది—చూడండి. సమాధానాలు సరిగ్గా రాసిన వారికి "మంచి బహుమతులు" వుంటాయని మళ్ళీ రాయనక్కర్లేదనుకుంటాము. వ. సం.

# వార్తావనిత




అమలాపురం లయన్ లేడీస్ ఆక్సిలరీ, లయన్స్ క్లబ్ కలిసి, ఇటీవల 'లేడీస్ నైట్' ఏర్పాటు చేసింది. ఆ సభకు అధ్యక్షత వహించిన టి. సరస్వతీదేవి ప్రసంగిస్తున్నారు.

వచ్చే సంచికలో—

ప్రసిద్ధ రచయిత్రి

డి. కామేశ్వరితో గోష్ఠి

ఆమె వర్ణచిత్రంతో—

కాకినాడ తూర్పు గోదావరి జిల్లా మహిళా సమాఖ్య వారి ఆధ్వర్యంలో ఇటీవల వనితల ఉపాధి కల్పనకై కుట్టుపని కేంద్రం ప్రారంభించబడింది. జిల్లా స్త్రీ సంక్షేమశాఖ అధికారిణి శ్రీమతి రాజ రాజేశ్వరి ఆ నాటి సభకు ప్రారంభోత్సవం చేశారు. ఆవిడ తన ప్రసంగంలో "స్త్రీ సంక్షేమం కోసం ప్రభుత్వం ఎన్నో అభివృద్ధి పథకాలు ఏర్పాటు చేసిందనీ వాటిల్లో సహకార సంఘాలు, సంక్షేమ శాఖలు రుణాలు యివ్వడం ఒకట"నీ చెప్పారు. మహిళా సమాఖ్యలు ఇటువంటి సంక్షేమ కార్యక్రమాలు చేపట్టాలని చెబుతూ అటువంటి వాటికి తమ పూర్తి సహకారం వుండగలదని హామీ యిచ్చారు. జిల్లా మహిళా సమాఖ్య అధ్యక్షురాలు డా॥ ఎ. విజయలక్ష్మి కుట్టుపని కేంద్రానికి రూ. 100/- విరాళం ప్రకటించారు.

వాల్తేరు లయన్ లేడీస్ ఆక్సిలియరీ మహిళలు 'కిన్నెర ఓపెన్ ఎయిర్ థియేటరు'లో జరుపుకున్న లేడీస్ నైట్ ఉత్సవాలకు లయన్ లేడీ కొల్లూరు రమణీ వెంకట్రావు అధ్యక్షత వహించగా, లయన్స్ పాస్ట్ డిస్ట్రిక్టు గవర్నర్, శ్రీ డి. వి. సుబ్బారావు ముఖ్య అతిథిగా వ్యవహరించారు. సభానంతరం జరిగిన వినోద కార్యక్రమంలో లయన్సు మహిళలు 'బస్సులు వస్తున్నాయి – జాగ్రత్త', 'మహిళలు మారాలి' అనే రెండు నాటికలను ప్రదర్శించారు.

—విలేకరి






పైన ఒక వ్యంగ్యచిత్రం (కార్టూన్) కనిపిస్తున్నది. ఆ చిత్రానికి తగ్గట్టుగా, మీరు హాస్యం వచ్చేట్టుగా సంభాషణరూపంలో (ఇద్దరూ మాట్లాడుకుంటున్నట్టుగాని, ఒక్కరే చెప్పినట్టుగాని–) నాలుగైదు లైన్లకు మించకుండా రాసి పంపగలరా? సెప్టెంబర్ 6వ తేదీన వినాయకచవితి. అంచేత–ఈ కార్టూన్ ఆ సంచికలో వస్తుంది. వచ్చిన సంభాషణల్లో, ఏది పై బొమ్మకు తగినట్టుగా సహజంగా, చమత్కారంగా వుందని అనిపిస్తే–వారికి ఒక "చక్కని బహుమతి" పంపుతాము. సంభాషణలు కార్డు మీదనే రాయాలి. పేరు, పూర్తి చిరునామా ఇవ్వాలి. జూలై నెలాఖరులోగా ఆ కార్డులు మాకు చేరాలి. కార్డు మీద రాసే వనిత చిరునామాకు పైన 'రేఖా చిత్రానికి' అని రాయాలి.

వచ్చే సంచిక నుంచి:

మీ సందేహాలకు బామ్మగారు సమాధానాలు ఇవ్వడానికి అంగీకరించారని తెలియజెయ్యడానికి సంతోషిస్తున్నాము. బామ్మగారు చెప్పే పలు విషయాల మీద, మీకు ఎలాంటి సందేహాలున్నా రాసి 'బామ్మగారి పేజీ' పేరిట 'వనిత'కు పంపగోరుతున్నాము. ప్రశ్నలు ఈ నెలాఖరులోగానే చేరితే–సదుపాయంగా వుంటుంది. —వ. సం





పెద్దకథ:

# హేమంతహేళి

'వింధ్యవాసిని'

మాటలూ, చేష్టలూ కూడా అంతే. అంత చిన్న వయసుకే ఆరిందాలా ఆలోచించేవాడు. తనేదయినా తెలుసుకోవాలనుకుంటే, దాన్ని విడమరిచి చెప్పేదాకా, తను అర్థం చేసుకునేదాకా వదలడు. ఎప్పుడయినా, ఏదయినా ప్రామిస్ చేసుంటే, ఆరునూరయినాసరే దాన్ని మరిచిపోడు. నువ్వు ఫలానా వస్తువిస్తానని ప్రామిస్ చేశావని గుర్తు చేస్తాడు.

స్కూల్లో తన క్లాస్ పిల్లలతో ఏం మాట్లాడతాడో కానీ ఇంట్లో మాత్రం సీరియస్‌గా ఉండేవాడు. వాడి పెద్ద కళ్ళు, అందులోని పెద్ద కనుపాపలూ, చూపుల్ని తీక్షణంగా మార్చేవి.

సత్యమూర్తి దగ్గిర మాధవకి బాగా చనువు. అతనొస్తే వాడు అడిగే ప్రశ్నలకి అంతు ఉండదు. అతనూ ఓపిగ్గా సమాధానాలు చెబుతుంటాడు.

అహ్మద్‌కి లాగే బాబుకి రామాయణం కథ అన్నా రాముడన్నా ఇష్టం. రాముని అంత పెద్ద హీరో ఇంకెవరూ వుండరని వాడి ఉద్దేశ్యం. అహ్మద్‌కి శ్రీరాముడు జీవితంలో కష్టాల్ని, సుఖాల్ని సమభావంతో ధైర్యంగా ఎదుర్కోవటం నచ్చితే వీడికి రాక్షసులని ఎదుర్కొని ఎడాపెడా బాణాలు వేయటం నచ్చింది.

''అంకుల్! రాముడంటే చాలా గొప్పకదా? అతనికి చాలా బలం వుంటుంది కదూ?'' అని సత్యమూర్తి నడిగాడో రోజు.

''అవును మాధవా?'' అంటే, ''నేను పెద్దయితే రాముడిలా బాణాలేసి రాక్షసుల్ని చంపేస్తా'' అని సీరియస్‌గా చెప్పేశాడు.

వాడి మాటలకి వచ్చిన నవ్వునాపుకుంటూ ''అలాగే రాముడిలా

అవుడువుగానీ, ఇప్పట్లో బాణాలుపయోగించరు బాబూ! పెద్ద తుపాకుల్తో ధమధమాలని కాల్చుకుంటారు.'' అని చెప్పి ఆవేళ వాడికొక మంచి ఇంగ్లీష్ స్టంట్ పిక్చర్ చూపించాడు. ఇంటికొచ్చాక తనకి అర్థం అయినంతలో ఎంత చక్కగా చెప్పాడో!

## 15

కొన్ని రోజులనించీ గమనిస్తున్నా. ఎదురింట్లో కొత్తగా వచ్చిన ఒకతను రోజూ నేను స్కూల్‌కి వెళ్లేటప్పుడు, వచ్చేటప్పుడు నావయిపు చూస్తూ అలాగే నుంచునేవాడు. కనీసం నేనేమనుకుంటానో అన్న బెదురు కూడా ఉన్నట్లు లేదు. పోనీలే, చూస్తే నాకేమయింది? అని సరిపుచ్చుకున్నాను.

ఒక ఆదివారం మధ్యాహ్నం మాధవ నిద్రపోతుంటే నేనేదో పుస్తకం చదువుకుంటూ పడుకున్నాను. దగ్గరగా వేసి వున్న తలుపు చప్పుడవుతే చూశాను. తోసుకుని లోపలికివచ్చి చొరవగా కుర్చీలో కూచున్నాడు—ఎదిరింటతను! నాకు భలే కోపం వచ్చింది. అయినా నిగ్రహించుకుని మంచంమీద కూచుంటూ, ''ఏంకావాలండీ? ఎవరు మీరు?'' అన్నాను.

''రోజూ చూస్తూనే వుండీ ఎవరని అడుగుతావేం? ఏం కావాలో ఎట్లా చెప్పేది? అయినా నీకు తెలియదు కనకనా నేను చెప్పేది!'' అంటూ వెకిలిగా నవ్వాడు.

''ఆదేమిటి. చెప్పందే నాకెలా తెలుస్తుంది? అయినా బొత్తిగా మంచీ మర్యాదా లేకుండా ఇలా పరాయివాళ్ళ ఇళ్ళలో చొరబడ్డమేమిటి!'' అని గదమాయించాను. కానీ నా మాటలేవీ అతని చెవిలో పడినట్లు కనిపించలేదు.

లేచి వెళ్ళి గబగబా ముందుతలుపు వేసి గడియ పెట్టాడు. నాకు భయం వేసింది. నావయిపుగా వస్తూ, ''ఇప్పుడర్థమయిందా? ఏంకావాలో. ఇంకా వివరంగా చెప్పాలా'' అన్నాడు. అదే వెకిలినవ్వు....కంపరం పుట్టించే నవ్వు....చాచి చెంప పగలగొడదామా అన్పించింది.

ఏం చేస్తాడోనని భయంతో, ఏమీచేయాలో తెలియక నేను అవాక్కై చూస్తుండగానే, నా భుజాలచుట్టూ చెయ్యివేసి నలుపుతూ, ''నీ చరిత్ర నాకు తెలీదూ? ఎందుకు పతివ్రతలా నటిస్తావు. నేచెప్పినట్లు విను. నిన్ను డబ్బులో ముంచెత్తుతాను. ఒక పిల్లాణ్ణి కనీ ఇంత అందంగా వున్నదాన్ని నిన్నే చూస్తున్నాను'' అన్నాడు. ఆ మనిషి నా కంటికి నరరూప రాక్షసుడిలా కన్పించాడు. భగవాన్! నన్ను కాపాడేభారం నీదే అనుకున్నాను. కళ్ళు మూసుకుని—ఆ రాక్షసుడి చేతుల్ని విడిపించుకోవాలని ప్రయత్నిస్తూ. ఇంతలో తలుపు చప్పుడయింది.

అబ్బ! దేవుడే నాకోసం ఎవర్నో పంపాడనుకున్నాను. అంతదాకా అన్ని మాటలు వాగిన ఆ వెధవ తలుపు చప్పుడుకి కాస్త బెదిరాడు. అవకాశం చిక్కించుకుని వాడిచేతులు విడిపించుకుని, రెండడుగుల్లో వెళ్ళి తలుపు తీశాను. ఎదురుగుండా సత్యమూర్తి నుంచుని వున్నాడు. ఒక్క క్షణంలో జరిగిందేమిటో అతనికి అర్థమయిపోయి ఉంటుంది. కోపంతో ఆ ఎదిరింటివాడి వయిపుగా రాసాగాడు.

వాడేమీ చూసుకోకుండా, ''రోజూ ఈ వెధవతో కులుకుతూనే వున్నావుగా? వాడికంటే నేనేం తీసిపోయాను'' అని ఉక్రోషంగా అంటూ బయటికి అడుగు వేశాడు. వాడి మాటలకి సత్యమూర్తికి కోపం మరింత ఎక్కువయింది. ఒక్క ఉదుట్న వాడి కాలర్ పట్టి గుంజి, రెండు చెంపలూ ఎడా పెడా వాయించి, అలాగే లాక్కెళ్ళి తలుపు బయటికి తోసేశాడు.

జరిగిన సంఘటనతోనే నాకు సిగ్గుతో చచ్చినంత పనయింది. దానికి తోడు ఆ వెధవ మమ్మల్నిద్దర్నీ అవమానిస్తూ అన్న మాటలు మరింత కుంగదీసాయి. తల వంచుకుని మంచం మీదోమూల కూచుండి పోయాను. కనీసం సత్యమూర్తిని కూచోమనయినా చెప్పలేదు. వెనక్కి వచ్చి అతనూ నా ముఖం చూడలేని వాడిలా కొద్దిసేపు ఎటో చూస్తూ కూచున్నాడు. ఆఖరుకు తనే, ''సారీ సీతా: మీరేం బాధపడవద్దు. నేను మళ్ళీ వస్తాను. తలుపు జాగ్రత్తగా వేసుకోండి'' అని చెప్పి పెద్ద పెద్ద అంగలేస్తూ వెళ్ళిపోయాడు.

తరవాత మూడు రోజులకి ఒక సాయింత్రం వచ్చాడు సత్యమూర్తి. అతను సామాన్యంగా మా ఇంటికొచ్చేది ఆదివారాలే. అంతేకాకుండా అతని ముఖం ప్రత్యేకించి సీరియస్‌గా వుంది. అతనేదో మాట్లాడాలని ఆదేపనిగా వచ్చాడని అర్థమయింది.

నే కాఫీ ఇస్తే తీసుకుని, ''మీతో కొంచం మాట్లాడాలి సీతా!'' అన్నాడు తనవళ్ళో ఎక్కికూచున్న మాధవ వయిపు సాలోచనగా చూస్తూ. అతడి చూపుల భావం నాకర్థమయింది. వాణ్ణి మెల్లగా దింపి పనిపిల్ల వెంట పార్కుకి పంపించాను.

''అసలు విషయాన్నెలా మొదలు పెట్టాలో తెలియకనే ఇన్నాళ్ళూ చెప్పలేకపోయాను. ఆరు నెలలక్రితం రాసిన ఐ. ఏ. ఎస్ పరీక్షల్లో సెలక్ట్ అయినట్లు తెలిసింది. ఇంటర్వ్యూ కూడా పాసిటివ్ రిజల్ట్స్ వచ్చింది. త్వరలో ఏవూరికయినా పోస్టింగ్స్ వేస్తే హైదరాబాద్ వదిలి వెళ్ళాల్సి వుంటుంది. అందుకే ఇక ఆలస్యం చేసి లాభంలేదని ఆవాళ వచ్చాను. నా అదృష్టం సరిలేక ఆరోజు ఆ దుర్ఘటన జరిగింది.....మీరేమీ అనుకోనంటేనే చెబుతాను. నేను చెప్పేది మీకు ఇష్టమున్నా లేకపోయినా మన మధ్య స్నేహానికి మాత్రం భంగం రాకూడదు.'' జవాబుకోసం నావంక చూశాడు సత్యమూర్తి.

అలాగే నన్నట్లు తల ఊపాను.

''నేను మిమ్మల్ని పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను. మీరు అహ్మద్‌ని ఎంతగా ప్రేమించారో నాకు తెలుసు. అయినా...''

''మా ఇద్దరి మధ్యా వున్న ప్రేమ, అనుబంధం అన్నీ తెలిసీ మీరిలా అడుగుతుంటే నాకాశ్చర్యంగా వుంది. ఒకవేళ నేనే మీకటువంటి ఆశ ఏమయినా కల్పించానా నాకు తెలియకుండా....'' అర్థంలోనే ఆగిపోయాను.

''అబ్బెబ్బే. అలాంటిదేం లేదు సీతా. ఇది పూర్తిగా నావయిపునించే వచ్చిన ప్రపోజల్ మాత్రమే.''

అతనిలాంటి ప్రపోజల్ చేస్తాడని నేను కలలో కూడా అనుకోలేదు. నాకు అహ్మద్ కంటే ముందునించే ఇతనితో పరిచయం వుంది. మంచి వాడు. స్నేహశీలి—అని అతన్ని గూర్చి నా అభిప్రాయం. అహ్మద్‌తో నా స్నేహానికి, పెళ్ళికి అవకాశం కల్పించింది ఇతనే. అందుకే అతనంటే నాకొక ప్రత్యేకాభిమానం.

ఇక అహ్మద్ పోయి ఒంటరిగా మిగిలినప్పుడు, తోడుగా నిలిచి,

సహాయాన్ని, సలహాలని కూడా ఇచ్చాడు. అందుకే నాలో అతనిపట్ల చెప్పలేనంత కృతజ్ఞత ఉంది. ఆ కృతజ్ఞతవల్లనే, అతను చేసిన ప్రపోజల్ నాకు అవమానకరంగా తోచినా నేను తప్పు పట్టకుండా శాంతంగానే జవాబులిచ్చాను.

"అలా అయితే స్నేహితుడి భార్య ఒంటరిగా కష్టాల్లో వున్నదని జాలిపడి అడుగుతున్నారా?"

"అనవసరంగా మీరు నన్ను అపార్థం చేసుకుంటున్నారు సీతా!"

"ఇందులో అపార్థం ఏముంది మూర్తిగారూ! మాది ప్రేమ వివాహమని మీకు తెలుసు. మీ స్నేహితుడు పోయినా నేనింకా బతికున్నానంటే అది మాధవకోసమే. ఇదీ మీకు తెలియంది కాదు. అలాంటప్పుడు అయన్ని మరిచిపోయి, మిమ్మల్నయినా మరెవర్నయినా నా జీవితంలోకి ఎలా ఆహ్వానిస్తాననుకున్నారు? భారతస్త్రీ ఒకే భర్తకు అంకితం కావాలి – అని నీతివాక్యాలు చెప్పనుకానీ, అహ్మద్ జ్ఞాపకాలు, ఎప్పుడూ నాలో నిలిచే వుంటాయనీ వాటినెవరూ చెరిపేయలేరనీ మాత్రం చెప్పగలను." అన్నాను సీరియస్‌గా.

"ఓహ్! నా మనసుని మీకు పూర్తి అర్థమయేలా ఎలా చెప్పేది? మీరు మధ్యలో ప్రశ్నించకుండా వినండి. మొదట్నించీ నా మనసులో జరిగిన యుద్ధాన్ని గురించి చెబుతాను.

ఆనాడు రాజారావుగారు మొదటగా మిమ్మల్ని పరిచయం చేసినప్పుడే, ఎందుకోగానీ, ఎన్నాళ్ళుగానో మనిద్దరి మధ్య ఎంతో స్నేహం వున్నట్లు చాలా ఆత్మీయులుగా కన్పించారు. నాకు కాలేజీలో చదివేటప్పట్నించీ ఆడపిల్లలంటే ఎలర్జీ. దానిక్కారణం నేను చూసిన కొందరి అతివాగుడు, విచ్చలవిడి తనమేనేమో అనిపిస్తుంది. ఎంతో అమాయకంగా, చిన్న పిల్లలా ఉన్న మిమ్మల్ని చూసి, ఈ అమ్మాయి, ఈ సిటీలైఫ్‌ని, ఉద్యోగాన్ని ఎలా నెగ్గుకొస్తుందా అన్పించింది. అందుకే ఎలాంటి సహాయమయినా మీరు అడిగితే చాలు చేయాలన్పించేది.

"మీరు గదికోసం నన్నడగటం నేను మా ఇంట్లోనే చూపిస్తే, మీకు నచ్చి, మీరు చేరటం నాకెంతో సంతృప్తిని కలిగించింది. మీరు నన్నడగకుండా, ఎక్కడో గది చూసుకుని, వంటరిగా చేరి వుంటే నేనెంత దిగులుపడివుండేవాణ్ణో మీకు తెలీదు.

"జీవితంలో పెళ్ళనేదాని జోలికే వెళ్ళకూడదని నా నిర్ణయం. ఎవరో తెలియని వ్యక్తిని నా జీవితంలోకి రానివ్వటం, ఆ వ్యక్తికోసం నా అలవాట్లు మార్చుకోవటం, నా అభిరుచుల్ని ఆవిడ మీద రుద్దటం, చూసిచూసీ వున్న స్వేచ్ఛను పోగొట్టుకుని, సంకెళ్ళు వేసుకోవటమే అన్పించింది.

"అందుకే మీపై నాకున్న అభిమానానికి అసలు అర్థం నాకు చివరిదాకా తెలియలేదు. మీరు మాట్లాడితే వినాలనీ, మీతో స్నేహం చేసి దగ్గరగా గడపాలనీ, అమాయకంగా వున్న మీ ముఖం వైపు చూడాలనీ ఇలా ఎన్ని కోరికలు నా మనసులో ఏర్పడినా, వాటిని అణచుకుంటూనే వచ్చాను. వాటికి మూలమయిన శక్తి ఏమిటో తెలుసుకోవాలని నేనెప్పుడూ ప్రయత్నించలేదు.

"అందుకే అహ్మద్ మిమ్మల్ని ప్రేమిస్తున్నాడని తెలిసిన రోజున నేనంత బాధపడలేదు. కానీ రానురాను మీ ఇద్దరి మధ్యా స్నేహం ఎక్కువయి, మీరు నాతో మాట్లాడటం తగ్గిపోయింది. మీకున్న తీరిక సమయాలన్నీ అతనితోనే గడిపేవారు. అప్పుడు మొదలయింది నాలో సంచలనం. నా స్వంతమైనదేదో పరాయిపాలై పోతున్నట్లు అనిపించింది.

ఆ సంచలనానికి కారణమూ, నాలో ఏర్పడిన జెలసీకి అర్థం నేను తెలుసుకునేసరికి మీ పెళ్ళి అయిపోయింది. ఇదీ నా కథ. ఎవరికీ చెప్పకుండా నాలోనే దాచుకున్న నా ప్రేమ కథ."

అతనలా అంటుంటే నిజంగా నాకెంతో జాలివేసింది. ప్రేమించి, ప్రేమించబడటం ఎంత అదృష్టమో, ప్రేమించి ఆ ప్రేమ వ్యర్థమవటం అంత దురదృష్టంకూడాను. కోరుకున్నవారిని జీవిత భాగస్వామిగా పొందటం ఎంతటి వరమో, కోరుకున్నవారి గడపనయినా దాటలేకపోవటం అంతటి శాపమేమో! అయినా అప్పట్లో స్నేహితుడిముందు తన ప్రేమని బయటపెట్టని అతని ఔదార్యానికి మనసులోనే మెచ్చుకోకుండా ఉండలేకపోయాను.

"నేనింత కథ ఎందుకు చెబుతున్నానంటే, మీ ముందు మిమ్మల్ని పెళ్ళాడగోర్తున్న నా అభిమానం ఈ నాడు మీపై జాలివల్ల కలిగిందికాదని మీకు అర్థం అవటానికే. ఒంటరిగా ఉన్నారుకదా అని చులకనచేసి పెళ్ళాడతానని అంటున్నానని అపార్థం చేసుకోకుండా ఉండటానికే.

"అయితే ఒకటి–మీపై నాకు జాలీ, సానుభూతీ లేకపోలేదు. కానీ స్నేహితుడి భార్యగా కంటె, నా మనసులో నిలిచిన ప్రేమమూర్తిగా, మీరు బాధపడుతుంటే సహించలేని జాలీ, సానుభూతీ అవి."

"ఒకప్పుడు అహ్మద్ అంటే జెలసీ లేకపోలేదు. కానీ ఇవాళ అతను లేడు. ఏ దూరతీరాలకో వెళ్ళిపోయాడు. మీచేత అంతగా ప్రేమించబడి, విధిలిఖితం వల్ల మీనుండి దూరమయిన నా స్నేహితుడితో పోటీపడేంత మూర్ఖుణ్ణి కాదు." అన్నాడతను మళ్ళీ.

అతని మాటలొక్కొక్కటీ నెమరువేస్తూ, ఆలోచించుకుంటున్నాను. ఏం చెప్పాలో తెలీక ఊపిరాడనట్టుగా వుంది. అతను ఏనాడో నాకు తెలీకుండా నన్ను ప్రేమించాడనే విషయాన్నే హఠాత్తుగా వినటం వల్లనేమో జీర్ణించుకోలేకుండా వున్నాను.

"నేను భర్త పోయిన దాన్నే కాదు మూర్తిగారూ! కన్న కొడుకు కాకపోయినా, మమకారంతో పెంచుకున్న పెంపుడుకొడుకు ఒకడున్నాడు నాకనే విషయం మీరు మరిచిపోయారా? వాడికి మీరిచ్చే స్థానం ఏమిటి?" అన్నాను సందిగ్ధంగా.

"మీకు మాత్రమే విలువిచ్చి, మాధవని దూరం చేయమనేంత రాక్షసుణ్ణికాను సీతా! వాడంటే నాకెంత ఇష్టమో మీకు తెలీదు? ఇన్నాళ్ళుగా వాడికి నేను దగ్గరయ్యాను. ఒకటే భేదం. అంకుల్ అనటం మానేసి నాన్నా అని పిలుస్తాడు–మనం నేర్పితే....ఏమంటారు–చెప్పండి సీతా!"

"ఏమిటండీ మీ పిచ్చి. మీరు నిర్ణయించుకోటానికి ఇన్నేళ్ళు పట్టిందే నన్ను ఆలోచించుకోవటానికి కొన్ని రోజులయినా వ్యవధి ఇవ్వరా?" అన్నాను వాతావరణాన్ని తేలికపరచే ఉద్దేశంతో.

అతను కూడా తేలిగ్గా నవుతూ, "సారీ! నా ఆత్రుతలో మీ పొజిషన్ ఆలోచించలేదు. బాగా ఆలోచించుకునే నిర్ణయించుకోండి. మాధవనిగురించి

దిగులు పడవద్దు. వాడికి బాధ్యతగల తండ్రిని కాలగననే నమ్మకం నాకుంది. ఇంతే నేను చెప్పేది'' అతను ముగించి లేచేలోగా, "అంకుల్" అంటూ పార్క్‌నించి వొచ్చాడు మాధవ.

## చరమగీతి

మధురోహల గతానికి
తలుపులు మూయమంటున్నావు
నిరాశామయ భావికి
పునాదులు తవ్వమంటున్నావు
అంధకారంలో చిరు వెలుగులు చిమ్మావు....

పగిలిన నా ఎద తునకలు
మమతలతో అతికావు....

పంకభరిత జీవన భాండాన్ని
ప్రేమామృతంతో శుద్ధి చేశావు....

యిప్పుడు నీవేమీ నాకు కావంటే
నిరాశామయ భావి నాకు మృత్యు సంగీతంతో
స్వాగతం పలుకుతుంది....

వెలుగు మింగిన నా గతం
అంధకారమై నన్ను చుట్టుకుంటుంది.

ఎలా సరిపెట్టుకోను?
ఎలా ఈ అమృతాన్ని కాలదన్నుకోను?
చవిచూచిన దైవత్వాన్ని
ఎలా వొదులుకోను?

ఒక్కటి చెప్తున్నా విను....
మళ్లీ నిశిధిని కౌగలించుకోను....

మళ్ళీ నా గుండెల్లో బురద నింపుకోను....
నా నోము పండి అందిన నీ చెలిమితో
నా యీ క్షుద్ర జీవితం ఉద్ధరించిన నీ తలపులతో
సంతోషంగా కన్నుమూస్తాను....

యింతటితో కాలానికి కళ్ళెం వేస్తాను
శాంతిలేని గుండె తలుపులు మూసివేస్తాను!....

—వాణీ రంగారావు

## 16

గత వారంలో జరిగిన దుర్ఘటన వల్ల మనసులో కలిగిన అలజడి, నిన్నటి సత్యమూర్తి మాటలతో మరింత ఎక్కువయింది. రెండు హఠాత్ సంఘటనల్నీ నేను జీర్ణించుకోలేకుండా వున్నాను. దానికితోడు రాత్రి పడుకునే ముందు, అప్పుడే గుర్తొచ్చినవాడిలా అడిగాడు మాధవ–"మమ్మీ! మరే డాడీ అంటే, అంకుల్‌లాగానే వుంటాడా?'' అని.

''ఏం?'' అన్నాను. ఈ కంపేరిజన్ ఎందుకొచ్చిందా అని.

''అదికాదూ–స్కూల్లో మా ఫ్రెండ్ సురేష్ లేడూ, అదే మమ్మీ, మన ఇంటికి అవతల వాళ్ళిల్లు. వాడన్నాడు. రోజూ మీ ఇంటి కొస్తాడే ఆయన మీ డాడీనా అని. కాదురా అంకుల్ అని చెప్పాను. అంకులే డాడీ అయితే ఎంత బావుంటుందో? కద మమ్మీ'' వాడి మాటలకి నా కళ్ళలో నీళ్ళొచ్చాయి. ఏమీ చెప్పలేకపోయాను. మా ఇద్దరి భవిష్యత్తునీ నిర్ణయించు కోవడానికి వీడు దారి చూపిస్తున్నాడా అనిపించింది. నా బుర్ర పనిచేయటం మానేసింది.

ఈ లోకంలో వయసులో వున్నస్త్రీ తోడులేకుండా గడపటం చాలా కష్టమని నాకు ముందే తెలుసు. శైలజ వున్నదనే ధైర్యంతోనే నేను వూరొదిలి మొట్టమొదట ఇక్కడికొచ్చాను. తనే లేకపోతే నేనింత ధైర్యం చేసుండేదాన్నేనా? ఏదో కష్టం వస్తే ఆదుకునే స్నేహితురాలున్నదని ధైర్యం. నా అదృష్టంకొద్దీ సహృదయుడయిన సత్యమూర్తి స్నేహం కూడా లభించింది. అందుకే ఒంటరిగా వున్నాననే భావమే నాలో ఎప్పుడూ కలుగలేదు.

ఆటుతరువాత అహ్మద్‌తో పరిచయం, పెళ్ళి జరిగి, నా అంత అదృష్టవంతురాలిక ఉండబోదనుకున్నాను. ఎన్నో ఏళ్ళు కాకుండానే, ఆ స్వర్గమూ నా చేతినుంచి జారిపోయింది. చేజారిన స్వర్గం మిగిల్చిపోయిన వరం మాధవ. వాడికోసమే నా జీవితం. ఒకటి–వాడు నా ప్రాణంలో ప్రాణమయిన శైలజ కన్నకొడుకు. రెండు స్వంతంగా సంతానం లేని నాకు పుత్రుడయి నన్ను తల్లినిచేశాడు వాడు. అందుకేనేమో, నాచేయి పట్టి నడిపించిన అహ్మద్ కంటే ఎక్కువగా ప్రేమిస్తాను వాణ్ణి. నేనేపని చేసినా అది వాడికి సుఖ సంతోషాల్నివ్వాలనే నా ఆత్రుత. వాడి ఆనందానికి భంగం కలిగించే పనేదయినా నేను నాచేతులారా చేయలేను. నా మనుగడకి అర్థం, నా కళ్ళకి చూపు నా ముద్దుల మాధవ.

అహ్మద్ పోయినా ధైర్యంగా ముందడుగు వేసిన నా మనస్థైర్యాన్ని ఆ వాళ జరిగిన దుస్సంఘటన కొంచెం సడలించింది. అది మచ్చుకొకటి మాత్రమే. ఎన్ని జరిగినా ఆశ్చర్యం లేదు. ప్రతీసారీ ఏ సత్యమూర్తో వచ్చి రక్షిస్తాడనే గ్యారంటీ లేదు. ఈ లోకంలో నాలాంటి వంటరిదానికి చోటేలేదా అని సుడిగుండంలో చిక్కుకున్న దానిలా వాపోయాను.

''అహ్మద్! నా ప్రియతమా. నీతోపాటు నన్ను తీసికెళ్ళకుండా. నన్నెందుకు వంటరిగా వదిలి వెళ్ళిపోయావు? కన్నీళ్ళంటే నీకసహ్యం అని కన్నీళ్ళు కార్చరాదనే అనుకుంటాను. కానీ ఈ పరిస్థితిలో ఈ ఒంటరి జీవితంలో కన్నీళ్ళు కారిస్తేనే కొంత ఉపశమనం కలుగుతూంది నాకు. నన్ను క్షమించు అహ్మద్! ఇప్పుడు నేనేంచేయాలి? నీకే నా మనసునీ, తనువునీ అర్పించుకుని, నాదంటూ ఏమీ మిగుల్చుకోని నన్ను నీ మిత్రుడు చేపడతానంటున్నాడు. ఎందుకు నామీదంత జాలి? అంటే జాలి కాదు. ప్రేమ అంటాడు. అతని ప్రేమ నిన్ను మనసులోంచి తొలగించలేని నన్ను ఆదరించి, భరించ గలదా? నువ్వే చెప్పు అహ్మద్!'' కళ్ళు మూసుకుని

అనుకున్నాను. ఏనాడో నన్ను వదిలి వెళ్ళిన అహ్మద్ నా పిలుపుకి పలికేనా? నాకు జవాబు చెప్పేనా!

అతడి మరణంతో దారీతెన్నూ తెలియకుండా పోయిన నా జీవితనావ సత్యమూర్తి చేతిలో తీరమే చేరుకుంటుందో లేక మరింత అలజడికే గురవుతుందో నాకు అంతు పట్టటం లేదు. ఇలాంటి పరిస్థితిలో శైలజ వుంటే నాకు కొండంత ధైర్యం వుండేది. ఎంతటి చిక్కుముడి నయినా తన తెలివితో ఇట్టే విప్పేసి నాకు దారి చూపేది.

సత్యమూర్తి తన ఇష్టంగా మాధవకి తండ్రినవుతా నంటున్నాడు. పిల్లాడికి తండ్రి లేని లోటు పెద్దదే. అలాగని నేను పెళ్ళికి వప్పుకుంటే, అతను నిజంగా తండ్రి కాగలడా? ఏమో? సవతి తల్లి అంటే ఎలా వుంటుందో నాకు తెలుసు. నేతి బీరకాయలో నెయ్యి వుందనుకోవటమూ, సవతితల్లీ తల్లి కాగలదనుకోవటమూ రెండూ ఒకటేనని నా అనుభవం చెప్పింది. ఆ విషయం తెలిసి మాధవకి సవతి తండ్రిని తీసుకు రానా? భవిష్యత్తులో తనకి కలిగే సంతానంతో సమానంగా అతను వీణ్ణి చూస్తాడా?

మన సమాజంలో భార్య పోయిన మగవాడు మళ్ళీ పెళ్ళి చేసుకోవటం మామూలు విషయం. అదే భర్త పోయిన స్త్రీ పెళ్ళి చేసుకుంటే మహాపచారం. మాధవకి తండ్రిలేని లోటు తీర్చటం కోసం ఈ పెళ్ళికి వప్పుకున్నా నా లక్ష్యం పూర్తిగా సిద్ధిస్తుందో! బెడిసి కొడుతుందో! పెద్దయాక, తన తల్లి చేసుకున్న రెండో భర్త ఈయన అని వాడికి తెలిస్తే అవమాన పడి మమ్మల్ని అసహ్యించుకుంటే? భగవాన్ నేను భరించ గలనా? అలాంటప్పుడిక ఈ పనికిరాని పునర్వివాహాన్ని చేసుకుని అతనికీ అసంతృప్తిని కలిగించటం, నేను అవమానాన్ని పొందటం ఎందుకు?

ఇలా ఎన్ని రకాలుగా ఆలోచనలు చేశానో! నాకు తోడుగా, నా తల్లిదండ్రుల్లో ఏ ఒక్కరు బతికున్నా నాకింత కష్టం వచ్చేదికాదు. ధైర్యంగా జీవిస్తూ, నా మాధవని పెంచుకునే దాన్ని. తోడులేని దాన్నని, భవిష్యత్తు భయపెడుతూంది.

వారంరోజులు రాత్రీ పగలూ, ఇలా ఆలోచనల్లో సతమత మవుతూ గడిపాను. భగవాన్! నువ్వే దారి చూపు అని ఎన్నిసార్లో ప్రార్థించాను.

ఆఖరుకి నిజంగా దేవుడే నాకు దారి చూపాడు. కలలో నయినా తలుచుకోని విషయం జరిగింది. ఈ జన్మకి కళ్ళతో చూస్తానని అనుకోని వ్యక్తి నా ఇల్లు వెతుక్కుంటూ వచ్చింది; వస్తూ, మాధవ భవిష్యత్తుకు వెలుగునిచ్చే వార్త ఒకటి పట్టుకొచ్చింది.

సాయంత్రం స్కూల్‌నించీ ఇంటికొచ్చేసరికి తాళం వేసిన ఇంటి ముందు, చిన్న చేతిసంచీ పట్టుకుని కూచుని వుంది మా పిన్ని. అల్లంత దూరం నించే ఆవిణ్ణి చూసి, ఆశ్చర్యపోతూ వచ్చాను. తాళం తీసి లోపలికి తీసికెళ్ళాను.

"బాగున్నావా తల్లీ?" అని పలకరించింది పిన్ని. ఆ పిలుపుకి దాన్లోని ఆప్యాయతకీ ఉక్కిరిబిక్కిరయ్యాను. వచ్చింది మా పిన్నేనా అనుకుంటూ ఆవిడ ముఖంలోకి చూశాను. మూఖాన బొట్టు లేకనేమో, వృద్ధాప్యపు ఛాయలు మరింతగా కన్పిస్తున్నాయ్. కళ్ళచుట్టూ ఏర్పడిన వలయాలు లోపలికి పోయిన బుగ్గలూ ఆవిడ పరిస్థితిని చెప్పక చెబుతున్నాయ్.

"తమ్ముడెలా వున్నాడు పిన్నీ?" అన్నాను. అంతే ఇక ఏడుస్తూ కూచుంది. 'ఇంకా ఎక్కడ తమ్ముడే అమ్మా! ఆనాడు వాడు పైకి రావాలని

నీకు అన్యాయం చేశాను. కానీ నువ్వు చెడిపోయిందీ లేదు. వాడు బాగుపడిందీ లేదు. మీ నాన్న పోయాక, వాడు మరీ నా మాటవినకుండా పోయాడు. చదువూ లేదు. ఉద్యోగం అసలేలేదు. తన ఇష్టం వచ్చినప్పుడింటికి రావటం, ఉన్నంతసేపూ డబ్బిమ్మని పీక్కుతినటం. ఇచ్చిందంతా ఏం చేస్తాడో ఆ దేముడికే తెలుసు.

"మొన్నటికి మొన్న ఏదో వ్యాపారం చేస్తానని నమ్మించి నా దగ్గరున్న సొమ్ములన్నీ అమ్మి స్తే డబ్బు పట్టుకుపోయాడు. నెల రోజులయింది. పత్తాలేదు. ఇంక వస్తాడనే నమ్మకమూ లేదు. నాకు వేరే దిక్కెవరున్నారు నువ్వుతప్ప. నీ కెన్నో అన్యాయాలు చేశాను. కష్టాలు పెట్టాను, అయినా నీ ఇంట్లో దాసీపని అయినా చేద్దామని వొచ్చాను సీతా!....అన్నట్టు నువ్వు పెంచుతున్న బాబు మనవూరి రంగయ్యగారి మనవడటగా? ఆయన ఈ మధ్యనే చనిపోతూ, తనకున్న ఆస్తి అంతా నీ పేర్న రాశాడట. ఎవరో అనుకుంటుంటే విన్నాను" అంది.

## 17

రంగయ్యగారి పేరు వినగానే, కొన్నేళ్ళక్రితం అహ్మద్ ఉండగా జరిగిన సంఘటనలు గుర్తొచ్చాయి. అప్పట్లో ఆయన కోరికమేరకు అహ్మద్ అప్పుడప్పుడు మాధవను తీసుకుని ఆయన దగ్గరికి వెళ్ళి వస్తుండేవాడు.

అప్పుడు బాబుకి మూడేళ్ళనుకుంటాను. ఒకసారి వెళ్ళినప్పుడు ఆయనే అన్నారట హఠాత్తుగా – ఇంక తీసుకురావద్దని. మాధవకి తెలిసినంతలో వాడికి అమ్మానాన్నలు మేమే. మేము కన్నవాళ్ళం కాదని తెలియదు. శైలజ, ప్రభాకర్‌ల రూపాలు కూడా వాడికి గుర్తులేవు. వాడు అప్పుడప్పుడు రంగయ్యగారి దగ్గరికి, మా వూరికీ వెళ్తుంటే, ఎప్పుడోసారి నిజం వాడికి తెలియకపోదు. అందులోనూ అప్పుడప్పుడే బుద్ధి తెలుస్తున్న కుర్రవాడు. తన స్వంత తల్లిదండ్రులు పోయినట్లు వాడికి తెలియటం ఆయన కిష్టం లేదట. అందుకే రావద్దన్నారు. ఎక్కడున్నా వాడు సంతోషంగా వుంటే చాలని చెప్పిపంపారట. ఇప్పుడు చనిపోతూ ఆస్తిని నా పేరట రాయటం ఎందుకు? మాధవపేరనే రాయాలిసిందేమో! నాకూ వారి కుటుంబానికీ రక్తసంబంధం లేదు. బాబును పెంచుతున్నానని, నాపై నమ్మకంతో, చివరకు అంతా తన మనవడికే చేరుతుందనే ధైర్యంతో నన్ను నమ్మి, నా పేరున రాశారు. ఇక వాడి భవిష్యత్తు గురించి నేనంతగా దిగులుపడనవసరం లేదు. వూరికే వుండలేక ఏదో ఒక ఉద్యోగం చేయాలే గానీ, డబ్బు సంపాదించి వాడికోసం కూడబెట్టాలనే అవసరమంత ఉండదు:

సుఖదుఃఖాలు ఎప్పుడూ ఒకదాన్నంటి ఒకటి వుంటాయనే సత్యం నా విషయంలో ఋజువవుతూనే వుంది. ఆనాడు శైలజ పోయినదిగులు బాబుని పెంచటంలో మరిచాను. ఈ రోజు గతవారంలో జరిగిన సంఘటనల వల్ల కలతబారిన నా మనసుకి శాంతి చిక్కింది. ఒకటి బాబు భవిష్యత్తుకి మంచి ఆధారం దొరికింది రంగయ్యగారి ఆస్తితో. రెండు ఒంటరిగా నేనుండాల్సిన అవసరం లేకుండా పిన్ని నాతోపాటే వుండాలని వచ్చింది. నా సమస్యలన్నీ మంచులా విడిపోయాయి. నా దారేమిటో కళ్ళముందు స్పష్టంగా కన్పిస్తూంది. ఆలశ్యం చేసి, మూర్తికి మరింతగా ఆశకల్పించ దలచుకోలేదు. అందుకే మరురోజే నా నిర్ణయాన్ని చెప్పేశాను. కొద్దిగా షాక్ అయినట్లు కనిపించినా బాగా నిగ్రహించుకున్నట్లే వున్నాడు.

ఒక నెలలోపుగానే సత్యమూర్తికి ఏదో వూరికి పోస్ట్ చేస్తూ ఆర్డర్స్ వచ్చాయి. అతను శాశ్వతంగా హైదరాబాద్ వదిలి వెళ్ళిపోయాడు. ఒక మంచి స్నేహితుడు దూరమయాడనే బాధ చాలా రోజులపాటు నా మనసులో నిలిచిపోయింది.

మా పిన్ని చాలా మారిపోయింది. ఆనాడు ఆవిణ్ణి చూసినవాళ్ళెవరూ, ఈ రోజు నా దగ్గరున్న పిన్నిలా అవుతుందని కలలో కూడా అనుకోలేరు. అప్పుడు నేనావిడకు పరమశత్రువుని. నేను బాధపడితే ఆమెకు సంతోషం. నేను ఎందులోనయినా పైకొస్తే ఆవిడ కుంగిపోయేది. వీలయినంతవరకూ నన్ను పాతాళానికే అణగదొక్కేది. తన కొడుకే ఆమెకి లోకం. వాడొక రాజాలా పెరగాలని కోరుకుంది. ఆ కోరికే కొంపలు ముంచిందని ఇవాళ ఆవిడకూ తెలిసిన విషయమే. ఇప్పుడిలా ఆవిడ నా మీద చూపించే ప్రేమాభిమానాలకి, తను దిక్కులేనిదవటం, నాకు ఆస్తి రావటం మాత్రమే కారణాలుగా కన్పించదు. ఆవిడ మనసులోనే పశ్చాత్తాపం చాలా మార్పు తెచ్చిందేమో అనిపిస్తుంది. అప్పటి తలబిరుసుతనమేమయిందో— చాలా నెమ్మదిగా, నిదానంగా తన పనులు తాను చేస్తుంది. నాతో ఎంతో ఆప్యాయంగా వుంటుంది. మాధవకి ఆమె అన్నా, ఆమెకి వాడన్నా చాలా ఇష్టం.

వాళ్ళమ్మమ్మ వచ్చినప్పట్నించీ కొన్ని రోజులపాటు వాడు స్నేహితుల్తో ఆడుకోవటం కూడా మానేసాడు. స్కూల్‌కెళ్ళొచ్చాక ఇంట్లో వున్నంతసేపూ ఆమెతోటే కబుర్లు. ఆవిడ రాకవల్ల, సత్యమూర్తి వెళ్ళిపోయిన లోటు కూడా వాడికంతగా కన్పించలేదు.

ఇంట్లో వంటపనంతా తనే చేసేది పిన్ని. నేనే పని చేయవచ్చినా "ఉద్యోగం చేసేదానివి నీకెందుకీశ్రమ. నువ్వెళ్ళి రెస్ట్‌తీసుకో సీతా! అయినా ఇద్దరి వంట ఎంతపని అరగంటలో అయిపోదూ?" అంటుంది. ఆవిడ చూపించే ప్రేమకి నా కళ్ళలో నీళ్ళు తిరిగేవి. ఇంతటి మాతృప్రేమని తనలో దాచుకుని, నా చిన్నప్పుడు నన్నెందుకంతగా ఏడ్పించిందా అనిపించింది. అదీ నా దురదృష్టమేనేమో అనుకున్నాను. అప్పుడప్పుడు తమ్ముడు రాజు ఎక్కడున్నాడో, ఏం చేస్తున్నాడో అని గుర్తుచేసుకుని దిగులుపడేది.

ఐ. ఏ. ఎస్ సెలక్ట్ అయిన సంవత్సరం లోపుగానే సత్యమూర్తి పెళ్ళయిపోయింది. నాకు వెడ్డింగ్‌కార్డ్ పంపాడు. అది చూడగానే నాకు కొండంత దిగులు తీరింది. అతడి కోరికను తిరస్కరించి నిరుత్సాహపరిచేనని తెలుసు. పోనీ ఆ బాధని మరిచి పెళ్ళి చేసుకుంటున్నాడంటే సంతోషం కాదూ మరి!

## 18

వెడ్డింగ్ కార్డ్ వెంబడే ఉత్తరం కూడా వచ్చింది సత్యమూర్తినించి. "నాకున్న అత్యంత ఆత్మీయుల్లో మీరొకరని నేను చెప్పే అవసరం లేదు. మీకు తెలుసు. ఇన్నాళ్ళకి మా నాయనమ్మ కోరిక తీర్చక తప్పింది కాదు. నాకూ ఒంటరి జీవితం బోర్‌కొట్టిపోయింది – అందుకే ఈ పెళ్ళి. పెళ్ళికి మీరొస్తే నాకు సంతోషమూ, సంతృప్తి. మన స్నేహం కలకాలం పచ్చగా వుండాలని కాంక్షిస్తూ, మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాను" అని రాశాడు. ఉత్తరం క్లుప్తంగా వున్నా, అందులో వున్న ఆప్యాయతా, ఆత్మీయతా అపారం.

సత్యమూర్తి కోరికని తిరస్కరించలేకపోయాను. మాధవని తీసుకుని బయలుదేరాను. [సశేషం]

# “లోధ్ర” టానిక్ వనితలకు మాత్రం!




ప్రకృతి సిద్ధమైన పద్ధతి ద్వారా ఆరోగ్యంగా ఉండడానికి నెలలో ప్రతిరోజూ బాధలేని రోజుగా గడపడానికి “లోధ్ర” టానిక్ తీసుకోండి! ఏ బాధా లేకుండా ఆరోగ్య మయమైన జీవితాన్ని గడపండి.

75 సంవత్సరాల నుంచీ స్త్రీల విశ్వాసానికి పాత్రమైన టానిక్.
“లోధ్ర” మందుల షాపులలో దొరుకుతుంది.

ఉచితమైన వైద్య సలహాలకు క్రింది చిరునామాకు ఈ కూపనును పూర్తిచేసి, మీ ఉత్తరంతోబాటు జతచేసి పంపండి.

పేరు : ____________________

చిరునామా : ____________________

____________________

____________ PIN ____________

కేసరి కుటీరం (ప్రై) లిమిటెడ్

15, వెస్ట్‌కాట్ రోడ్, రాయపేట, మద్రాసు-600 014

ఏజంట్లు: శీతారామ జనరల్ స్టోర్స్ ఏజన్సీస్, విజయవాడ, సికింద్రాబాదు, బెంగళూరు

Sistas

---




20 ml. 5227—37
CY-BAN
MALATHION
PERFUMED
FOR THE TREATMENT
PEDICULOSIS

# కొత్త సై-బాన్* లోషన్ వాడండి

రాత్రికి రాత్రే పేలనుండి విమోచనము పొందండి!

- గుణవంతమైనది
- సురక్షితమైనది
- ఆహ్లాదకరమైన సువాసన గలది
- జిడ్డు లేనిది




* అమెరికన్ సయానమిడ్ కంపెనీవారి రిజిస్టర్డ్ ట్రేడ్‌మార్క్.

Sista's-CY-90F/Tel/78

విశాఖ లయన్‌లేడీస్ క్లబ్బు మహిళలు ఇటీవల ఆంధ్రా యూనివర్శిటీ అసెంబ్లీహాలులో ''లేడీస్ నైట్'' ఉత్సవాలను జరుపుకున్నారు. ఈ సందర్భంగా ఏర్పాటు చేసిన సభ శ్రీమతి రుక్మిణీ నరసింహారావు ప్రార్థనాగీతంతో ప్రారంభింపబడగా, శ్రీమతి వైదేహి కృష్ణారావు పతాకాభివందనం చేసారు. సభకు అధ్యక్షత వహించిన డా. ఎ. హైమవతీదేవి ప్రస్తుత సంవత్సరంలో క్లబ్బు సాధించిన అనేక కార్యాలను క్లుప్తంగా నివేదించి, రీజియన్‌లో తమకు ఉత్తమ లయన్ లేడీస్ క్లబ్బు అవార్డు వచ్చిన తీరును వివరించారు. కార్యదర్శి శ్రీమతి సి. ఇందిరానారాయణరావు నివేదికను సమర్పిస్తూ వివిధరంగాలలో తమ క్లబ్బు నిర్వహించిన కార్యక్రమాలను వివరించారు. ముఖ్య అతిథిగా పాల్గొన్న ఆకాశవాణి, విశాఖపట్నం కేంద్ర స్టేషన్ డైరెక్టర్, శ్రీమతి ఎస్. వి.



రమణమ్మ మాట్లాడుతూ శిశు సంక్షేమ కార్యక్రమాలలో స్త్రీల పాత్ర అవసరాన్ని, ప్రాముఖ్యతను వివరించి, ప్రభుత్వం చేపడుతూన్న అనేక శిశు సంరక్షక పథకాలలో మహిళలు, మహిళా సేవా సంస్థలు తగినంతగా పాల్గొనాలని ఉద్బోధించారు. లయన్స మహిళామండలుల డిస్ట్రిక్టు ఛెయిర్మన్ లయన్ ఆర్. నారాయణరావు-క్లబ్బు ప్రచురించిన సావనీరును విడుదల చేశారు. డా. ఎమ్. సన్యాసమ్మ వందన సమర్పణ అనంతరం జరిగిన సాంస్కృతిక కార్యక్రమంలో బేబీ సంఘమిత్ర మహాపాత్రో 'దశావతార' భరతనాట్య ప్రదర్శన ఏర్పాటు చేయబడింది. అనంతరం ద్వారకానగర్ శ్రీ కృష్ణశిశు మందిర్ శిక్షణా కేంద్రం వారిచే ''పుత్తడి బొమ్మ-పూర్ణమ్మ'' నృత్య నాటిక ప్రదర్శింపబడింది. సభలో గౌరవనీయ అతిథిగా పాల్గొన్న శ్రీమతి పార్వతీ భాస్కరరావు సాంస్కృతిక ప్రదర్శనలో పాల్గొన్న కళాకారులకు బహుమతులు అందజేశారు.

—విలేకరి

## వార్తా వనిత

TER CHILDREN FOR BETTER TOMORROW

L.L.Dr.A.HYMAVATI DEVI.




లయన్ లేడీస్ ఆక్సిలియరీ, విశాఖపట్నం నార్తు మహిళలు ఆ మధ్య మెసానిక్ లాడ్జిలో జరుపుకున్న ఉత్సవాలకు శ్రీమతి పి. శేషస్వామి అధ్యక్షత వహించగా, లయన్స మహిళలు డిస్ట్రిక్టు ఛెయిర్మన్, లయన్ ఆర్. నారాయణరావు ముఖ్య అతిథిగా వ్యవహరించారు. కార్యదర్శి శ్రీమతి టి. సరస్వతీదేవి తమ నివేదికను సమర్పిస్తూ, నార్తు క్లబ్బు మహిళలు నిర్వహించిన కార్యక్రమాలను సవివరంగా పేర్కొని, తమ క్లబ్బుకు డిస్ట్రిక్టు కాన్ఫరెన్సులో 'బెస్టు ప్రెసిడెంటు' అవార్డు, సెక్రటరీ (మెరిట్) అవార్డు లభించాయని చెప్పారు. అనంతరం ముఖ్య అతిధి మాట్లాడుతూ, సేవా ధర్మం, ప్రేమాభిమానాలకు స్త్రీలకు పెట్టింది పేరనీ, అయితే సాధారణంగా స్వార్థం ఎక్కువ మందికి అడ్డుతగులుతూ వుంటుందని, అయితే ప్రతి వ్యక్తికి తన హృదయంలో ఎక్కడో ఒక దగ్గర కొద్దిపాటి త్యాగానికైనా తావుంటుందని, అది తెలుసుకుని ఆ వ్యక్తిని మనం ఆకట్టుకోవాలని, అపుడు ఆ వ్యక్తి యితరులకు ఉపయోగపడుతుందని అన్నారు. లయజన్ ఆఫీసరు (లయన్స నార్తు క్లబ్బు) శ్రీ ఎమ్. ఆర్. కె. శర్మ శ్రీమతులు శేషస్వామి, సరస్వతులకు మెమొంటోలను బహూకరించారు. ముఖ్య అతిధి ఆకుల కనకమ్మకు క్లబ్బు తరఫున కళ్ళద్దాలను, రాణీ చంద్రమణీదేవి ఆస్పత్రికి ఒక 'వాకర్'ను అందజేసారు. లయన్ లేడీ రేవతిశర్మ వందన సమర్పణ తర్వాత 'దొంగాటకం' నాటిక ప్రదర్శింపబడింది.

—విలేకరి

# టి. సరస్వతీదేవి

## "వికలాంగుల సేవే నా లక్ష్యం"

సమాజంలోని అంగవికలులు కూడా మానవ మాత్రులే అవి. వారికి కూడా సభ్య ప్రపంచంలోని తోటివారివలె జీవితం మీద ఆశ, అనురక్తి ఉంటాయని, సమానావకాశాలు కల్పిస్తే తమ శక్తి సామర్థ్యాలను నిరూపించుకొని వారు సమాజంలో నలుగురితో కలిసిమెలిసి జీవిస్తారని, వారిలోని మానసిక నైరాశ్యం, నిస్పృహలను పోగొట్టడానికి మనం దోహదం చేసి, అందుకు కావలసిన సహాయ – సహకారాలను, సానుభూతిని మనం వారికి అందజేయాలని అమెరికాలోని 'కనెక్టికట్'లో డెర్బీ–షెల్డన్ రోటరీ సమావేశంలో ఒకసారి మాట్లాడుతూ శ్రీమతి టి. సరస్వతీదేవి ఉద్బోధించారు.

వికలాంగులైన పిల్లలను, మానసికంగా వికాసం పొందనటువంటి పిల్లలను సాధారణంగా తలిదండ్రులు తమ దౌర్భాగ్యమని, దురదృష్టకరమైనటువంటి సంతతి అని భావించి, తీవ్రమైన మనోవేదనతో కృంగిపోతూ వుంటారు. అక్కడితో ఆగక ఆ పిల్లలను మరింత దుఃఖపరుస్తూ, కించపరచే మాటలు మాట్లాడుతూ వుంటారు. తత్ఫలితంగా ఆ తలిదండ్రులకు కూడా వికలాంగులైన సంతతికి జీవితమే దుర్భరంగా, అసంతృప్తిగా సాగుతూ వుంటుంది. అటువంటి వారికి సరియైన సలహాలు, ధైర్యమూ, సానుభూతి ప్రసాదించే వ్యక్తులు, సంస్థలు యీనాడు ఎంతో అవసరం!

శ్రీమతి సరస్వతి ఇలాంటి సేవా కార్యక్రమాన్ని తన జీవిత ధ్యేయంగా పెట్టుకొని, గత పది పన్నెండేళ్ళనుంచి విశాఖపట్నం రాణీ చంద్రమణీదేవి పిల్లల ఆసుపత్రిలో శిక్షకురాలిగా పని చేస్తున్నారు. అధునాతనమైన ప్రక్రియలతో అంగవికలులైన పిల్లలకు, మానసికంగా ఎదగని (లేక బుద్ధిమాంద్యం కలిగిన) పిల్లలను పరీక్షించి అనేక సలహాలను, సూచనలను యిచ్చి, వారికి తగిన శిక్షణ ఇచ్చి, సభ్య ప్రపంచంలో తోటి మానవులుగా నిలబెట్టి, వారి జీవితాన్ని ఫలప్రదంచేసి, ఆనందమయం చేయటానికి తోడ్పడుతున్నారు.

రోటరీ ఫౌండేషను సంస్థ అంతర్జాతీయంగా నిర్వహించిన ''స్కాలర్‌షిప్'' పోటీ పరీక్షలలో భారతదేశం తరపున శ్రీమతి సరస్వతి ఎన్నికై, విశాఖపట్నం రోటరీక్లబ్బు వారిచే ''రోటరీ ఫౌండేషను స్కాలరు''గా 1975–76 సంవత్సరంలో అమెరికాకు పంపబడి, ఉచిత వేతనం మీద కనెక్టికట్‌లోని న్యూ హేవెన్ స్టేట్ కాలేజీలో ఒక సంవత్సరంపాటు వికలాంగులకు శారీరకంగాను, మానసికంగాను ఆధునిక పద్ధతులలో చికిత్స చేయటంలో ప్రత్యేక శిక్షణ పొందారు. అంగవికలులకు చేసే శారీరక మానసిక చికిత్సా విధానాలను, వాటి ఆవశ్యకతతో పాటు తన అనుభవాలను వివరిస్తూ, స్టేట్సులోని అనేక రోటరీ క్లబ్బులలో, శిక్షణా కేంద్రాలలో ఉపన్యాసాలిచ్చి, తన వక్తృత్వంతో వారిని ముగ్ధులను చెయ్యడమేకాక, వారి బహుముఖ ప్రశంసలను అందుకొన్నారు. శ్రీమతి సరస్వతి తన ఉపన్యాసాలలో మనదేశంలోని స్త్రీల





ఔన్నత్యాన్ని గురించి, మన జీవిత విధానా· గురించి వారికి తెలియజేయడమేగాక మనదేశంలో అమలులో ఉన్న యోగాభ్యాసం శరీరారోగ్యానికి ఎంత అవసరమో కూడా వివరించి, తను స్వయంగా కొన్ని ప్రక్రియలను చేసి చూపించారు.

అమెరికాలోని ఆమె పర్యటన కార్యక్రమాలను, ఉపన్యాసాల సారాంశాలను ''ది న్యూ హేవెన్ రిజిస్టర్'', ''ది ఈవెనింగ్ సెంటినల్''– మొదలైన అమెరికా దేశపు పత్రికలు ప్రధానంగా ప్రచురించాయి. "ఎసెక్స్" పట్టణంలో ఆమె చేసిన ప్రసంగాన్ని గురించి తెలుసుకొని, భారతదేశంలో అమెరికా దేశపు రాయబారిగా పనిచేసిన మిస్టర్ చెస్టర్‌బౌల్స్ ఆమెను ఆహ్వానించి మూడు గంటలపాటు ఆమెతో ముచ్చటించారు. ఆ దేశపు టెలివిజన్, రేడియో కార్యక్రమాలలో కూడా ఆమె పాల్గొన్నారు.






శ్రీమతి సరస్వతీదేవి అమెరికా నుంచి స్వదేశానికి తిరిగివచ్చి, మన రాష్ట్రంలోని నాగార్జునసాగర్, చీరాల, ఏలూరు, రాజమండ్రి, తుని, అనకాపల్లి, శ్రీకాకుళం మొదలైన అనేక ప్రాంతాలలోనేకాక, ఒరిస్సాలోని పర్లాకిమిడి, బరంపురంలోని రోటరీ క్లబ్బులను కూడ సందర్శించి, సుమారు 35 క్లబ్బులలో ''వికలాంగులు మానసిక వికాసం లేని పిల్లలు–సమాజంలో వారి స్థానము – సంఘంలో వారికి పునరావాసము'' మొదలైన విషయాలపై ఉపన్యసించారు.



''మానసిక స్తబ్ధత – మనోవైకల్యం'' అనే విషయంపై గత సంవత్సరం నవంబరు నెలలో బెంగళూరులో జరిగిన ఆసియా దేశాల మహాసభ సందర్భంగా ఏర్పాటు చేసిన ప్రదర్శనలో విశాఖపట్నం రాణీ చంద్రమణిదేవి హాస్పిటలు తరపున శ్రీమతి సరస్వతిదేవి ఏర్పాటు చేసిన 'శిక్షణావసరాలైన పరికరాల ప్రదర్శన' స్టాలుకు ప్రథమ బహుమతి లభించింది. ఈ స్టాలులో శ్రీమతి సరస్వతి నిర్వహించిన అత్యాధునిక ప్రక్రియలకు, ముగ్ధులై పశ్చిమ జర్మనీలోని ''నేషనల్ సొసైటీ ఆఫ్ మెంటల్ రిటార్డేషన్'' చెయిర్మన్ శ్రీ టామ్ మట్టర్స్ తమ సంస్థ ఖర్చులపై ఒక సంవత్సరంపాటు మానసిక స్తబ్ధతకు సంబంధించిన ప్రీ స్కూలు, షెల్టర్డ్ వర్కుషాపు విషయాలలో పశ్చిమ జర్మనీ దేశస్థులు అనుసరిస్తున్న ప్రత్యేక పద్ధతులలో శిక్షణ పొందడానికి ఆమెను ఆహ్వానించారు.

గత సంవత్సరం ఆమె నిర్వహించిన కృషి ఫలితంగా ఎంతోమంది అంగవైకల్యం పొందిన బాలబాలికలకు వీల్‌ఛెయిర్, కుట్టుమిషను, కేలిపర్సు, కళ్ళద్దాలు మొదలైన పరికరాలు లయన్సు, రోటరీ సంస్థల సహాయంతో లభించాయి. విశాఖ రోటరీ క్లబ్బువారు వికలాంగుల పునరావాసానికై ప్రేమ సమాజంలో నిర్వహిస్తున్న ఉచిత సేవా కేంద్ర కార్యక్రమాలలో పాల్గొని, వికలాంగులైన పిల్లలను పరీక్షించి, తగిన చికిత్సా విధానాలను ఏర్పరచి, నిరాశకులోనైన వారి తలిదండ్రులకు తమ పిల్లల విషయంలో అనుసరించదగిన పద్ధతులను ఆమె తెలియజేస్తున్నారు.

శ్రీమతి సరస్వతి జీవిత విశేషాలను తరచి చూస్తే, స్వయం కృషితో మహిళలు సాధించలేనిది ఏదీలేదని మరొకసారి రుజువవుతుంది. ఆమె పశ్చిమ గోదావరిజిల్లా వేగేశ్వరం గ్రామంలో 1944 లో జన్మించారు. అక్కడ హైస్కూలు చదువు అనంతరం, ఏలూరు సెయింట్ థెరిసా కాన్వెంటులో టీచర్సు ట్రెయినింగులో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణురాలై విశాఖపట్నం పురపాలక సంఘ పాఠశాలలో ఉపాధ్యాయినిగా రెండేళ్ళ పాటు పని చేసి, అనంతరం రాణీ చంద్రమణిదేవి వికలాంగుల హాస్పిటలులో 1966 నుండి శిక్షకురాలిగా పని చేస్తున్నారు. తీరిక సమయాల్లో పై చదువులకు–పోస్టుగ్రాడ్యుయేటు కోర్సువరకూ–కృషి చేసి ఎమ్. ఏ. (పాలిటిక్సు) ద్వితీయ శ్రేణిలో పాసయ్యారు. ఆదే కాలంలో ఆంధ్రా యూనివర్శిటీ ''థియేటర్ ఆర్ట్స్'' విభాగంలో నాలుగు సంవత్సరాలపాటు శిక్షణపొంది 'నటన' లోనూ, 'దర్శకత్వం' లోనూ డిప్లొమాలను పొందారు. ప్రస్తుతం విశాఖ నార్తు లయన్ లేడీస్ క్లబ్బులో ముఖ్య కార్యకర్తగానూ, 'ఫెడరేషన్ ఫర్ ది వెల్‌ఫేర్ ఆఫ్ ది మెంటల్లీ రిటార్డెడ్ (న్యూఢిల్లీ)'లో జీవిత సభ్యురాలిగానూ, భారత రెడ్‌క్రాస్ మొదలైన అనేక స్వచ్ఛందసేవా సంస్థలలో సభ్యురాలిగానూ ఉండడంతోపాటు, విశాఖ నాటక కళాపరిషత్తులో కార్యవర్గ సభ్యురాలిగా కూడా ఉన్నారు. అవకాశం దొరికినప్పుడు, నాటకాలలో పాత్రలు అభినయించడం ఆమెకు హాబీ.

ఎప్పుడూ కళకళలాడుతూ, శాంతి సహనాలకు ప్రతీకగా కనపడే శ్రీమతి సరస్వతికి యిద్దరు కుమార్తెలు : భర్త శ్రీ లక్ష్మణరావు (హైస్కూలు టీచరు) అన్నివిధాల ఆమె వ్యావృత్తిలో తన సహకారాన్ని అందజేస్తున్నారు. ఆమె జీవితాశయం ఏమిటని అడిగినప్పుడు, శ్రీమతి సరస్వతి– ''జీవితాంతం వరకూ వికలాంగుల సేవే నా పరమ ధర్మం : ఆ లక్ష్యం కోసం నేను ఎంతయినా కృషి చేస్తాను!''–అని చెప్పారు.

—విలేకరి

"పోస్ట్..........."

పోస్ట్‌మాన్ విసిరిన కవరు కిటికీలోంచి రివ్వున దూసుకుని వచ్చి నేలమీద వాలింది.

వంటపని ముగించుకుని తీరుబడిగా కుర్చీలో కూర్చుని స్వెట్టరు అల్లుకుంటున్న "సీత" ఒక్క ఉదుటునలేచి ఒంగి కవరు అందుకుంది.

ఫ్రమ్ అడ్రస్ చూడగానే ఆమె పెదవులమీద సన్నటి చిరునవ్వు విరిసింది.

ఆ లేఖ మిత్రురాలు "సుధారాణి" దగ్గర నుంచి!

ముచ్చటగా మూడు సంవత్సరాలు వెనక్కి వెడితే సుధారాణి ఆమెకి కాలేజి మేట్!

ఇద్దరిమధ్య చెప్పుకోతగ్గ గొప్ప స్నేహం లేకపోయినా ఒకటే గ్రూప్ కావటంచేత మంచి పరిచయమే వుంది.

క్రిందటి నెలలో సీత తలవని తలంపుగా పిన్నికూతురు పెళ్ళికి తప్పనిసరిగా హైద్రాబాద్ వెళ్ళవలసి వచ్చింది!

పిల్లలకి పరీక్షలు, భర్తకి ఆఫీసుపని ఒత్తిడి వుండటంచేత పెళ్ళికి ఒంటరిగా వెళ్ళింది.

అదిగో....అప్పుడే పాతమిత్రురాలు సుధారాణి అనుకోకుండా కింగ్ కోటి సెంటర్‌లో కనుపించింది.

ఫుట్‌పాత్‌మీద నిల్చుని పువ్వులు కొంటున్న సీత....

"హలో సీతా! బాగున్నావా?" అన్న పలకరింపుతో ఆత్మీయంగా భుజంమీద చెయ్యి పడేసరికి వులికిపాటుతో తల తిప్పింది!

ఎదురుగా సుధారాణి!

"జ్ఞాపకం వున్నానా?" నవ్వుతూ పరామర్శించింది సుధ.

సీత కళ్ళు గుర్తింపుతో సంతోషంగా మెరిశాయ్!

కాలేజీ రోజుల్లో బొట్టు, గాజులు లేకుండా పెద్ద పెద్ద ఇయర్‌రింగ్స్‌తో, పల్చటి ఖరీదయిన దుస్తుల్లో అల్ట్రా మోడరన్‌గా వుండే సుధారాణి—మెళ్ళో నల్లపూసల గొలుసు, ముక్కుకి ఒంటి ముత్యం పుల్ల, చెవులకి పెద్దసైజు దుద్దులు, ఒంటికి అందంగా అమరిన గద్వాల్ పట్టుచీరతో ఎదురుగా నిలబడేసరికి సుమిత్రకి మతి తప్పినంత పని అయి కళ్ళు సంభ్రమంతో విచ్చుకున్నాయి!

"హలో సుధా! నువ్వా! జ్ఞాపకం లేకేం? కాని....చా....లా....మారిపోయావ్?" అంది ఆశ్చర్యంతో పరిశీలనగా చూస్తూ.

సన్నగా నిండుగా నవ్వింది సుధారాణి.

ఆ విధంగా పలకరింపులు అయిన తరువాత వద్దు వద్దు అంటున్నా వినకుండా పట్టుబట్టి సీతని బషీర్‌బాగ్‌లో వున్న తమ ఇంటికి తీసుకుని వెళ్ళింది సుధారాణి.

భర్త ఆఫీసరు!

పెద్ద బంగళా, టెలిఫోన్, ఖరీదయిన ఫర్నిచరుతో ఇల్లు చాలా అందంగా అధునాతనంగా వుంది. ప్రతి వస్తువు ఆ యింటి హోదాని చాటి చెపుతోంది.

సుధారాణి అగర్భ శ్రీమంతుల బిడ్డ! అందువల్ల ఆ గృహ వాతావరణం సీతకి ఆశ్చర్యాన్ని కలిగించలేదు! కానీ....

అహంకారంతో మిడిసిపడుతూ, గర్వంగా అప్టుడేట్‌గా వుండే సుధారాణిలోగల ఈ సౌమ్యానికి, కలుపుగోలుతనానికే విస్తుపోవాల్సి వస్తోంది!

"సీతా! మా యింట్లో రెండురోజులు వుండకుండా వెళ్ళటానికి వీలులేదు...." శాసించినట్లు పట్టుపడుతూ అంది సుధారాణి.

"ప్లీజ్! ఈసారికి వదిలేయి సుధా! ఇంకోసారి తప్పకుండా వస్తాగా! పిల్లలకి పరీక్షలు, ఆయనకి ఆఫీస్ ఆడిట్ జరుగుతోంది. ఇంక తప్పనిసరిగా పెళ్ళికి రావల్సివచ్చింది..." అంది ఇబ్బందిగా సీత.

ఆ రాత్రి అక్కడే భోజనం చేసింది.

"వంట – భర్త – పిల్లలు....దీజ్ ఆర్ ఆల్ నాన్సెన్స్ టాపిక్స్ ఐ హేట్ దెమ్...." అని చీదరించుకునే సుధారాణి ఆనాడు స్వయంగా వంటచేసి వడ్డించటం మరీ వింత అనిపించింది.

"ఆ దేమి టే? ఇంత పెద్ద ఆఫీసరుగారి భార్యవి...వంటమనిషి లేదా?"

మళ్ళీ సుధ దగ్గర్నుంచి చిరునవ్వే సమాధానం!

మొత్తంమీద ఆరోజు చాలా మర్యాదే చేసింది. పాత స్నేహితురాలికి ఎంతో ప్రేమతో ఆతిథ్యమిచ్చింది.

ఇంతలో భర్త వస్తే పరిచయం చేసింది.

అతడు కూడా ఆఫీసరు హోదాలో చాలా హుందాగా నిగర్వంగా అనిపించాడు. ఇద్దరు పిల్లలు! ఆ సంసారం చూడ ముచ్చటగా కనువిందు చేసింది సీతకి.

సీత వచ్చేస్తుంటే బీరువా తెరిచి జాకెట్టు బట్ట, పూలు అందించింది సుధారాణి.

మిత్రురాలి అభిమానానికి ఆర్ద్రతతో సీత మనసు మూగబోయింది.

"స్నేహంలో ఇంత తియ్యదనముంటుందా?"

"సీతా! అప్పుడప్పుడు లెటర్సు వ్రాస్తూ వుంటావుగా?" ఆప్యాయంగా చెయ్యి పట్టుకుంది సుధారాణి!

"..........."

"ఏమిటే సీతా! మాట్లాడవ్? అస్తమానం నేను వాగటమేనా?"

"ఛ....ఛ....అదికాదే! ఇన్నేళ్ళ తరువాత తిరిగి మనమిద్దరం ఇలాగ కల్సుకోవటం. నిజంగా నాకు చాలా ఆనందంగా వుంది. కాని...."

"చెప్పు! సందేహం దేనికి?"

"కాని... అప్పటి సుధకి ఇప్పటి సుధకి చాలా తేడా కనుపిస్తోంది నాకు. ఆ అలవాట్లు ఆ పోలికలు నీలో ఇప్పుడు కాగడాపెట్టి వెదికినా కనుపించటం లేదు! పదహారణాల తెలుగు పడుచులాగ మారిపొయ్యావ్...."

సన్నగా నవ్వింది సుధారాణి.

ఒక్కసారి ఎదురుగా టేబిల్ మీద కేస్‌లో వున్న భర్తఫొటో కేసి దృష్టి తిప్పుకుంది.

"నిజమే సీతా! ఒకోసారి ఇప్పుడు నన్ను తల్చుకుంటే నాకే ఆశ్చర్యం అనిపిస్తుంది. బాహ్యంగానే కాదు. నాలో మానసికంగానూ మార్పు వచ్చింది. మన పాత ఫ్రెండ్సు ఎవరు కనుపించినా ఆ మాటే అంటున్నారు. ఒక్కటి చెప్పు. పరిస్థితులకి అనుగుణంగా మనం మారటంలో తప్పు వుందంటావా?" కళ్ళెత్తి ప్రశ్నించింది.

"అలాగ నేను ఎందుకు అంటానే! మార్పు మానవ సహజం! పరిస్థితులకి అనుగుణంగా మనం మారకపోతే జీవితం నరకసదృశం అవుతుంది...."

"అందుకే....అందుకే నేను మారాను సీతా! ఈ మార్పు నాలో మనస్ఫూర్తిగా వచ్చింది. జీవితాన్ని నరకం చేసుకున్నా స్వర్గం చేసుకున్నా నా చేతుల్లోనే వుంది అని అన్నట్టుగా ఇప్పుడు

నా సంసారం స్వర్గధామం। అదంతా చెప్పాలంటే పెద్ద కథ।'' నవ్వింది సుధారాణి.

''నీకు ట్రైన్‌కి టైము అవుతోంది కదా? వివరంగా లెటర్ వ్రాస్తాలే....'' అంది చెయ్యి మృదువుగా నొక్కుతూ.

అంతే।

ఆ తరువాత సీత వచ్చెయ్యటం తీరిక చేసుకుని క్షేమ సమాచారాలతో సుధకి ఉత్తరం వ్రాయటం జరిగింది. ఇవాళో రేపో ఆమె దగ్గర్నుంచి సమాధానం వస్తుందని ఎదురుచూస్తూనే వుంది. ఇదిగో....ఇప్పుడు రానే వచ్చింది।

*

చేతిలోని అల్లిక సూదులు ప్రక్కకి పెట్టి కుతూహలంగా కవరు విప్పింది సీత.

ఆమె కళ్ళు చురుగ్గా అక్షరాల వెంట పరుగులు పెట్టాయ్.

''ప్రియమైన సీతా।'' అంటూ మొదలైన ఆ లేఖ ఉభయకుశలోపరితో ప్రారంభమై సంసార విషయాల్లోకి దిగింది.

సీతా।

నేను చాలా మారానని ఆ రోజు నువ్వు అన్నావ్। నువ్వేకాదు. గతంలో నన్ను తెలిసిన ప్రతి ఒక్కరు ఆ మాటే అంటున్నారు.



# ఆప్యాయత

కాకాని కమల

నా జీవితంలో జరిగిన కొన్ని ముఖ్యమైన సంఘటనలు నీ ముందు పెడితే నాలో మార్పుకి కారణం నీకు తెలుస్తుంది.

నేను మా పుట్టింట ఎంత అపురూపంగా పెరిగానో నీకు తెలుసు. పనిమనిషి కాఫీ కప్పు సహితం మంచం దగ్గరికి అందించేది. మంచి నీళ్ళతో సహా అమిరాకనే భోజనం బల్ల ముందు కూర్చునేదాన్ని. ఒక్కర్తినే ఆడపిల్లనని అమ్మ నాన్న కూడా బాగా గారాబం చేశారు. అందుకు ఐశ్వర్యం దోహదం అయ్యింది. వంట చెయ్యటం అన్నా మన పాత పద్ధతులు అన్నా నాకు తగని తలనొప్పి.

డబ్బు నీళ్ళలా ఖర్చు పెడుతూ సినిమాలు పార్టీలు, పిక్‌నిక్‌లు అంటూ స్టూడెంట్ లైఫ్‌ని ఎంజాయ్ చేశాను.

వివాహం అయి వేరింటి కాపురం పెట్టినా ఆ అలవాట్లు మార్చుకోలేకపోయాను. నేను వెళ్ళేసరికే ఆయనకి వంట మనిషి, పని మనిషి వున్నారు. వంటమనిషిని మానిపిద్దామని ఆయన అంటే నేను ఒప్పుకోలేదు. అందువల్ల తిరిగి నా అలవాట్లు నిరాఘాటంగా కొనసాగాయి. కొత్త వూరు అయినా అతి త్వరలోనే క్లబ్బులూ మహిళా సమాజాలవారితో అనుబంధం కుదిరి "సోషల్ వర్క్" పేరిట బాధ్యత పెరిగింది. తత్ఫలితంగా మా ఇద్దరి మధ్య అభిప్రాయభేదాలు! మనస్పర్థలు! తియ్యగ సాగిపోవాల్సిన మా జీవనరాగం అపశృతి పలికింది.

ఆయన మధ్యాహ్నం భోజనానికి వచ్చినపుడు నేను ఏ రోజూ ఇంట్లో వుండేదానను కాను. వంటవాడే వడ్డించి చూసుకునేవాడు! ఈ విషయంలో ఆయన నన్ను రెండు మూడుసార్లు మందలించారు. అయినా నేను లక్ష్యపెట్టలేదు. అంతే! నా నిరసనకి ఆయన బాగా గాయపడ్డారనుకుంటాను. మా మధ్య కలతలు రేగాయి: క్రమంగా ఆయన మధ్యాహ్నం భోజనానికి ఇంటికి రావటం మానివేశారు. రోజూ కేంటిన్‌లో తింటున్నారని తెలిసి నిలదీశాను.

"మీరు మధ్యాహ్నం భోజనానికి ఇంటికి ఎందుకు రావటం లేదు?"

"నాకు ఇంటికి హోటలుకి తేడా ఏముందని? ఈపాటి కూడు అక్కడే ఏ హోటలువాడు అయినా పెడతాడు...." అన్నారు. నాకు కోపం వచ్చింది.

"అంటే? మీ దృష్టిలో ఇంటికి ఒక విలువ అంటూ లేదన్న మాట?"

కనుబొమలు ముడిచి సూటిగా నా కేసి చూశారు.

"ఆ విలువ నువ్వు వుండనిస్తేకదా. సుధా! సత్రపు భోజనం మఠం నిద్ర అన్నట్లు బ్రహ్మచారిగ నా జీవితం ఎలా గడిచిందో నువ్వు వచ్చాకా అలాగే గడుస్తోంది. ఆ వంట మనిషి వంట తిని తిని నా నాలిక చచ్చుబడిపోయింది. పెళ్ళి చేసుకున్నాను. నా ఇల్లాలు నా ఇంటికి వచ్చింది కదా అని ఎన్నో ఆశలు పెట్టుకున్నాను. నేను వచ్చేసరికి ఏ రోజైనా నువ్వు ఇంటిపట్టున వున్నావా? నువ్వు వంట చెయ్యకపోతే పోనీ...! ఈ ఆరునెలల్లో ఏ రోజు అయినా నా దగ్గర వుండి నీ చేతుల్తో కొసరి కొసరి వడ్డించావా? నా అవసరాలు కనుక్కున్నావా? నేను ఆఫీసుకి వెళ్ళేవరకు నా వెంట వుండి నా అక్కరలు గమనించటం నీకు అవమానం! నా కోటుగుండి కుట్టిపెడితే నీకు నామోషి! నా పెన్ను వెతికిపెట్టటం బానిసత్వం! మొన్న కర్చిఫ్ కనుపించకపోతే కొత్తది కొనుక్కున్నాను. తరచూ పైపిన్స్ పోతున్నాయ్! నీ దృష్టిలో ఇలాంటి పన్లు అన్ని బానిసత్వం కిందికి వస్తున్నాయి. భర్త అవసరాలు చూడటం తప్పా! ఇలాంటివి అడిగి అధికారంతో చేయించుకునేవి కాదు. ప్రేమ అభిమానంతో నీకుగా నువ్వు చెయ్యాల్సినవి! మొన్నటికి మొన్న నా పర్సులో డబ్బు పోయింది. ఇది నాలుగవసారి పోవటం! నీకు తియ్యాల్సిన అవసరం లేదు. కాని ఎవర్ని అని అడగను? ఇంట్లో తరచూ ఖరీదయిన చిన్న చిన్న వస్తువులు మాయం అవుతునే వున్నాయ్. పనివాళ్ళ మీద ఆధారపడితే ఇంతే! మొన్నటిదాకా పెళ్ళి చేసుకుంటే ఈ బాధలు వుండవు. నిశ్చింత అనుకునేవాడ్ని! కాని నువ్వు వచ్చాక నాకు జరిగింది ఏమిటి? నీకు భర్తకంటె గృహ బాధ్యత కంటే క్లబ్బులు, సంఘసేవా ముఖ్యం! వున్నది మనం ఇద్దరం మనుష్యులం అయినా లెక్కకి మించిన దుబారా జరుగుతోంది. నా యిల్లు– నా సంసారం అన్న అపేక్ష నీకు లేకపోయిన తరువాత నేను ఎంతకని పట్టుకుని ప్రాకులాడను? మధ్యాహ్నం పూట ఎండనిపడి ఆ స్కూటరు మీద అంతదూరం నుంచి ఎంతో ఆకలితో వచ్చేవాడిని. నువ్వు ఆప్యాయంగా వడ్డిస్తే నీతో



యాళ్ళబండి శారదాదేవి

హరికథలు చెప్పడంలో–కొన్ని దశాబ్దాల క్రితం స్త్రీలు కూడా బాగా కృషిచేశారు. రాను రాను, హరికథ కళకు ప్రోత్సాహం తగ్గిపోతున్నట్టే, స్త్రీలకు కూడా ఆ కళలో ఉత్సాహం సన్నగిల్లుతూ రాసాగింది. అయినా, అలాంటి ఉత్సాహం వున్నవాళ్ళు అక్కడా అక్కడా లేకపోలేదు. అందులోనూ పెద్ద చదువులు చదువుకుని, హరికథలు చెప్పడంలో ఉత్సాహం చూపేవారు చాలా అరుదు- అని కూడా చెప్పవచ్చును. కుమారి యాళ్ళబండి శారదాదేవి అలాంటి అరుదైన వనిత. ఆమె ఈ విద్యను తండ్రిగారైన యాళ్ళబండి తాతారావు భాగవతార్‌గారి దగ్గర మంచి సంక్రమింపజేసుకున్నది. తాడేపల్లి గూడెం, భీమవరం కళాశాలలలో చదువుకుని, శారదాదేవి ఎమ్.ఎ పట్టం పుచ్చుకున్నది.

రామాయణం, భారతం, భాగవతాలలో వున్న కథలనే కాకుండా, దేశ నాయకుల చరిత్రలను కూడా హరికథా విధానంలో చెబుతూ, ప్రేక్షకులను రంజింపజేస్తుందామె. చాలా వూళ్ళలో వివిధ సందర్భాల్లో శారదాదేవి హరికథలు జరిగాయి. ప్రేక్షకుల్లో వున్న స్త్రీలనూ, వృద్ధులనూ, పిల్లలనూ అందర్నీ రంజింపజేస్తూ 'కథ అప్పుడే అయిపోయిందా' అన్న భావాన్ని శారదాదేవి కలగజేస్తుందని–ఆమె కథలు విన్నవాళ్ళు అభిప్రాయపడతారు. శారదాదేవికి, 'కథా గాన కళావిశారద' అన్న బిరుదు కూడా వున్నది.

కలిసి తినాలని కోరుకునేవాడ్ని. కాని నాకు మిగిలింది నిరాశ! సాయంత్రాలు ఆఫీసు నుంచి తొందరగా ఇంటికి వస్తే నువ్వు ఇంట్లో వుండేదానివికాదు! అప్పుడు నా మనస్సు ఎలా వుంటుందో ఆలోచించు! భార్యాభర్తల మధ్య బానిసత్వం అన్న భావం వుంటే ఆ దాంపత్యమే దెబ్బతింటుంది.''

''...............''

''పెళ్ళాం పిల్లల్ని పట్టించుకోకుండా క్లబ్‌ల వెంట, లాడ్జింగుల వెంట తిరిగే తాగుబోతు భర్తల గురించి మహిళా మండలిలో ఉపన్యాసాలు ఇచ్చేముందు–భర్త, సంసారం పట్టకుండా సంఘ సేవ అంటూ రోడ్లు పట్టుకుని తిరిగే నీలాంటి ఆడవాళ్ళ గురించి కూడా ఆలోచిస్తే బాగుంటుంది. నీకు ఆర్థిక స్వాతంత్ర్యం వుంది. లక్షాధికారి కూతురివి. ఇరవయ్యవ శతాబ్దపు చదువుకున్న ఆడపిల్లవి! భర్తని లెక్క చెయ్యవలసిన అవసరం ఏమిటి? సంసార తాపత్రయం నీకెందుకు?....'' అన్నారు ఆత్రంగా.

సీతా! ఎంతో సౌమ్యంగా లాలిత్యంగా వుండే ఆయనలో అంతటి ఆవేశం నన్ను ఆశ్చర్య చకితను చేసింది.

కొత్తలో నా తిరుగుళ్ళకి అలవాట్లకి ఆయన ఆక్షేపణ తెలిపారు. అభ్యంతరం చెప్పారు. అయినా నేను లక్ష్యపెట్టలేదు.

నేను గతిలేక ఆయింటికి రాలేదని అరలక్ష కట్నంతో వచ్చానని చెప్పాను.

అంతే!

ఆయన మళ్ళి నా జోలికి రాలేదు. నన్ను ఏ విషయంలోనూ పట్టించుకుని అదేమని ప్రశ్నించలేదు.

కాని....కాని....మా యిద్దరి మధ్య క్రమంగా దూరం పెరిగింది. ఆయన క్లబ్‌కి అలవాటు పడ్డారు. ఒక్కోరోజు అర్ధరాత్రి దాకా పేకాడి ''డ్రింక్'' చేసి వచ్చేవారు. అదేమని అడిగే అర్హతని పోగొట్టుకున్నాను.

సరిగ్గా ఈ వాతావరణంలోనే మా యింటి గెస్ట్ హవుస్‌కి ఒక జంట కాపురానికి వచ్చారు.

అతడు చాలా చిన్న ఉద్యోగి. భార్యా ఇద్దరు పిల్లలతో చాలా పొదుపుగా అతి సామాన్యంగా వుండేవారు. ఏ పండగకో సినిమాకి అరుదుగా వెళ్ళేవారు. అతని భార్యకి మంచి బట్టలుగాని చెప్పుకోతగ్గ నగలుగాని లేవు. అయినా ఎప్పుడూ సంతోషంగా నవ్వుతూ వుండేది. సహజ సౌందర్యంతో సంసారపక్షంగా శాంతంగా వుండేది. ఇంటిపన్లు అన్నీ........స్వయంగా చూసుకునేది. దంపతులు ఇద్దరూ పాలూ–తేనెలా అన్యోన్యంగా వుండేవారు.

మా మేడ మీద నిల్చుంటే వాళ్ళ సంసారం మొత్తం చూడవచ్చు.

రాత్రిళ్ళు పెరట్లో చాపలు పరుచుకొని పడుకునే వారు. వెన్నెట్లో కబుర్లు చెప్పుకుంటూ భోజనాలు చేసేవారు.

ఒక రోజు ఈయనతో అన్నాను :

''అతనికి అంత తక్కువ జీతం కదా–అయినా కొంచెం కూడా చింతపడినట్లు కనుపించడు! ఎప్పుడు చూసినా నవ్వుతూ కనుపిస్తాడు!'' అన్నాను యధాలాపంగా.

''ఆ అదృష్టం మాత్రం ఎంతమందికి వుంటుంది? డబ్బుదేముంది సుధా! అతనికి అంత అనుకూలవతి అయిన భార్య వుంటే నిశ్చింతకాక మరి ఏమిటి? మగవాడు బయట ఎన్ని బాధలు పడినా ఎంత శ్రమపడినా ఇంటికి వచ్చేసరికి ఇల్లాలి ఆప్యాయత–ప్రశాంతమైన చల్లని వాతావరణం వుంటే ఎంత అశాంతినైనా మర్చిపోవచ్చు........'' అన్నారు. అప్రయత్నంగానే ఆ అమ్మాయి నడవడిని సౌమ్యతని మెచ్చుకున్నారు. అంతేకాదు. వీలు చిక్కినప్పుడల్లా ఆ అమ్మాయి కేసి చూడటం, ప్రశంసించటం నేను గమనించాను.

సీతా! ఆయన దృష్టిలో ఆ అమ్మాయి ఒక దేవత. ఆమెతో జీవితం ఒక స్వర్గధామం!

ఆయన సహృదయంతోనే ఆమెని మెచ్చుకునే వారేమో....

కాని ఆయన అంతరాంతరాలలో ఆమెపట్ల ఆరాధనభావం వుందేమోనన్న అసూయ నా మనసుని రగిలించింది. ''అలాంటి భార్య కోసం ఆయన తపిస్తున్నారా?'' అన్న ఆలోచన నన్ను దహించింది. ఆయన నాకు దూరం అవుతున్నారేమోనన్న బాధ అప్పటికే నాలో రాజుకుంటున్నది. కాగా నా ఎదురుగానే ఒక సామాన్యమైన అమ్మాయిని ఆయన మెచ్చుకోవటం సహించలేకపోయ్యాను. నా వ్రేలితో నా కన్ను నేనే పొడుచుకుంటున్నానేమో! చేజేతులా నా సంసారాన్ని నేనే కూలద్రోసుకుంటున్నానేమో నన్న మథన చెలరేగింది. నాలో అంతవరకు నిద్రాణమైవున్న వివేకం తట్టి పిలిచినట్లుగ మేల్కొంది.

''భర్తకి వండిపెట్టటం బానిసత్వం అని స్త్రీలు, భార్యా బిడ్డల్ని పోషించటం ఊరికే వుపకారం అని పురుషులు అనుకోవటం ఎంత అవివేకం! సృష్టిలో స్త్రీకి పురుషుడు–పురుషుడికి స్త్రీ బానిసలే. ఆ బానిసత్వంలోనే అందం వుంది. ఆనందం వుంది.'' అని తెలుసుకున్నాను.

అంతే!

నేను మారాను.

ఒక నెల్లాళ్ళపాటు వంటమనిషి దగ్గర వంట నేర్చుకున్నాను. తరువాత ఆయన్ని సంప్రదించకుండానే వంట మనిషిని మానిపించాను.

తరువాత నా చేతుల్తో నేను వంట చేసిపెట్టిన రోజు ఆయన కళ్ళల్లో కనుపించిన ఆనందం, ప్రశంసా నేను జన్మలో మరువలేను!

**అపూర్వ సోదరులు!**

ఈ మధ్య పశ్చిమ జర్మనీలోని ఒక న్యాయస్థానంలో చిత్రమైన ఉదంతం బయటపడింది. ఒక జర్మన్ యువతికి తన దేశస్థుడితోనూ, అమెరికన్ నీగ్రో సైనికుడితోనూ కొంతకాలంగా సంబంధం వుండట. వారిరువురి వల్లా ఆమె ఇద్దరు కవల పిల్లలను కన్నది. అందులో ఒకడు తెల్లగానూ మరొకడు నల్లగా నీగ్రోలాగానూ జన్మించారు! ఆ కవల పిల్లలలో తెల్లబ్బాయి జర్మన్ దేశస్థుడి కుమారుడేనని వాదించి–విఫలురాలయి–చివరికి కోర్టులో కేసు పెట్టింది–ఆ యువతి. అతను ససేమిరా తన కొడుకు కాదని వాదించాడట. కోర్టువారు కూడా అతని తరపున తీర్పు యిస్తూ ఆమె పిటీషను త్రోసి పుచ్చారు. అందుకు కారణం ఆ యువతికి అదే సమయంలో ఎందరో యువకులతో సంబంధం ఉండడమే నట! దాంతో ఆ యువతి మరో యువకుడిని వివాహం చేసుకుంది. ఆ కవల పిల్లలిద్దరికీ రక్షణ కల్పించబడింది. కాని సైంటిస్టులు మాత్రం అసలీ విపరీతం ఎలా సంభవించిందా అని తీవ్రంగా ఆలోచిస్తున్నారట. ఆమె కవల పిల్లలను ఆ విధంగా కనడానికి కారణం–ఒకే రోజు ఆ తెల్ల జర్మన్, నల్ల అమెరికన్ నీగ్రో వ్యక్తుల సంతాన కణాలు ఆమె గర్భాశయంలోని 'ఓవమ్'తో ఐక్యత చెందడమేనని వారు భావిస్తున్నారట. ఏమైనా ఇది విచిత్రమే!

కాని ఆనాటి నా వంటకాల్లో చాలా లోపాలు వున్నాయి. ఆయన సంతుష్టిగా తినలేకపోయారేమో అనిపించి "ఫ్రిజ్"లోంచి పళ్ళు తెచ్చి అందించాను.

"నిజం చెప్పండి. మీకు కడుపు నిండలేదు కదూ?" నిస్సహాయతతో నా కళ్ళు తడిశాయ్.

"ఛ....ఛ....ఆదేం పని?" అంటూ ఆప్యాయంగా ఆయన నా చేతిని పట్టుకున్నారు.

"సుధా! నీ పేరులోనే కాదు. నీ చేతుల్లోనే అమృతం వుంది. ఈ రోజు వంట పెద్దగా బాగుండని మాట వాస్తవమే. కాని నువ్వు దగ్గర వుండి తినిపిస్తుంటే ఎంత ఆనందంగా వుందో చెప్పలేను. ఇంతటి ఆప్యాయత వంటవాళ్ళు వడ్డిస్తే వస్తుందా చెప్పు? ప్రాక్టిస్ మేక్స్ ఎ మాన్ పర్‌ఫెక్ట్ అన్న సామెత వినలేదా? క్రమంగా నీకే అలవాటు అవుతుంధి" అన్నారు.

సీతా! అదిగో....అప్పటి నుంచే నా జీవన సరళి మారిపొయ్యింది. ఆ మార్పు నాలో మనస్ఫూర్తిగా స్వచ్ఛంగా వచ్చింది. అందుకే ఇంత ఆనందం. ఇప్పుడు ఆయనకి నా మాటే వేదం. నాకు ఆయన తోటే లోకం!

అంతటి అప్టుడేట్ గరల్ సుధారాణి ఏమిటి? అమ్మమ్మ లాగ మాట్లాడుతోంది? అనుకుంటున్నావా?

సీతా! నిజం చెప్పాలంటే మన అమ్మమ్మలు బ్రతికినంత నిశ్చింతగా ఇప్పుడు మనలో ఎంత మంది జీవిస్తున్నారంటావ్?

ఇప్పటికే చాలా పెద్ద ఉత్తరం అయిుంది కదూ! మరి వుంటా. ప్రేమతో నీ

సుధారాణి—"



ఉత్తరం చదవటం పూర్తి చేసిన సీత పెదవులు చిరునవ్వుతో అందంగా వంపు తిరిగాయ్.

"సీతా! మై స్వీట్! ఆకలి మండిపోతోంది. తొందరగా భోజనం వడ్డించేయ్. లేకపోతే...." హడావుడిగా లోపలికి వస్తున్న భర్తగారి కేకలతో ఈ లోకంలోకి వచ్చింది సీత.

"అరే! తమరు అప్పుడే వచ్చేశారే?" అంటూ ఉత్తరం టేబిల్‌పై వుంచి, ఒక్క ఉదుటన మరింత ఉత్సాహంతో వంట గదిలోకి పరిగెత్తింది. సీత – ఉత్తరంలోని విషయాలను మననం చేసుకుంటూ. □

## పద్మాల ముగ్గు

ఇది ఎండాకాలం. అంటే సూర్యుడి ప్రభావం ఎక్కువగా గల కాలం. సూర్యుడు అంటే ఈ కాలంలో మనం చిరాకుపడినా, తామర పువ్వులకు మాత్రం ఎప్పుడూ సూర్యుడంటే ప్రియమే. అందుకనే ఈ ఎండాకాలంలో మరొక రకమైన పద్మాల ముగ్గు. ఇది వెయ్యడానికి – ముందుగా పదహారు చుక్కలు అడ్డంగా పెట్టుకోవాలి. తర్వాత ఒక్కొక్క చుక్క తగ్గిస్తూ–(15, 14, 13, 12 అలా) ఒక చుక్క వచ్చేవరకూ పైనా కిందా చుక్కలు పెట్టుకోవాలి. తర్వాత బొమ్మలో చూపినట్టుగా ఒక పద్మాన్ని చుక్కలతో కలిపి, అలాగే తక్కినవీ కలపాలి. —రాజీ హరిశ్చంద్ర (బి.ఎస్‌సి)



ఈ నెలనుంచి 'పుట్టిన రోజులు' శీర్షికలో ఒక మార్పు జరుగబోతున్నది. దీని ప్రకారం, ఏడాది, రెండేళ్ళు, మూడేళ్ళు వయసు గల పిల్లల ఫోటో లను విడివిడిగా ఒక్కో గ్రూపునుంచి ఎన్నిక చేసి, మూడు 'బహుమతులు' పంపుతాము. అయితే, ఈ సారి మూడేళ్ళ గ్రూపులో ఏమాత్రం సంతృప్తికరమైన ఫోటోలు రానందు వల్ల ఏడాది, రెండేళ్ళ వారిని మాత్రం ఎన్నిక చేసి "పుట్టిన రోజు కానుక"లు పంపుతున్నాము. ఏడాది పిల్లల్లో అజయ్‌బాబు, రెండేళ్ళ వారిలో ఇమ్మానేని మాధురి ఎన్నికైనారు. మొత్తం అన్ని గ్రూప్సలోనూ ఆరోగ్యంగా కనిపించే మరో ముగ్గురి బాలల ఫోటోలను విడిగా ప్రచురిస్తున్నాము. ఆగస్ట్ సంచికలోని ఈ శీర్షికకు ఫోటోలు పంపేవారు–కావలసిన వివరాలతో, జూలై 5వ తేదీలోగా మాకు చేరేలా పంపాలి.






ఇమ్మానేని మాధురి (మచిలీపట్నం) పుట్టిన తేదీ 30-7-76 తల్లిపేరు : ఇమ్మానేని శిరీష

అజయ్‌బాబు (బెంగళూరు) పుట్టిన తేదీ : 5-7-77 తల్లిపేరు : వి. బింబ

ఈసిరికల సతీష్ (విజయనగరం) పుట్టిన తేదీ : 24-7-77 తల్లిపేరు : వి. గౌరీమల్లిక్





యమ్. అనిల్‌కుమార్ (హైద్రాబాదు) పుట్టిన తేదీ : 14-7-76 తల్లిపేరు : యమ్. విశాలి

యమ్. వెంకటరామకిరణ్ (పుల్లేటికుర్రు) పుట్టిన తేదీ: 4-7-77 తల్లిపేరు: మోపూరి గణ రాజేశ్వరి



# స్త్రీల చేతనే నడుప బడుతున్న
# విమెన్స్ ఇండియా ట్రస్ట్

మనదేశంలో స్త్రీలచే ప్రారంభింపబడి వారిచేతనే నడపబడుతున్న వ్యాపార సంస్థలు బహు కొద్ది. కాని ఉన్నంతలో అవి విజయవంతగానే నిర్వహింపబడుతున్నాయి. అందుకు చక్కటి ఉదాహరణ బొంబాయిలోని విమెన్స్ ఇండియా ట్రస్ట్.

ఈ సంస్థ పదేళ్ళ క్రితం స్థాపించబడింది. దీనిని స్థాపించడానికి మూలకారకురాలు కుమారి కామిలాత్యాబ్జి. ఆమె లండన్‌లో బారిష్టరుగా వుండేవారు. అప్పట్లోనే ఆమెకు వెనుకబడిన తరగతులవారికి ఏదో విధంగా సహాయపడాలనే ఆకాంక్ష వుండేది. తన మిత్రులతో ఈ విషయంపై చర్చలు జరిపిన తరువాత–ప్రథమ ప్రయత్నంగా విదేశాలలోని తోటి భారతీయులకు కావలసిన సహాయం అందించాలన్న నిర్ణయానికి వచ్చారు. అదే సమయంలో ఇంగ్లాండులో అప్పటి భారత హైకమీషనర్‌గా వుంటున్న శ్రీమతి విజయలక్ష్మి పండిట్ 'భారత స్త్రీల సమాఖ్య'ను ఏర్పాటు చేస్తే బాగుంటుందన్న సూచన చేశారు. ఆమె సలహా మేరకు 1960లో 'ఇండియన్ విమెన్స్ అసోసియేషన్' స్థాపించబడింది. ఈ నూత్న సమాఖ్యకు కామిలా అధ్యక్షురాలుగా ఎన్నికయ్యారు. దాంతో ఆమె భారతదేశానికి మరింత సన్నిహితమయ్యారు.

1962, 1965లలో జరిగిన యుద్ధ సంఘటనలు విదేశాలలోని భారతీయుల మధ్య ఐకమత్యానికి దోహదం చేశాయి. ఆ యుద్ధాలతోపాటు శరణార్థుల సమస్య కూడా ఉత్పన్నమయింది. అప్పటికే తన అమూల్య సమయంలో అధిక శాతం సంఘసేవకే వినియోగిస్తున్న కామిల–విదేశం నుంచి తను చేస్తున్న సహాయం కంటె స్వదేశంలో వుండే మరింత సహాయం చేయవచ్చునన్న నిర్ణయానికి వచ్చారు. దాంతో ఇంగ్లాండులో ఘనంగా సాగుతున్న తన ప్రాక్టీసుని విడిచిపెట్టి బొంబాయికి వచ్చారు.

భారతదేశానికి తిరిగివచ్చిన తరువాత కొద్ది నెలలపాటు ఆమెకు అంతా అగమ్యగోచరంగా కనిపించింది. ఇంగ్లాండులో ఉన్న రోజుల్లో క్షణం తీరిక లేకుండా గడిపిన కామిల స్వదేశానికి రాగానే మొదట్లో ఏంచేయాలో తోచని స్థితికి వచ్చారు. క్రమక్రమంగా ఆమె యిక్కడి పరిస్థితులు ఆకళింపు చేసుకోవడం ప్రారంభించారు.

1967లో బీహారులో బ్రహ్మాండమైన కాటకం ఏర్పడింది. జయప్రకాశ్ నారాయణ్ పిలుపు ఆమెను కదిలించి వేసింది. తక్షణం ఆమె పాట్నాకి ప్రయాణమయ్యారు. ఆ ప్రాంతాలలో పర్యటించిన తరువాత భారతదేశంలోని గ్రామీణ ప్రాంతాల దుస్థితి ఏమిటో అప్పుడు ఆమెకు బోధపడింది. వారికి స్వయం ఉపాధికల్పన గావించి సహాయపడాలన్న ఆలోచన ఆమెకు కలిగింది. 'తనకోసం దుస్తులు కుట్టుకునే వనిత జాతీయ ఆదాయానికి తోడ్పడదు. ఇతరుల కోసం దుస్తులు కుట్టే వనితే ఆ ఆదాయాన్ని అధికం చేస్తుంది'–అని ఆమె అనుకోవడం కూడా జరిగింది. దాంతో ఆమె ఒక 'కర్మాగారం' స్థాపించారు. దీని ఆధిపత్యమంతా ఏ ఒక్కరి చేతుల్లోనో కాకుండా అందులో పనిచేసేవారి చేతుల్లోనే వుంటుందన్నమాట. ఇందులో అధికారులూ, షేర్‌హోల్డర్స్ అంటూ వుండరు. వచ్చిన లాభాలన్నీ పరిశ్రమ అభివృద్ధికే వినియోగింపబడతాయి.



కామిల ఈ పరిశ్రమని పన్నెండువేల రూపాయల పెట్టుబడితో ప్రారంభించారు. ఈనాడు ఆమె నెలకి దాదాపు ఏడువేల రూపాయలదాకా వేతనాల రూపంలో యిస్తున్నారు. మనదేశంలోని నిరుద్యోగ సమస్యని ఎడారితో పోలిస్తే అందులో ఈ సహాయం గడ్డిపోచ అంతటిది కావచ్చును. అయినా ఈ గడ్డిపోచ అల్లిబిల్లిగా అల్లుకుని ఎడారంతా అలుముకుని ఏనాటికయినా సస్య శ్యామలం చేస్తుందన్న ఆశ కామిలకు లేకపోలేదు.

బొంబాయి సమీపంలోని పానవేల్‌లో ఆమె

మొదట ఈ కర్మాగారాన్ని ప్రారంభించారు. అందులో తయారు చేసిన పావడాలు మొట్టమొదటి రోజులలో స్నేహితులకు, ఇరుగు పొరుగు వారికి విక్రయించేవారు. రోజు విడిచి రోజు అక్కడికి–అవి చేయడంలో ఆరితేరినవారు వస్తూ వుండేవారు. వారు ఇళ్ళల్లోచేసి తీసుకువచ్చిన దుస్తులకి బట్టకింత చొప్పున అప్పటికప్పుడు మూల్యం చెల్లించబడేది. దాంతోబాటు చేతినిండా పని కూడా అప్పగించబడేది. ఇలా వచ్చిన వారిలో ముస్లింలు, హైందవులు, క్రిస్టియన్లు అందరూ వస్తూ వుంటారు. వీరిలో చాలామంది వివాహితలు. కొందరు వితంతువులు. మరికొందరు విడాకులు ఇచ్చి పుచ్చుకున్నవారు, భర్త విడిచిపెట్టిన వారు–యిలా ఎందరో ఆ కర్మాగారానికి ఉపాధి కల్పన కోసం వెళ్ళేవారిలో ఉన్నారు.



వీరందరికి వారి వారి నైపుణ్యాన్ని, ఉత్సాహాన్నిబట్టి పనులు అప్పగిస్తారు కామిల.

కేవలం పావడాల తయారీతో ప్రారంభమయిన ఈ 'కర్మాగారం'లో నేడు చక్కటి ప్రింట్లుగల నూలు దుప్పట్లు, టేబుల్ క్లాత్‌లు అనేకం తయారు చేస్తున్నారు. వీటికి భారతదేశంలోనే కాక విదేశాలలో కూడా విరివిగా ఆదరణ లభిస్తోంది. అదేవిధంగా జామ్, జెల్లి, స్క్వాష్‌ల అమ్మకం యిప్పుడిప్పుడే – బొంబాయి, ఢిల్లీ, బెంగళూరు, చండీఘర్‌లలో – చురుకుగా సాగుతోంది.

''మీరు తయారు చేస్తున్న వస్తువుల అమ్మకం సులభంగా జరుగుతోందా?'' అని ప్రశ్నిస్తే ''లేదు'' అని సమాధానం చెప్పారు కామిల.



''మొదటి నుంచి మా వస్తువులు స్వయంగా అమ్మితే తప్ప లాభం లేదన్న విషయాన్ని గ్రహించాము. అందుకే హార్కన్స్ వీధిలోని ఒక స్నేహితుని గృహంలో మేము వాటి అమ్మకం ప్రారంభించాము. ఆ తరువాత 'ధర్మశాల'లో ఒక దుకాణం తీసుకున్నాము. దరిమిలా బ్రిటిషు స్త్రీల సమాఖ్య నడుపుతున్న ఒక అనాథ శరణాలయంలో మాకు జామ్స్, మార్మలేడ్ తయారు చేసుకునేందుకు వీలుగా ఒక గది యిచ్చారు. ఈ లోపల మా వస్తువుల అమ్మకం విరివిగా జరగడం ప్రారంభమయింది. ఒకరోజు బొంబాయిలోని ఎయిర్ కండిషన్డ్ మార్కెట్టులో ఒక దుకాణం అమ్మకానికి వుందన్న విషయం తెలిసింది. అందుకు కావలసిన ధనం సమకూర్చుకోవడం ఒక పెద్ద సమస్య అయిపోయింది. దాంతో చందాల సేకరణ, ఛారిటీ షో, ఫ్యాషన్ షోలు ఏర్పాటు చేశాము'' అని చెప్పారు కామిల.

చివరికి ఎలాగయితేనేం 1973లో వారు సొంత దుకాణం సమకూర్చుకోగలిగారు. ఈనాడు ఆ భవనంలో వారికి ఏడు గదులు వున్నాయి. వీటికి తోడు జామ్‌లు జ్యూస్‌లూ తయారు చేయడానికి వీలుగా ఒక చిన్న వంటగది కూడా వున్నది—కెనడా దేశపు అంతర్జాతీయ అభివృద్ధి విభాగం (అట్టావాలోని వైఎమ్ వై. ఎమ్. సి. ఏలద్వారా) వారు సమయానికి అందించిన యాభై వేల డాలర్ల సహాయం విమెన్స్ ఇండియా ట్రస్ట్ అభివృద్ధికి ఎంతగానో తోడ్పడింది.

''ప్రస్తుతం ఈ ట్రస్ట్ వందలాదిమంది స్త్రీలకు ఉపాధి కల్పిస్తోంది. ఇంకా ఎంతోమంది ఆ సంస్థ ద్వారా సహాయం పొందడానికి అర్రులు చూస్తున్నారు. ప్రస్తుతం మా సంస్థలో కావలసినంత పని వుంది. అందుకు తగ్గట్టుగా మనుషులూ వున్నారు. ఇప్పుడు మనుష్యులను సమకూర్చుకోవడం మాకు సమస్య కాదు. కాని ఎవరు నిజంగా నిస్సహాయులో ఎవరికైతే మరెక్కడా ఆదరణ లభించదో వారికే సహాయం చేయాలన్నది మా అభిలాష'' అన్నారు కామిల.

—డాలీ రిజ్వీ



# వైద్య విశేషాలు



పక్షవాతంతో బాధపడే రోగులను తొందరగా నయం చేయడానికి, ఆపరేషన్ ద్వారా చికిత్స చేసే విధానాన్ని ఇటీవల మద్రాసు జనరల్ హాస్పిటల్‌కు చెందిన డాక్టర్ వి. నరేంద్రన్ (న్యూరో సర్జరీ ప్రొఫెసరు, ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ న్యూరాలజీ ప్రధానాధికారి) రూపొందించారు. ప్రధానంగా మెదడులో కొన్నిచోట్ల రక్తప్రసారానికి ఆటంకం కలగడంవల్ల పక్షవాతం వస్తుందనీ, ఆ ఆటంకాలను ఈ ఆపరేషన్ ద్వారా తొలగించి – రక్తప్రసారం మామూలుగా జరగడానికి అవకాశం కల్పించినప్పుడు–రోగి ఎక్కువ కాలం హాస్పిటల్‌లో ఉండనవసరం లేకుండా – త్వరితంగా కోలుకోగలడనీ ఆయన ఈ ఆపరేషన్ గురించి వివరించారు. పక్షవాతపురోగి మెదడుకు రక్తప్రసారం జరిగే విధానాన్ని మెరుగుపరచడానికి ఈ జనరల్ హాస్పిటల్‌లో ఇంజెక్షన్స్ కూడా ఇస్తున్నారట. పక్షవాతపు రోగులకు ఈ విధంగా ఇంజెక్షన్స్ ఇవ్వడం మన దేశంలో ఇదే మొదటిసారి! ఈ విధానాన్ని నలుగురు రోగులపై పరీక్షించి చూస్తే, మంచి ఫలితాలు లభించాయని తెలిసింది.

*

ఎక్స్–రే, రసాయనిక పరీక్షలు మొదలైన వాటి ప్రమేయం లేకుండా–దేహంలో పుట్టకురుపు (కాన్సర్) వ్యాధి, ఉన్నదా? లేదా? అన్న విషయాన్ని తేలికగా–ఇంజెక్షన్ ద్వారా తెలుసుకునే విధానాన్ని డాక్టర్ జార్జి ఎఫ్. స్ప్రింజర్ (నార్త్ – వెస్టర్న్ యూనివర్సిటీ – ఇమ్యూనో కెమిస్ట్రీ పరిశోధనాశాఖ డైరెక్టరు) ఆధ్వర్యంలో అమెరికన్ వైద్య పరిశోధకుల బృందం ఇటీవల కనుగొన్నది. ఈ విధానంలో ఒక 'ఏంటిజన్'ను (దీన్ని 'టి–ఏంటిజన్' అంటారు) కాన్సర్ ఉన్నదని అనుమానిస్తున్న వ్యక్తికి 'ఇంజెక్ట్' చేస్తారు. ఆ వ్యక్తికి కాన్సర్ ప్రారంభ దశలో ఉన్నా, లేక వ్యాధి బాగా ముదిరిన దశలో ఉన్నా, ఇంజెక్షన్ చేసిన చోట 24 గంటల తర్వాత చర్మంపై ఎర్రగా, ఒక మచ్చలాంటిది ఏర్పడుతుంది. స్త్రీలకు వక్షోజాలలో కాన్సర్ వ్యాపించినా, ఈ విధానం వల్ల ముందుగానే రోగాన్ని గుర్తించి చికిత్స ప్రారంభించడానికి వీలవుతుంది. ఇటీవల వక్షోజాలలో కాన్సర్ వుందని అనుమానించిన 180 మంది స్త్రీలకు 'టి ఏంటిజన్' ఇంజెక్షన్ యిచ్చి–పరీక్షించితే–వాళ్ళల్లో 80 మందికి 'బ్రెస్ట్–కాన్సర్' సూచనలు కనిపించాయని–ఆ తర్వాత జరిపిన పరీక్షలలో – వారికి ఆ వ్యాధి ఉందని రుజువైందని డాక్టర్ స్ప్రింజర్ తెలియజేశారు. కాన్సర్‌ను గుర్తించడానికి ఈ విధానం చాలా సులువుగా వుండడంతో అమెరికాలోని ఓ మందుల వ్యాపార సంస్థ – ఈ 'ఏంటిజన్' పరీక్షకు సంబంధించిన అన్ని హక్కులూ స్వాధీనపరచుకోవడం జరిగిందట.

*

నలభైఏళ్ళు పైబడి, ఆరోగ్యం సరిగ్గా లేని వారు వ్యాయామం చెయ్యడం, విపరీతమైన అలసటకు గురికావడం వల్ల గుండె దెబ్బతినే ప్రమాదం వుందని ప్రఖ్యాత హృద్రోగ వైద్య నిపుణులు, న్యూ జెర్సీ కాలేజ్ ఆఫ్ మెడిసిన్‌కు చెందిన డాక్టర్ బ్రెన్‌స్టైయిన్ అభిప్రాయపడ్డారు. ఎక్కువ ఆహారం తీసుకుని, ఆ తర్వాత అలసటకు గురికావడం, భోజనానంతరం తీవ్రమైన వాగ్వాదంలోకి దిగడం కూడా హృదయానికి మంచిది కాదని ఆయన అన్నారు.

'ఏర్ కండిషన్డ్' గదుల్లో ఆరోగ్యకరమైన గాలి లభిస్తుందని అనుకుంటే అది పొరబాటని కెనడాకు చెందిన విజ్ఞాతశాస్త్రవేత్తలు ప్రతిపాదించారు. 'ఎన్విరాన్‌మెంటల్ సైన్స్ టెక్నాలజీ' అన్న పత్రికలో ఈ విషయం గురించి రాస్తూ ఏర్ కండిషనర్స్‌లోని అల్యూమినియం అణువులు గదిలోని కాలుష్యాన్ని అధికం చేస్తాయని, తత్ఫలితంగా గాలిలోని ఆ అల్యూమినియం ధూళిని పీల్చడం వల్ల ఊపిరితిత్తులకు హానికలిగి, కొంతకాలానికి ఊపిరి పీల్చడంలో

## పి. రాజ్యలక్ష్మి

నేటి యువతులు అన్ని రంగాలలోనూ ఉత్సాహంతోనూ, ఉత్తేజంతోనూ ముందంజ వేస్తున్నారు. ఈ నవ చైతన్యం విద్యా, సాంఘిక రంగాలలోనూ, క్రీడలు తదితర పోటీలలోనూ, సాంకేతిక రంగంలో కూడా మనకు స్పష్టంగా కనిపిస్తోంది. అటువంటి ఉత్సాహవంతురాలయిన యువతులలో కుమారి పి. రాజ్యలక్ష్మి ఒకరు.

మద్రాసు ఎతిరాజ కళాశాల ద్వారా బి. ఎస్సీ ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణురాలైన రాజ్యలక్ష్మి – పచ్చయప్ప కళాశాల ద్వారా ఎమ్. ఎస్సీ పట్టం పొందారు. పాఠశాలలో చదివే రోజులలోనే అనే[illegible] వక్తృత్వపు పోటీలలో బహుమతులు గెలు[illegible]కున్నారు. రేడియో కార్యక్రమాలలో కూడా పాల్గొన్నారు. మద్రాసులో ప్రముఖ సాంస్కృతిక సంస్థ 'కళాసాగర్' 'వనిత' పత్రిక కలిసి నిర్వహించిన 'వనితా విభావరి' నాటి 'రంగవల్లరి' పోటీలో ఆమె ప్రథమ బహుమతి పొందారు. (మే ఒకటి 1978 సంచికలో ప్రచురింపబడిన 'పెళ్ళి పీట ముగ్గు' మీరు చూసే వుంటారు. ఆ ముగ్గును ఆమె ఆ పోటీలో అతి తక్కువ వ్యవధిలో రంగులలో వేశారు) గత సంవత్సరం కూడా ఈ రంగుల ముగ్గుల పోటీలో ఆమెకే ప్రథమ బహుమతి లభించడం ఇంకో విశేషం! ఈ సంవత్సరం ఆమె 'కదంబ మాల' పోటీలో కూడా బహుమతి పొందారు. పుస్తకాలు చదవడం, అల్లికలు, కుట్టుపని-ఆమె హాబీలు. కుమారి రాజ్యలక్ష్మి ఆశయాలు-ఉద్యోగం చేయడం; ఆపైన హాయిగా వివాహం చేసుకుని ఆదర్శ గృహిణిగా స్థిరపడడం.



కష్టం వాటిల్లే ప్రమాదం వుందనీ–వారు తెలియజేశారు.

*

'మలేరియా', 'ఫైలేరియా' వ్యాధులను పూర్తిగా నిరోధించే మందును రూపొందించడం సాధ్యమేనని – ఇటీవల మెల్బర్న్‌లోని వాల్టర్ అండ్ ఎలిజాహాల్ ఇన్‌స్టిట్యూట్ ఫర్ మెడికల్ రీసెర్చ్‌కు చెందిన వైద్య శాస్త్రజ్ఞుడు డాక్టర్ జి. జె. వి. నోసల్ తెలియజేశారు. పెక్కు పరిశోధనల అనంతరం–ఈ వ్యాధుల నివారణకు మందును రూపొందించడం సాధ్యమేనని రుజువైందని, అయితే ఈ మందును విరివిగా ఉత్పత్తి చేయడానికి సాంకేతికంగా కొన్ని ఇబ్బందులు ఉండడం వల్ల, మరో పది సంవత్సరాలలో దీన్ని తయారు చేయడానికి వీలవుతుందనీ ఆయన చెప్పారు. ప్రపంచం మొత్తం మీద ఇటువంటి వ్యాధుల గురించి పరిశోధన చేయడానికి కేవలం పది లేబరేటరీలే ఉన్నాయని, ఇది చాలా విచారకరమైన విషయమనీ ఆయన పేర్కొన్నారు.

*

స్త్రీలకు మొటిమలు రావడం, శరీరంపై ఎక్కువ రోమాలు పెరగడం చాలా ఇబ్బంది కలిగించే అంశాలు. ఇవి రాకుండా చేయడానికి 'డెక్సామెతాసోన్'తో చికిత్స చేసే విధానాన్ని లాస్ ఏంజిల్స్‌లోని యూనివర్సిటీ ఆఫ్ కాలిఫోర్నియాకు చెందిన ప్రొఫెసర్ – డా॥గై అబ్రహాం కనిపెట్టారు. శరీరంలో హార్మోనుల ఎక్కువ తక్కువల వల్ల చాలా వరకు ఈ రోమాలు పెరగడం, మొటిమలు రావడం జరుగుతుందనీ, 109 కేసులకు 'డెక్సామెతాసిన్' తో చికిత్స చేయగా, 80 నుంచి 90 శాతం వరకు ఎక్కువ రోమాలు గలవారి సమస్య పరిష్కరింపబడిందని, మొటిమలతో బాధపడుతున్న వారందరికీ మొటిమల బాధ తప్పిందనీ ఆయన చెప్పారు. ఐతే–ఈ మందును ఉపయోగించడం వల్ల బరువు ఎక్కువకావడం, రక్తపుపోటు ఎక్కువ కావడం కూడా సంభవించవచ్చుననీ ఆయన తెలియజేశారు. ఏది ఏమైనా – ఈ మందును విరివిగా ఉత్పత్తి చేసి మన దేశంలో కూడా ప్రచారంలోకి తీసుకువస్తే, చాలామంది స్త్రీలు సంతోషిస్తారన్నది నిర్వివాదాంశం.





# వంగ, కర్ణాటకాల వంటలు

## కాశిం హల్వా

ఈ కాశిం హల్వా (బూడిద గుమ్మడికాయ హల్వా) మన తెలుగువారే కాక ఇతర రాష్ట్రాల వారు కూడా యిష్టంగా చేసుకుంటారు. అయితే చేసే విధానంలో మార్పు ఉండవచ్చు. ఇది కన్నడ దేశస్థులు చేసే విధం.

**ఈ హల్వాకు కావలసిన వస్తువులు:** బూడిద గుమ్మడికాయ-1 (చిన్నకాయ) చక్కెర-1 కిలో, డాల్డా లేక నెయ్యి 100 గ్రా, జీడిపప్పు-50 గ్రా, ద్రాక్ష-50 గ్రా, ఏలక్కాయల పొడి, పచ్చ కర్పూరం కొంచెం.

**తయారు చేసే విధానం:** లేత బూడిద గుమ్మడికాయను తీసుకొని పై చెక్కు నెమ్మదిగా తీసి నీటితో కడగాలి. శుభ్రమైన బట్టతో నీటిని తుడిచేసి, కాయను సన్నగా తరిగి లోపల ఉండే గుజ్జును, విత్తనాలు లేకుండా చేసి, నీరు తగలకుండా రుబ్బాలి. మెత్తగా రుబ్బి, ఒక పాత్రలో తీసి ఉంచుకోవాలి.

మొదట ద్రాక్ష, జీడిపప్పును నేతిలో వేయించి ప్రక్కన ఉంచుకోవాలి. తరువాత చక్కెర పాకం పట్టాలి. లేతపాకం పనికిరాదు. తీగ పాకం తియ్యాలి. అంటుకోకుండా ఉండడానికి నెయ్యి వెయ్యాలి. రంగు అవసరమనుకొనేవారు రంగు వేసుకోవచ్చును. ఆ పాకంలో గుజ్జువేసి, గుజ్జులోని నీటినంతా లాగేవరకు గరిటతో కలియబెడుతూ ఉండాలి. ముద్దలా అయిన తరువాత వేయించి ఉంచిన జీడిపప్పు, ద్రాక్ష, ఏలకుల పొడి, పచ్చకర్పూరం వేసి సన్నటి సెగపైన ఆ పాత్రను అట్లాగే ఉంచాలి. కొంచెం ఆవిరి వచ్చిన తరువాత తీసి, వేరే పాత్రలోకి మార్చాలి. ఈ హల్వా కొద్ది రోజులు నిల్వ కూడా వుంటుంది. పిల్లలు, తినడానికి ఎక్కువ యిష్టపడతారు. చపాతి, బ్రెడ్‌లతో తినడానికి ఈ హల్వా చాలా బాగుంటుంది.

ఇదే విధంగా లేత సొరకాయను కూడ హల్వా చేసుకోవచ్చును.

కాయ సైజునుబట్టి వస్తువుల తూకం మార్చుకుంటూ వుండాలి.

—జి. విజయలత, కలువాయి

## గుగినీ

ఇది ఒకరకమైన కూర. ఇది పూరీలలోకి కూరగా బెంగాలీవారు చేసుకుంటారు.

**కావలసినవి:** పావు కాబూలీ (పెద్ద సైజు) శెనగలు, పావు బంగాళాదుంపలు, 2-పెద్ద సైజు ఉల్లిపాయలు, చిన్న అల్లపు ముక్క, 4-తేజ్ పత్తా ఆకులు, పచ్చి కొబ్బరికాయలో $\frac{1}{4}$ వంతు ముక్క, చిటికెడు పసుపు, $\frac{1}{2}$ స్పూను జీలకర్ర, $\frac{1}{2}$ స్పూను పంచదార, $\frac{1}{2}$ స్పూను మిరియపు పొడి, తగినంత ఉప్పు, పచ్చిమిరపకాయలు 2, 4 టేబుల్ స్పూనులు నూనె లేక డాల్డా.

**చేసే విధానం:** ముందు రోజు రాత్రి శెనగలు రాళ్ళు లేకుండా ఏరుకుని నీళ్ళల్లో నానబెట్టాలి. మరునాడు ఉదయం శెనగలు, బంగాళదుంపలు విడి విడిగా ఉడక బెట్టుకుని, బంగాళాదుంపలు తొక్కతీసేసి, ముక్కలుగా కోసుకోవాలి. తరువాత జీలకర్ర, ఉల్లిపాయలు, అల్లం, పచ్చిమిర్చి మెత్తగా నూరుకోవాలి. కొబ్బరి చిన్న చిన్న ముక్కలుగా చేసుకోవాలి. ఇవి అన్నీ తయారు చేసుకున్నమీదట, పొయ్యిమీద బాణలిపెట్టి నూనె లేక డాల్డా వేసి జీలకర్ర, ఉల్లి, అల్లం, పచ్చిమిర్చి కలిపి నూరిన మిశ్రమం వేసి కొంచెం వేగిన తరువాత కొబ్బరి ముక్కలు, జాజిపత్రి వేసి వేయించి అందులో ఉడకబెట్టిన శెనగలు, బంగాళాదుంప ముక్కలు, పసుపు, ఉప్పు, పంచదార వేసి కలియబెట్టి కొద్దిగా నీరుపోసి ఉడికించి దింపేయాలి. దింపిన తరువాత మిరియపు పొడి జల్లుకోవాలి. కావలసిన వారు నిమ్మకాయ రసం కూడా వేసుకొనవచ్చును.

—ఎన్. కామేశ్వరి, దుర్గాపూర్

# ప్రపంచం

ప్రపంచంలో ఈ రోజున ఏదేశ చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణమనిపిస్తోంది. అంతఃకలహాలతో కొన్ని దేశాలు క్రిందా మీదా పడుతూ వుంటే మరికొన్ని దేశాలు ఇతర దేశాల మీద కయ్యానికి కాలు దువ్వుతున్నాయి. ఇదే దారిన ఈ దేశాలన్నీ నడిస్తే ప్రపంచం ఏమవుతుందనే భయం అందరికీ సహజంగా కలుగుతోంది.

జైర్ అనే దేశం ఈమధ్య ప్రపంచ దేశాలన్నిటిని ఆకర్షించింది. కారణం అక్కడ పెద్ద పెట్టున తిరుగుబాటు జరగడం. ఈ దేశ జనాభా కేవలం రెండు కోట్లు. 'కాంగో'గా వ్యవహరించబడిన ఈ దేశం పద్దెనిమిది సంవత్సరాల క్రిందట బెల్జియన్ వలసపాలన నుంచి విముక్తి పొందింది. ఒక రోజున ప్రపంచ శాంతికి కాంగో ముప్పు తెచ్చే దేశాలలో ముందున్న దేశంగా చెప్పుకునేవారు. పేరు మార్చుకుంటే 'రంగు' మారుతుందా అని అంటారు. ఈ రోజునా పేరు మార్చుకున్న జైర్‌లో రాజకీయంగా అగ్ని పర్వతాలు బద్దలవుతూనే వున్నాయి. ప్రపంచంలో జైర్‌ని భాగ్యవంతమయిన దేశంగా చెప్పడానికి అక్కడి రాగి గనులే నిదర్శనం. జైర్‌లోని షాబా రాష్ట్రంలో ఈ రాగి గనులు విస్తారంగా వున్నాయి. మన దేశంలో కొన్ని రాష్ట్రాలు 'స్వయం పరిపాలనాధికారం' కోసం మొండిపట్టు పట్టుతున్నట్టు ఈ షాబా రాష్ట్రం కూడా మొండిపట్టుతో వుంది. అయితే అక్కడి తిరుగుబాటుదారులు దేశం నుంచి పూర్తిగా విడిపోడానికి కూడా పోరాటం సాగిస్తున్నారు. జైర్ సరిహద్దు దేశమయిన అంగోలానుంచి ఏడాది క్రితం ఈ తిరుగుబాటుదారులు జరిపిన పోరాటాన్ని జైర్ ప్రెసిడెంట్ మొబుటూ మొరాకో సైన్యం సహాయంతో నిర్దాక్షిణ్యంగా అణచివేశాడు. అయితే షాబా రాష్ట్రంలోని తిరుగుబాటుదారులు మరో సరిహద్దు దేశమయిన జాంబియా నుంచి ఈసారి దాడి జరిపారు. ఒక ప్రధాన నగరాన్ని ఆక్రమించుకున్నారు. ఈ తిరుగుబాటుదారులకి అంగోలాలోని క్యూబన్ సేనలు శిక్షణ ఇచ్చాయనీ, అల్జీరియా, సోవియట్ రష్యాలు సహాయం చేశాయనీ మొబుటూ ఆరోపించాడు. ఇందులో నిజం వున్నా లేకపోయినా మరొక విచిత్ర పరిస్థితి మటుకు ఇక్కడ చోటు చేసుకుంది. షాబా గనులలో పని చేస్తున్న పాశ్చాత్య రాజ్యాలకి చెందిన సాంకేతిక నిపుణులు కొందరు తిరుగుబాటుదారుల చేతుల్లో మరణించారు. మిగిలిన వారిని రక్షించడానికి ఫ్రెంచి, బెల్జియన్ సైనిక దళాలు 'రణరంగం'లోకి దిగాయి. షాబా తిరుగుబాటుదారులు అలా జైర్ నుంచి పలాయనం చిత్తగించారు.

షాబా రాష్ట్రంలో రాగి గనులేకాక కోబాల్ట్, యురేనియమ్ గనులూ వున్నాయి. ఈ సంపదని కాపాడడానికి జైర్ ప్రెసిడెంట్ మొబుటూ కృషి చేస్తున్నాడు. ఏ నిమిషమయినా మొబుటూ పదవీభ్రష్టుడయితే జైర్ కమ్యూనిస్టుల చేతుల్లోకి వెళ్ళవచ్చని రాజకీయ పరిశీలకులు భావిస్తున్నారు. అటువంటివి జరగకుండా ఫ్రాన్సు, బెల్జియం, అమెరికాలు మొబుటూకి 'రక్షణ' ఇస్తున్నాయి. అలా అగ్రరాజ్యాలు అటు ఇటూ జైర్‌ని 'ఆటలాడిస్తూ' వుంటే ఇక ఈ వ్యవహారం ప్రచ్ఛన్న యుద్ధానికి దారి తీస్తుందనీ ప్రపంచ యుద్ధం మన ముంగిటే వుందనీ భావించాలేమో!

## బర్మాలోనూ తిరుగుబాటు

జైర్ ఎక్కడో వుండవచ్చు కాని బర్మా మనకి సమీపంలోని దేశం. 1948లో బర్మాకు బ్రిటిష్ పాలన నుంచి స్వాతంత్ర్యం లభించింది. 1962 నుంచీ జనరల్ నివిన్ నియంతృత్వ పాలనలో బర్మా వుంది. అయితే అడుగడుగునా ఆటంకాలతోనే నివిన్ పరిపాలన కొనసాగించగలుగుతున్నాడు. ఈ ఆటంకాలన్నీ బర్మాలోని మైనారిటీ జాతులనుంచే వస్తున్నాయి. దరిదాపు మూడుకోట్ల బర్మా జనాభాలో 90 లక్షల వరకూ ఈ మైనారిటీ జాతుల ప్రజలు వున్నారు. కారెన్స్, హాచిన్స్, మన్స్ జాతులకి చెందిన ఈ మైనారిటీ వర్గాలని బర్మీయులు అణచివేస్తూనే వస్తున్నారు. 50 లక్షల కారెన్ కొండజాతి ప్రజ 1952లోనే పూర్తి స్వాతంత్ర్యం ప్రకటించుకుంది. బర్మాలో అంతర్భాగమయిన కారెన్‌జాతి నివసించే ప్రాంతం స్వాతంత్ర్యం ప్రకటించుకున్నా స్వరాజ్య దేశంగా వుండాలని జరుపుతూన్న తిరుగుబాటుని బర్మా అణచివేయడానికి కృషి చేస్తూనే వుంది. అలా ఒక దేశం పేరుకి 'ఒకదేశం'గా కనిపిస్తోన్న దేశం లోపల ఎంతో అనైక్యత వుండడంతో అక్కడి రాజకీయ పరిస్థితులు ఏ రూపంలోకైనా మారవచ్చని భయపడవచ్చు.

1964లో బర్మాలోని రాజకీయ పత్రాలనన్నిటినీ రద్దుచేసి ఒక్క 'సోషలిస్టు ప్రోగ్రాం పార్టీ'ని మటుకే గుర్తించి జనరల్ నివిన్ తన అధికారాన్ని మరింత పెంచుకున్నాడు. బర్మాకి అధ్యక్షుడు, ప్రధాని నివినే.

## ఆఫ్ఘనిస్తాన్‌లో

ఆఫ్ఘనిస్తాన్‌లో ఏప్రియల్ 27న జరిగిన 'మిలిటరీ తిరుగుబాటు'తో నూర్ మహమ్మద్ తరక్కి అధికారంలోకి వచ్చాడు. ఒకటిన్నర కోట్ల జనాభాగల ఈ ముస్లిం దేశంలో సంభవించిన పరిణామాల ప్రభావం ఇప్పుడిప్పుడే పొరుగు రాజ్యమయిన పాకిస్తాన్ మీద కనిపిస్తోంది. ఆఫ్ఘనిస్తాన్‌లో జరిగిన మిలటరీ తిరుగుబాటుకి సోవియట్ రష్యా తోడ్పడలేదనీ స్వయంగా సర్వస్వతంత్రంగా ఈ తిరుగుబాటు జరిగిందనీ నూర్ చాలా గర్వంగా పేర్కొన్నాడు. అధికారంలోకి వచ్చిన వెంటనే నూర్ సోవియట్ రష్యాతోనూ, భారతదేశంతోనూ సంబంధాలు ఆఫ్ఘనిస్తాన్ మెరుగు పరచుకుంటుందనీ, పాకిస్తాన్, ఇరాన్, చైనాలతో స్నేహంగా వుంటుందనీ ప్రకటించాడు.

## వార్తలలో వనిత

ప్రపంచంలో అత్యధిక సంపన్నురాలయిన వనితగా బ్రిటిష్‌రాణి ఎలిజబెత్‌ని చెప్పుకుంటారు. ఎలిజబెత్ చెల్లెలు మార్గరెట్. మార్గరెట్ ఈ మధ్య వార్తలలో చాలా ప్రాముఖ్యత సంపాదించింది. మార్గరెట్, ఆమె భర్త లార్డ్‌స్నోడోన్ విడాకులు తీసుకోడానికి నిర్ణయించుకున్నారు. 1540 లో ఎనిమిదవ హెన్రీ తన భార్యకి విడాకులు ఇచ్చాడు. ఆ తర్వాత ఇంతవరకూ బ్రిటిష్ రాజవంశంలో విడాకులే లేవు. 1960 లో మార్గరెట్‌కి ఆంటోని ఆమ్‌స్ట్రాంగ్ జోన్స్‌తో వివాహం జరిగింది. వివాహం తర్వాత ఆంటోని లార్డ్ స్నోడోన్ అయ్యాడు. ఈ దంపతులకి ఇద్దరు పిల్లలు. ప్రముఖ ఫొటోగ్రాఫరయిన జోన్స్ ఇప్పుడు లూసీ లిండ్సే హాగ్ అనే తారని, మార్గరెట్—లెవెలెన్ అనే వ్యక్తినీ వివాహం చేసుకోడానికి 'వేదిక' సిద్ధంగా వుంది. భార్యాభర్తలలో ఒకరు జీవించి వుండగా, విడాకులు పొందిన రెండవ వారు వివాహం చేసుకోడానికి బ్రిటన్‌లో అధికారం లేదు. అటు సోదరి ఎలిజిబెత్‌రాణి ఆగ్రహానికి గురయి, ఇటు అదృష్టానికీ దూరమవుతూంది మార్గరెట్. □


Edited & Published by B. Viswanatha Reddi for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop.

మహిళా సంక్షేమ పథకం



# రామస్వామి పెరుగుతున్న కుమార్తె భవిష్యత్తును భద్రపరచే పథకం కోసం ఆలోచిస్తున్నాడు.

scan
Bindu



రామస్వామిలాంటి ఆడ పిల్లల తండ్రులకోసం మహిళా సంక్షేమ పథకం ఒక వరప్రసాదం. ఈ పథకంలో పొదుపు చేసేధనం మీ కుమార్తెతోపాటు పెరుగుతుంది.
నేటి యువతులలో ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించి, ఆర్థిక స్వాతంత్రాన్ని పొందేటందుకు ఈ పథకం సహాయపడుతుంది.

దాదాపు 55 సంవత్సరాల అపారామైన అనుభవం గడించి. 600 కు పైగా శాఖలతో, దేశమంతటా విస్తరించిన ఆంధ్రా బ్యాంక్, అనేక ఇతర పథకాలనుకూడా ప్రవేశ పెట్టింది. అవే - భాగ్యలక్ష్మి, కిడ్డీబ్యాంక్, సంరక్ష, సంక్షేమ, జన సహాయ, కర్షక సహాయి, గృహకల్ప మరియు కల్పతరువు పథకాలు, ప్రతి పథకం ప్రత్యేకమైనదే. ఒక్కొక్క సమస్యను తీర్చడానికి ఒక్కొక్క పథకం.
అంతేకాదు పరిశ్రమలకు, బలహీనవర్గాలకు కూడా ఆంధ్రా బ్యాంక్ ఆర్థికసహాయం చేస్తోంది.

ప్రజావసరాలకై పాటుపడేదే - ఆంధ్రాబ్యాంక్

## ఆంధ్రా బ్యాంక్ వారి మహిళా సంక్షేమ పథకం రామస్వామి కోరిన పథకం. ఆపథకం రామ స్వామి కుమార్తె విద్యాభ్యాసానికి, వివాహానికి లేదా స్వయం ఉపాధి కల్పనకు ఆర్థిక సహాయం చేస్తుంది.



# ది ఆంధ్రా బ్యాంక్ లి.

కేంద్ర కార్యాలయం, సుల్తాన్ బజార్,
హైదరాబాద్-500 001.

ఒ. స్వామినాధరెడ్డి : ఛైర్మన్

KIRON/AB '78/12/TEL